# గురునానక్ వాణి

సంకలనం

భాయీ జోధ్ సింగ్

అనువాదం

డా॥ వేమరాజు భానుమూర్తి

సంపాదకులు

డా॥ ఇలపావులూరి పాండురంగ రావు




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయ సూచిక

# నివేదనం

శ్రీ గురువాణికి సంబంధించిన ప్రస్తుత సంకలనములో శ్రీ గురునానక్ దేవ్ వాణి వివిధ శీర్షికల క్రింద ప్రస్తావితమైంది. ధార్మిక, సాంస్కృతిక, సామాజిక, నైతిక విషయాలపై ఆయన ఆలోచనా సరళిని, సిద్ధాంతాలను వివరించడానికి ఇందులో కృషి జరిగింది. ఆయన ఆలోచనా పద్ధతులను, సిద్ధాంతాలను సరిగ్గా అంచనా వేయడానికి ఆనాటి పంజాబ్ పరిస్థితులను గురించి తెలుసుకోవలసి ఉంది. భారతీయ సంస్కృతికి ప్రాతిపదికయైన వేద మంత్రోచ్చారణ, మొట్టమొదట పంజాబు సీమలోనే జరిగిందంటే ఆ గడ్డ ఎంత మహత్తరమైనదో అర్థమవుతుంది. వేద మంత్రాలను సుస్పష్టంగా, సస్వరంగా ఉచ్చరించడం ఎలాగో నేర్చుకోవడం కోసం స్నాతకులు అన్ని ప్రాంతాలనుంచి ఆ కాలంలో పంజాబుకు వచ్చి అధ్యయనం చేసేవారు. సంస్కృత భాషకు సర్వోత్కృష్టమైన వ్యాకరణాన్ని రచించిన పాణిని పంజాబులోనే పుట్టాడు. ఆయన పెరిగి పెద్దవాడైంది కూడా ఇక్కడే. తరువాత బౌద్ధ ధర్మం కూడా చాలాకాలం వరకు ఇక్కడే వర్ధిల్లి అత్యున్నత స్థాయిని అందుకుంది. సుప్రసిద్ధమైన ప్రాచీన తక్షశిలా విశ్వవిద్యాలయం పంజాబు సీమలోనిదే. అయితే గురునానక్ అవతరణ నాటికి బౌద్ధమతము కూడా క్షీణదశ చెందింది. బ్రాహ్మణ మతానికి ప్రాధాన్యం పెరిగింది. జైన మతావలంబులు కూడా అనేక పట్టణాలలో నివసిస్తూండేవారు. కాని వారందరూ హిందూ సమాజంలో అంతర్భాగంగా మిళితమైపోయారు. హిందువులు, ముస్లిములు, అధిక సంఖ్యాకులుగా ఉంటూ వచ్చారు. గోరఖ్‌నాథ్ సంప్రదాయానికి చెందినవారూ, చెవులు కుట్టించుకున్న యోగులు హిందువులు, ముస్లిములు అనే వివక్ష లేకుండా జన సామాన్యంపై తమ ప్రభావాన్ని చూపుతూ ఉండేవారు. ప్రజలు వారందరినీ సిద్ధులని భావించేవారు. అణిమాద్యష్ట సిద్ధులు, యంత్రాలు, మంత్రాలు, తంత్రాలు, వీటన్నింటికీ నిత్య జీవితంలో ఎంతో ప్రాధాన్యం ఉండేది. మహాత్ములైన యోగులను ఆశ్రయించి, వారిని సేవించి, గురువులుగా భావించి, పూజించి, వారి ఆశీర్వచన ప్రభావం వల్ల సర్వసంపదలను పొందాలనే ఆకాంక్షతో అందరూ వారి ఎడల ఎంతో భయభక్తులు ప్రదర్శించేవారు. హిందువులు, ముస్లిములు వగైరా ఉభయ మతాలకు చెందినవారు కూడా ఈ గురువుల వద్ద దీక్షను స్వీకరించేవారు. దీనికి పూరణ్ రాంఝ రచనలే సాక్షి హిందువులు కేవలం నాలుగు వర్గాలకే పరిమితం కాలేదు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులలో అనేక అంతర్వర్గాలుండేవి. ఒకే వర్గానికి చెందిన వారిలో సైతం ఉచ్చ-నీచ భేదాలుండేవి. ఈ నాలుగు వర్గాలలో దేనికీ చెందని వారు పంచములు కూడా ఉండేవారు. వీరిని

చండాలురని వ్యవహరించేవారు. వీరి స్పర్శకూడా అపవిత్రమని, మహాపాపమని భావించే వారు. అయితే ఆధునిక భారతీయ తత్వవేత్తలు జాతి భేదానికి వ్యతిరేకులే అయినా వీరు సైతం వర్ణ వ్యవస్థను ఆమోదిస్తున్నారు. మానవుడు ఒంటరిగా బ్రతికే నిరపేక్ష వ్యక్తి కాడు. సమాజంలో ప్రతి వ్యక్తీ తన గుణకర్మల ననుసరించి ఏదో ఒక వర్గానికి సన్నిహితుడుగా ఉంటూనే ఉంటాడు. అనగా, చాతుర్వర్ణ్య వ్యవస్థ దైవికమైనదని, ఆత్మపరమైనదని, అంగీకరిస్తే ఆత్మవివేకము, నిర్వహణ సామర్థ్యము, ఉత్పాదన కౌశలము, సేవాపరాయణత, ఏ సమాజమునకైనా అనివార్యమని దాని అర్థం. సమాజ వ్యవస్థను తీర్చిదిద్దవలసిన బాధ్యత విచారశీలురైన విద్వాంసుల కర్తవ్యము. సమాజంలో శక్తి మంతమైన వర్గము ఇట్టి సామాజిక వ్యవస్థను తప్పకుండా ఆమోదించి బలపరుస్తూంటుంది. కార్యకుశలురు నిర్వహిస్తూ ఉంటారు. సేవాప్రవృత్తులైన కర్మిష్ఠులసాయంతో వారు సర్వ వ్యవహారాలను నడుపుతూ ఉంటారు. అన్ని కాలాలలోనూ ఈ సిద్ధాంతానికి బలము లభిస్తూనే ఉండడానికి కారణం వ్యక్తి సమాజానికి చెందినవాడు కావడమే. ఇందువల్ల వ్యక్తిత్వ వికాసానికి ఇది ఒక మహత్తరమైన సాధనంగా పరిణమించింది. ఇందువల్ల సమాజంలో వానికి సురక్షితమైన స్థానం లభించడం అవసరమైంది. అందువల్ల తన అభీష్టానుసారం అవసరమైన సహాయం విశేషంగా లభిస్తోంది. అందువల్ల చాతుర్వర్ణ్య వ్యవస్థకు అతీతంగా వ్యవహరించడానికి కూడా వ్యక్తులకు వీలు కలుగుతోంది. విద్వాంసులు, జ్ఞానులు, శక్తిమంతులు, క్రియాశీలురు, సుశిక్షితులైన కర్మిష్ఠులు, కార్యకర్తలు, మనుష్యులలోని నిర్మాణాత్మకమైన అభిరుచులననుసరించి, తమ తమ ప్రావీణ్యతను బట్టి తమ తమ వర్గాలను నిర్ధారించుకుంటూ ఉంటారు.

ఈ దేశంలో హిందువులు రాజరికం చెలాయిస్తున్నప్పుడు ఈ వ్యవస్థ చక్కగా చలామణిలో ఉండేది. దానిననుసరించి ప్రతివ్యక్తి తన గుణకర్మలననుసరించి తన వర్ణాన్ని ఏర్పరచు కొనేవాడు. దానిని తన ఇష్టానుసారం మార్చుకోగలిగేవాడు కూడా. కాని, జనాభా వృద్ధి అయిన కొలది వారి వారి గుణకర్మలను పరీక్షించి, పరిరక్షించడం దుస్సాధ్యమై పోయింది. అందువల్ల బ్రాహ్మణుల ఇంటిలో పుట్టినవారు బ్రాహ్మణులయ్యారు. అయితే బ్రాహ్మణ ధర్మ కర్మాచరణం లేశమాత్రమైనా లేకపోయినప్పటికీ బ్రాహ్మణుడుగా పరిగణించడం ప్రారంభమైంది. కాలక్రమేణా అగ్రవర్ణాలవారు తమ అధికారాన్ని దృఢంగా పదిలపరుచుకున్నారు. తమ కర్తవ్యాన్ని విస్మరిస్తూ వచ్చారు. తమ పదవిని పదిల పరచుకోవడం కోసం జనన మరణ సిద్ధాంతాన్ని కూడా సృష్టించారు. ప్రతి జీవికీ పునర్జన్మ కలదని, అది తన ఇచ్చానుసారమే తనకు యోగ్యమైన ఆయా వర్ణాలలో జన్మిస్తూ ఉంటుందనీ, అందుచేత ఆయా వర్ణాశ్రమ ధర్మాలను పాటిస్తూనే ప్రతివారు ఆత్మోన్నతికి పాటు పడవచ్చుననీ ప్రతిపాదించారు. కాని యీ వాదం, ఆమోద

యోగ్యంగా కనిపించదు. దీనిననుసరించి, బ్రాహ్మణుడై పుట్టినవాడు ప్రతివాడూ త్యాగశీలుడూ, విద్యాప్రియుడూ, జ్ఞాననిధి కావాలి. శూద్రులలో భక్తుడు జన్మించడానికే వీలు లేదు. కాని, ఇందుకు విరుద్ధంగా ఎన్నో సంఘటనలు జరిగాయి.

ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థ వల్ల హిందూ సమాజంలో మరికొన్ని దోషాలు కూడా తలెత్తాయి. వర్ణాశ్రమ ధర్మానుసారం కేవలం క్షత్రియులు మాత్రమే అస్త్రశస్త్రాలను ధరించడానికి, ప్రయోగించడానికీ అర్హులు. అయితే ప్రతి సమాజంలోనూ కార్మికుల సంఖ్య సైనికులకంటే అధికంగానే ఉంటుంది. దీని పరిణామమే దేశరక్షణకు కావలసినంత మంది సైనికులు లభించక పోవడం. మరొక దుష్పరిణామమేమనగా రాజధర్మ నిర్వహణ దేశరక్షణకే పరిమితమై ఉండేది. ప్రజల స్వాతంత్ర్యం వారివారి ధర్మానుసారం పరిమితమై ఉండేది. వారి మధ్య కలహాలు యుద్ధాలు కూడా సంప్రదాయ సిద్ధంగానే జరుగుతూ ఉండేవి. అందువల్ల తమ తమ జీవన సరళికి విఘాతం రానంతవరకు పాలకులెవ్వరూ అనే ఆలోచనే వారికుండేది కాదు. రాజ్యం ఎవ్వరిదయినా ప్రజా జీవితం మామూలుగా సాగిపోతూంటే చాలనుకొనేవాళ్ళు ప్రజలు. అందువల్ల దేశం విదేశీయుల దురాక్రమణకు తరుచు గురి అవుతూ ఉండేది.

కాని ముస్లిములు ఈ దేశాన్ని జయించి తమ పరిపాలనను ఏర్పరచినప్పుడు హిందువులకు మరికొన్ని సమస్యలు తలెత్తాయి.

ఈ పురాతన భారతీయ జగత్తులో, అనగా హిందూ జగత్తులో ఒకే ఆదర్శంతో రెండు విభేదక శక్తులు ప్రవేశించాయి. అందువల్ల భారతీయ జీవన సరళిలో, సంస్కృతి, సంప్రదాయాలలో సైతం గొప్ప మార్పు వచ్చింది. ఇందులో ప్రధానంగా చెప్పుకోవలసింది ఎనిమిదో శతాబ్దిలో అరబ్బులు సింధు ప్రాంతంపై సాధించిన విజయం. ఆ తరువాత పదో శతాబ్దంలో ఆఫ్ఘనిస్తాన్‌ను దోచుకున్న తురుష్కులు తమ ఆధిపత్యాన్ని భారతావనిపై నెలకొల్పుకున్నారు. ఆఫ్ఘనిస్తాన్ ఆదిలో భారతదేశంలో అంతర్భాగంగానే ఉండేది. కాని తరువాత తరువాత విడిపోయింది. ఈ తురుష్కులు పన్నెండో శతాబ్దం ప్రారంభంలో పంజాబును జయించారు. అప్పటినుంచీ పంజాబు ఇస్లామ్ ప్రభావానికి లోబడి పోయింది. పదమూడో శతాబ్దం నాటికి తురుష్కులు ఉత్తర భారతదేశంలో పశ్చిమ బెంగాల్ వరకూ తమ పరిపాలన నెలకొల్పుకొని ఢిల్లీ కేంద్రంగా సమస్త భూభాగం పై తమ ఆధిపత్యాన్ని నెలకొల్పుకున్నారు. ఈ తురుష్క సామ్రాజ్యం పద్దెనిమిదో శతాబ్దం వరకూ ఎంతో శక్తిమంతంగా కొనసాగింది. అరబ్బులకూ, తురుష్కులకూ కూడా ఇస్లామ్‌నుంచే విశేషమైన

ప్రేరణాశక్తి లభించింది. భారతీయ సంస్కృతి, హిందూ తాత్విక దృక్పథంపట్ల ఇస్లామ్‌కు అవగాహన తక్కువ, అసహ్యం ఎక్కువ.

దైవప్రేరితమైన ఇస్లామ్ మతలక్ష్యం కాఫిర్‌లుండే హిందూ దేశంలో పైగంబర్ బోధించిన నిజమైన మతాన్ని వ్యాపింపచేయటమే. ఈ విధమైన దృఢ నిశ్చయంతో ఇస్లామ్ భారతదేశంపై దాడి చేసింది. వారి లక్ష్యం ఈ దేశాన్ని దోచుకుని అమూల్యమైన వస్తు సంపదను కొల్లగొట్టడమే. కాని వేరు కాదు. అందువల్లనే తురుష్కులు హిందువులను జయించి వారి ఆస్తిపాస్తులను పూర్తిగా దోచుకునేవారు. ఆ విధంగా ఎంతో ఆర్థిక లాభాన్ని కూడా పొందేవారు. భగవంతుని పేరుతో దైవ సేవకులుగా భావించుకుని, వారు హిందువులతో యుద్ధాలు చేసేవారు. ఈ విధంగా వారు ఆధ్యాత్మిక పరిణతికి అధికారులు కూడా అయ్యారు. ఈ విధంగా ఆర్థికలాభం కోసం, ఆధ్యాత్మిక లాభంకోసంకూడా వారు ఎంతో పాటుపడేవారు. వారు తురుష్క పద్ధతిలో విజయం సాధించారు. హింస, దోపిడీ, మతాల మార్పిడి కోసం భారీ ఎత్తున ఉద్యమాన్ని కొనసాగించారు. భారతీయ సభ్యతతో ఇస్లాం ఢీ కొనడం వల్ల దేశంలో అత్యంత విపత్కర పరిస్థితి ఏర్పడింది.

అరబ్బులకీ, తురుష్కులకీ, ప్రేరణాశక్తి, అన్నీ కూడా ఇస్లామ్ నుంచే లభించాయని పెక్కుమంది విద్వాంసులు అభిప్రాయ పడ్డారు. చరిత్రకుల అభిప్రాయం కూడా ఇదే. ఇస్లామ్ అవతరణకు అరబ్బులు వేర్వేరు జాతులుగా ఉండేవారు. పరస్పరం కలహించుకుంటూ ఉండేవారు. ఇస్లామ్ వారిలోని ఆరాధనా భేదాలను రూపుమాపి ఏకేశ్వరారాధనా పరులుగా తీర్చిదిద్దింది. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధించింది. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి అరబ్బులు ఏకమై ఒక మహాశక్తిమంతమైన కూటంగా తయారయ్యారు.

అయితే, ఆ సేతు శీతాచలము, సోమనాథ్ నుండీ పూరీ వరకు నాలుగు చెరగులా వ్యాపించిన హిందూ సంస్కృతి దురాక్రమణదారులైన వారిని ఎందుకు ప్రతిఘటించలేకపోయింది ? దండెత్తి వచ్చిన ముసల్మానుల కంటె హిందువుల సంఖ్య ఎన్నో రెట్లు ఎక్కువ. అంతేకాదు, ఒక్కడే బ్రహ్మ అన్న జ్ఞానం వారికి ఉపనిషత్తుల నుంచి లభించింది కూడా. అయినా వారు ఏకేశ్వరోపాసనకు బదులు ఎంతోమంది దేవతలను పూజించి, ఆరాధించేవారు. హిందూ సమాజం అనేక వర్ణములు, జాతుల క్రింద విడిపోయింది. ముసల్మానులవలె సమైక్యంగా ప్రతిఘటించటానికి వీరికి వీలు కలుగలేదు. గురునానక్ దేవ్ ఈ బలహీనతను గుర్తించారు.

ఆయన కాలంలో భారతదేశంలో నివసిస్తూండే ముసల్మానులలో అధిక సంఖ్యాకులు విదేశాల నుంచి వచ్చిన వారు కారు. వారందరూ ఈ దేశంలోనే జన్మించి పెరిగి పెద్దవారైన వారు.

వారికి హిందువులతో అత్యధిక సన్నిహిత సంబంధాలుండేవి. అందుకని వారిని ఈ దేశంనుంచి తరిమి వేయడం ఆయన లక్ష్యం కాదు. ఏది తనకు ఆనందాన్ని కలిగిస్తుందో, అదే అందరికీ ఆనందాన్ని కలిగిస్తుందని ఆయన ప్రబోధించారు. ఎవరు తను పరమాత్మను ప్రేమిస్తారో, వారు అందరినీ ప్రేమిస్తారు. పండును బట్టి చెట్టును గుర్తించవచ్చు. ఆ విధంగానే ఆయా వ్యక్తుల వ్యవహార సరళిని బట్టి, వారి స్వభావాన్ని తెలుసుకోవచ్చు. ఆ మహానుభావుల ప్రబోధాన్ని అవగతం చేసుకోకుండా, ఆయా అవతారాలను నమ్ముకోవడం వల్ల ఏమీ ప్రయోజనం ఉండదు.

ముసల్మానులు ఒకే దేవుడు సమస్త ప్రపంచాన్ని సృష్టించాడనీ, అందువల్ల మానవులందరూ అన్నదమ్ములనీ మనసారా విశ్వసించి, ఈ సిద్ధాంతాన్ని బాగా ప్రచారం చేశారు. అయితే ఆచరణలో మాత్రము ముసల్మాను మతాన్ని స్వీకరించిన వాడినే సోదరుడిగా భావించేవారు. హిందువులలో నిమ్న జాతులవారు, తురకలతో సన్నిహిత వ్యాపార సంబంధాలు కలవారు, బహు సంఖ్యాకులు ఇస్లామ్ వైపు ఆకర్షితులయ్యారు. ఆ మతంలోనైనా తమకు సమానత్వం లభిస్తుందనే ఆశతో వారంతా ముసల్మానులయినప్పటికీ, మతం మార్పిడి వల్ల వారి ఆశలు సంపూర్ణంగా సఫలం కాలేదు. ముసల్మానులలో కూడా జాతి భేదం లేకపోలేదు. భారతదేశానికి వచ్చిన తరువాత వారిలో వర్ణ భేదం లేకపోలేదు. భారతదేశానికి వచ్చిన తరువాత వారిలో వర్ణ భేదాలు చోటు చేసుకున్నాయి. వారిలో ఇరువర్గాల వారి మధ్య సంప్రదాయాలలో, ఆచార వ్యవహారాలలో పొడుకున్న తేడాల వల్ల వారు ఉభయులూ పరస్పరం దూరంగా ఉంటూ వచ్చారు. పైకి ఎన్ని తేడాలు ఉన్నప్పటికీ, వీరిలో వీరు పరస్పరం సహకరించుకొనేటట్టు చేయడం ఎలాగ, అనేది గురునానక్ ఎదుర్కొన్న విషమ సమస్య. అందువల్లనే ఆయన పరమ సత్య సాక్షాత్కారానికి పిమ్మట, 'అసలైన హిందువులెవ్వరూ లేరు ; అసలైన ముస్లిమ్ ఎవ్వరూ లేరు !', అని ప్రకటించారు. దాని అర్థము - ఎవరు ఏ మతం ముద్ర వేసుకుని, ఆ ప్రకారమే జీవించినప్పటికీ, మానవులందరూ సమానులే. వారు తమ వ్యక్తిగత కర్మానుసారం పరమాత్మకు సన్నిహితులైనా అవుతారు, దూరులైనా అవుతారు, అని ప్రబోధించారు. ఆయన దేశము, వర్ణము, జాతి మొదలయిన భేదాలను ఎన్నడూ పాటించలేదు. ఆయన దృష్టిలో మానవులు రెండు రకాలు - గురుముఖులు, మనోముఖులు. భగవద్భక్తులందరూ గురుముఖులు. వారి జీవితం సత్యశివ సుందరమైనది. వారికి అందరూ ఒకే దేవుని బిడ్డలైనందున సోదర తుల్యులు. మనోముఖులైనవారు స్వలాభ పరాయణులు. స్వార్థం కోసం నిర్భయంగా అబద్ధాలాడే వాళ్ళు, దగాకోరులు, మోసగాళ్ళు, పాషండులు. అలాంటి వాళ్ళు ఏ మతావలంబులైనప్పటికీ వారికి ఇహలోకంలోనూ, పరలోకంలో కూడా సుఖముండదు.

ఈ సత్యాన్ని స్పష్టపరచటం కోసమే ఆయన తన తత్వ విచారాన్ని ప్రచారం చేశారు. అందుకనే బాలా అనే హిందువుణ్ణి, మర్దానా అనే ముసల్మానునీ తన అనుచరులుగా చేసుకొన్నారు. ఈ ఇద్దరినీ భాయీ (సోదరు)లుగా భావించేవారు. సుల్తాన్‌పూర్ నుంచి తమ పర్యటన ప్రారంభించి సైద్‌పూర్‌లో భాయీ లాలో ఇంట్లో మకాం పెట్టారు. బ్రాహ్మణుల దృష్టిలో ఈ లాలో శూద్రుడు. ఈ విషయమై ఆనాడు సమాజంలో లోకులందరూ పలువిధాల భావించారు. ఆ ఊళ్ళో బ్రాహ్మణుడైన దివాను ఇంటిలో ఎందుకు వెళ్ళక పోవడంతో లోకులు మరింతగా వ్యాఖ్యానించుకున్నారు. బ్రాహ్మణుల ఇంట జరిగిన ఆ విందుకు ఎందుకు వెళ్ళలేదని ఎవరో అడుగగా, ఏమని జవాబు చెప్పారంటే, "విందుకు వినియోగించిన వస్తువులన్నీ ఆయన స్వయంగా కాయకష్టం చేసి సంపాదించినవి కాక ఇతరుల దగ్గర నుంచి అన్యాయంగా, బలవంతంగా, తీసుకున్నవేనని, అందుచేత ఎంత పవిత్రంగా, శుచిగా, రుచిగా తయారు చేసినప్పటికీ, ఆ భోజనం నిజానికి ఎంతో అపవిత్రమైనది. అయితే లాలో ఇంటిలో ఎండురొట్టె, బండి తోలి ఎంతో కష్టపడి సంపాదించినది, కనుక అది సంపూర్ణంగా పవిత్రమైనదే" అని.

గృహస్థులై సాంసారిక జీవన మగ్నులైన వారికి, ఆధ్యాత్మిక విచారం కుదరదని, హిందువులు సాధారణంగా నమ్మేవారు. బహుశా ఆశ్రమ విభజన పై ఆధారపడిన జీవన సరళి ఫలితంగా ఇలాంటి నమ్మకం ప్రబలి ఉండవచ్చు. ఆశ్రమ ధర్మాలననుసరించి ప్రతివ్యక్తి పాతిక సంవత్సరాల వయస్సు వచ్చేవరకు బ్రహ్మచర్యాశ్రమంలో ఉండి విద్యార్జన సాగించేవాడు. ఆ తరువాత గృహస్థాశ్రమాన్ని స్వీకరించి, మరొక ఇరవైఐదు సంవత్సరాలు సాంసారిక జీవనాన్ని కొనసాగించేవాడు. ఏభై సంవత్సరాల వయస్సు వచ్చేసరికి వాన ప్రస్థాశయం ప్రారంభమయ్యేది. ఈ ఆశ్రమంలో, ధార్మిక సాహిత్యాన్ని పఠించి, పరిశీలించి, సంశోధనకు హెచ్చు కాలాన్ని వినియోగించేవాడు. చివరకు తురీయాశ్రమాన్ని అంటే సన్యాసాన్ని స్వీకరించి సమస్త లౌకిక లంపటాల నుంచి బయట పడేవారు. కరతల భిక్ష, తరుతల వాసంలో సర్వదా ఆధ్యాత్మిక చింతనలో నిమగ్నుడై ఉండడమే సన్యాసి ధర్మమని భావించేవారు. ఇతరులకు ధర్మోపదేశం చేయడం కూడా ఆయన కర్తవ్యంగానే భావించేవారు. కొంతమంది చిన్నతనంలోనే సన్యసించి శిష్య ప్రశిష్యులను సమకూర్చుకునేవారు. శ్రమలేకుండా, కాయకష్టం లేకుండా కావలసిన వేషభూషలను, నిత్య జీవితావసరాలను సంపాదించుకోవడం కోసం చాలామంది సన్యాసాన్ని కూడా స్వీకరించేవారని ప్రతీతి. అందువల్ల కాలక్రమేణా సన్యాసి సమాజానికి ఆర్థికంగా భారంగా తయారయ్యాడు. మఠాలను స్థాపించి ఉదర పోషణం కోసం శస్త్రాస్త్రములు ధరించి గృహస్థులను అదిరించి, బెదిరించి, ధనాన్ని సంపాదించేవారు. గురునానక్ దేవ్ సుమేరు పర్వతం వరకూ

వ్యాపించి ఉన్న సిద్ధులతో చర్చలు జరుపుతూ, "సిద్ధులు ఇప్పుడు పర్వతాలవైపు ఆకర్షితులై అక్కడే ఉండిపోతున్నారు. ఈ పరిస్థితులలో సామాన్య ప్రజలకు దారి చూపేదెవరు ?" అని ప్రశ్నించారు. ఈ పరిస్థితిని గమనించిన తరువాతనే గురునానక్ దేవ్ త్యాగాన్ని నిరసిస్తూ ప్రబోధించారు. గృహస్థాశ్రమంలో ఉంటూ కూడా సత్య నిష్ఠ వలన, సదాచార వ్యవహారముల వలన, ఆత్మోన్నతిని పొందగలరని ఆయన ఉపదేశించారు. ఆది కాలంలో శ్రీ కృష్ణ పరమాత్మ సైతం భగవద్గీతలో కర్మయోగమే సన్యాసము కంటె ఉత్తమమైనదని ప్రవచించారు. కాని సామాన్య జనులు ఈ ఉపదేశం వలన లాభాన్వితులు కాలేకపోయారు. హిందువులలో ధర్మ విచారము, ఆత్మోన్నతి మార్గములను అతి గుప్తంగా "గుహ్యం, గుహ్యతమం" అనుకుంటూ, అందరికీ అందుబాటులో లేకుండా చేశారు. ఈ రహస్యాన్ని అధికారి అయిన వారికి తప్ప అన్యులకు ఉపదేశించరాదని నిషేధించారు. ఇందువలన జన సామాన్యంలో అధిక సంఖ్యాకులు స్వార్థపూరితులై, సంప్రదాయాలు, కర్మ కాండలనే పట్టుకు ప్రాకులాడేవారు. అసంఖ్యాకులైన దేవీ, దేవతల విగ్రహాలను పూజిస్తూ, వాటికి పాలు, పండ్లు, వగైరా, నిత్యం నివేదనలు వేస్తూ ఉండేవారు. ఈ పరిస్థితులలో సమస్త సమాజాన్ని శక్తిమంతం చేయడానికి అవసరమైన చర్యలను గురించి ఎవ్వరూ ఆలోచించే వారేకారు. ముసల్మానులను మ్లేచ్ఛులనేవారు. వారితో భోజన భాజనాది సంబంధాలుంచుకునేవారు కారు. తురకల పాలనలో హిందువులే మహంతులు, దివానులుగా ఉద్యోగాలు చేసేవారు. ఈ విషయమై గురునానక్ దేవ్ సూక్తులను సావధానంగా పఠించిన వారికి ఆయన ఆలోచనా సరళి సుస్పష్టం కాగలదు.

గురునానక్ దేవ్ ప్రాచీన సంస్కృతీ, సంప్రదాయాలలో ఎలాంటి మార్పులు తీసుకువచ్చారో, ఈ మార్పుల ఫలితంగా ఆయన శిష్యులు అందరూ సుదృఢమైన సిక్కు సమాజంగా ఎలా రూపొందారో ఇప్పుడు వివరిస్తాను.

భారతీయ ధర్మ గ్రంథాలన్నీ ఓం (ੴ) కారములోనే ప్రారంభమవుతాయి. ఇది 'అవ్' అనే ధాతువు నుండి ఉదయించినదని వైయాకరణులు వివరించారు. 'రక్షించుట', అని దీని అర్థం. ఇది స్వీకారోక్తికి ప్రతీకమని ప్రొఫెసర్ మాక్స్ ముల్లర్ అన్నారు. 'అవును', 'అలాగే', అనే అర్థంలో ప్రాచీనులు దీన్ని వాడుతున్నట్టుగా ఆయన వ్రాశారు. ఈ శబ్దము సృష్టికి పూర్వమే నిరంకార రూపం నుండి ఉత్పత్తి అయినదని యోగుల అభిప్రాయము. ఇది సమస్త విశ్వంలో కూడా వ్యాపించి ఉన్నదని వారి విశ్వాసము. ఆయా జంతువులు చేసే ధ్వనులను బట్టి వాటిని గుర్తించినట్లుగానే ఓంకారము పరతత్వమనీ, పరబ్రహ్మమనీ భావించేవారు. ఉపనిషత్తుల కాలంలో ఈ అర్థంలోనే ఇది బహుళ వ్యాప్తమైంది. కాని కాలాంతరంలో ఈ ఓంకారము, అ, ఉ, మ – అనే

విడి అక్షరాల సమ్మేళనమని భావించి, ఆ అక్షరాలకు ప్రత్యేకార్థం కూడా చెప్పుకునేవారు. ఈ మూడు అక్షరాలు జాగ్రత్, స్వప్న, సుషుప్తి ఈ మూడు అవస్థలను తెలియపరుస్తాయని కొందరన్నారు. మరి కొంతమంది బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు ఏకైక ప్రతీకగా వీటిని భావించారు. గురునానక్ దేవ్ దీనికి ఒకటి అంకె జతచేర్చి, ఇది ఒక్క నిరాకారునికి ఏకైక చిహ్నమని ప్రబోధించారు. "1 ఓం" ('੧ ੴ') ని 'ఏక్ ఓంకార్' అని ఉచ్చరించడం ద్వారా దీనిని ధ్రువపరిచారు. దీనితో నిరాకారుడు ఒక్కడే అని స్పష్టం చేశారు. అది ఒక్కటే పూజనీయమైనదని ఉపదేశించారు. ఈ విధంగా ఉపదేశించి, తన శిష్యులెవ్వరూ ఇతర దేవతలను పూజింపరాదని అనుశాసించారు. సత్యస్వరూపం అంతకు ముందే అందరూ గుర్తించారు. కాని, 'కర్త పురుష'డని దానిని నిర్వచించడం ద్వారా ఆరు దర్శనముల కంటె విలక్షణమైన తన సిద్ధాంతాన్ని గురునానక్ దేవ్ నిరూపించుకున్నారు. సాంఖ్యము, ఈశ్వరుని అస్తిత్వాన్ని ఏ మాత్రం గుర్తించదు. యోగము ఈశ్వరుని అస్తిత్వాన్ని గుర్తిస్తుంది. కాని సాంఖ్యము, పురుషుని, ప్రకృతిని అనాదిగా స్వీకరిస్తుంది. కాని సాంఖ్యము, పురుషుని, ప్రకృతిని అనాదిగా స్వీకరిస్తుంది. అది ఈశ్వరుడు సృష్టికర్త అని అంగీకరించదు. న్యాయ, వైశేషికాలు, రెండూ ఈశ్వరుని జగత్ పరిపాలకుడుగా, కర్మఫల ప్రదాతగా అభివర్ణించాయి. కాని, ఈశ్వరుడు ప్రపంచానికి నిమిత్తకారణమే కాని ఉపాదాన కారణం కాదు. వారి అభిప్రాయాన్ని బట్టి పరమాణువులు శాశ్వతములు. అవే ప్రపంచానికి ఉపాదాన కారణములు. జైమిని తన సూత్రాలలో ఈశ్వరుని గురించి ప్రస్తావించనే లేదు. శ్రీ శంకరాచార్యుల వారు జీవోత్పత్తి, సృష్టిక్రమాల పై మాయ ప్రభావాన్ని నిరూపించారు. ఈ మాయ సత్యమూకాదు, అసత్యమూ కాదు. ఇది సత్యాసత్యము కాని అనిర్వచనీయము అంటే మాటల్లో చెప్పేందుకు వీలు లేనిది. మాయా ప్రభావం వల్లనే బ్రహ్మ పరిమితికి లోనయి జీవుడవుతాడు. బ్రహ్మ తటస్థుడు. ప్రపంచం మాయ ప్రదర్శించే లీల. కాని గురునానక్ దేవ్ జీవ, జగత్తులు నిరాకారుని ఆదేశానుసారమే రూపొందుతున్నాయని ప్రబోధించారు.

ప్రపంచము, ప్రకృతి లేక మాయ ఆడుకునే ఆట అనీ, పురుషునికి ప్రకృతి మాయా వరణాన్ని చీల్చుకొని బయట పడనిదే స్వరూప జ్ఞానం కలుగదనీ విశ్వసించేవారు. లౌకిక వ్యవహారాలను ప్రతిబంధకంగా భావించి వాటిని త్యజించడం వల్లనే ఆత్మోన్నతి కలుగుతుందని నమ్మటం సహజం. అయితే సమస్త కార్యక్రమాలూ 'ఆయన' ఆదేశానుసారమే జరుగుతాయని గురునానక్ దేవ్ ప్రబోధించారు. ఆ ఆదేశాన్ని గుర్తించి ఆ ప్రకారం నడుచుకుంటూ ప్రాపంచిక కార్యాలను నిర్వర్తించేవారికి ఉత్తరోత్తరా ఆత్మవికాసం తప్పక కలుగుతుందని కూడా ఆయన

ఉపదేశించారు. 'ఆదేశం' అర్థమైన వారికి అహంకారం దానంతటదే తొలగిపోతుందని ఆయన వక్కాణించారు. అనగా నిష్కామకర్మ ప్రతిబంధకం కాదనీ, ఆత్మోన్నతికి అది ఒక అమోఘమైన సాధనమనీ కూడా ఉపదేశించారు. అందువల్లనే సిక్కు మతావలంబులు ఒక సక్రియ సమాజంగా రూపొందారు.

కర్త నిర్భయుడు. నిర్వైరి. అందువలన ఆయనను ఆరాధించేవారు సైతం నిర్భయులు, నిర్వైరులు అవుతారు. ఆయన అజుడు, అయోని సంభూతుడు అని అభివర్ణించారు. దీని ద్వారా ఆయన పరమాత్మ అవతారాలెత్తడన్న వాదాన్ని నిరాకరించారు, ఖండించారు. అందువల్ల ఆయన విగ్రహారాధనను కూడా తీవ్రంగా నిరసించారు. ఆయన స్వయం ప్రభువు, అంటే తనంతట తాను వెలిశాడు. ఆయనను ఎవ్వరూ సృష్టించలేదు.

జీవాత్మ ఉత్పత్తి కూడా పరమాత్మ వల్లనే జరిగింది. అది ఆయన అంశ. ఆయన ఆదేశానుసారం జీవాన్ని ధరించిన వ్యక్తిలో ఆ పరంజ్యోతి అంశ ప్రజ్వలిస్తూ ఉంటుంది. జీవాత్మ, పరమాత్మ అంశలో పూర్తిగా మిళితమై పోతుంది. జీవజ్యోతి పరమేశ్వర రూపాన్ని ధరిస్తుంది. అయితే వేదాంతులు అంగీకరించినట్టు అది బ్రహ్మత్వాన్ని పొందజాలదని ఆయన స్పష్టం చేశారు. 'జపుజీ' లో గురునానక్ ఇందుకు ఒక మంచి ఉదాహరణను పేర్కొన్నారు : ఏ విధంగా నదీనదాలు, సెలయేళ్ళు అన్నీ చివరకు సముద్రంలో కలిసిపోయినప్పటికీ, అపారపారావారాన్ని గురించి తెలుసుకోజాలవో, అలాగే భక్తజనులు పరమేశ్వరునిలో లీనమైపోయినప్పటికీ ఆయన లోతుపాతులను గుర్తించలేరు అంటాడు.

సాధనకు సంబంధించినంత వరకు సర్వ మునులు, ఋషులు యోగాన్ని ఆశ్రయించారు. దాని పరమావధి సమాధి. ఈ సమాధి స్థితిని సాధించడం కోసం ఉపనిషత్కాలము నుంచి ఏకాంత స్థలములో సాధన చేయాలని ఉపదేశించారు. ఆదేశించారు. వివేకానందస్వామి యోగ సూత్రాలను ఆంగ్లభాషలోకి 'రాజయోగం' అనే పేరుతో అనువదించారు. దాని అనుబంధంలో ఆయన శ్వేతాశ్వతరోపనిషత్తు నుంచి ఒక ఉదాహరణను పేర్కొన్నారు : పర్వత గుహలలో, సమతల భూములలో కంకర, ఇసుక లేని ప్రదేశాల్లో జనసంచారము, రొద, జల ప్రపాతము లేని చోట, మనస్సుకు నచ్చిన చోట, అనుకూలమైన చోట, కన్నులకు అందంగా కనబడిన చోట, మనస్సుకు ఏకాగ్ర మొనర్చి, ధ్యానమగ్నుడై, యోగ సాధన చేయుట ఉచితమని వివరించబడిన సూక్తిని గురించి ప్రస్తావించారు.

వ్యక్తి మనసులో రెండు అంశాలున్నాయి - ఒకటి ధ్యానము, రెండవది స్మరణము. ఏకాంత స్థానంలో కూర్చుని ధ్యానమగ్నుడు కావచ్చు. కాని స్మరణము అన్య కార్యమగ్నుడై

నప్పటికీ కొనసాగించవచ్చు. గురునానక్ దేవ్ స్మరణము ద్వారా సాధన సాగించుకోవచ్చునని ఉపదేశించారు. మనుష్యుడు తనను సృష్టించిన కర్త పరమాత్ముని విస్మరించాడు. అందుకనే తాను దుఃఖం అనుభవిస్తున్నాడు. పరమాత్మ సర్వవ్యాపి. స్మరణములో మగ్నుడైన జిజ్ఞాసువు ఈ సత్యాన్ని తన అంతస్సులో నెలకొల్పుకోగలిగినప్పుడు పాపకర్మలను చేయజాలడు. అంతరాత్మలో జ్యోతి ప్రజ్వలితమవుతుంది. యోగసాధనలో ఎనిమిది అంశా(అంగా)లున్నాయి. దీనినే 'అష్టాంగ యోగం' అంటారు. గురునానక్ దేవ్ సైతం ఈ అష్టాంగ మార్గాన్నే ఉపదేశించారు. ఆయన చెప్పిన ప్రకారము, ప్రథమాంగము సంతృప్తి. రెండవది సేవ. మూడవది గురువాణి పఠనము. ఉపదేశానుసారము ఆచార వ్యవహారములను నిర్వహించుట. దాని తరువాత సత్సంగము, సంకీర్తనము గురించి ప్రస్తావించారు. సంగీతమునకు మనస్సును ఏకాగ్ర మొనర్చు లక్షణము కలదు. ఏకాగ్ర చిత్తుడై గురువాణిని అధ్యయనము చేసిన, దాని ప్రభావము మనస్సుపై హెచ్చుగా ఉంటుంది. ఆ తరువాత నామజపము, సంస్మరణము, ముఖ్యమైనవి.

పవిత్రమైన మనస్సులో నామం నివసించ గలుగుతుంది. అందువల్లనే ఆయన బోధించిన మతానికి సత్ప్రవర్తన పునాది అయింది. సత్య జిజ్ఞాసలో మనస్సుకు తోడ్పడని ఆచారాలు, నియమాలు, నిష్ఠలూ, నిష్ప్రయోజకములు.

సమస్త సృష్టినీ రచించినవాడు ఈశ్వరుడే. అందరి అంతరంగంలో జ్యోతి ప్రజ్వలిస్తూ ఉంటుంది. సర్వజీవులు సమానులే. వారిలో ఉచ్చ-నీచ భేదాలు లేవు. పురుషులకే కాక, స్త్రీలకు కూడా అది వర్తిస్తుంది. వేదకాలములో లేదా ఉపనిషత్కాలములో స్త్రీల స్థితిగతులు ఎంత ప్రశస్తంగా ఉన్నప్పటికీ, గురునానక్ కాలము నాటికి స్త్రీలను శూద్రులతో సమానంగా చూసేవారన్న సత్యాన్ని కాదనలేము. పైగా స్త్రీలను శూద్రులుగా భావించి వారిని విద్యా విహీనులుగా ఉంచేవారు. గురునానక్ దేవ్ దీనిని నిశితంగా ఖండించారు. స్త్రీ, పురుషులు, ఉభయులూ, సర్వ విధాలా సరిసమానులనీ, అన్ని రంగాలలోనూ సరిసమానంగా పురోగమించవచ్చునని ఆయన స్పష్టంగా ప్రబోధించారు. గోరఖ్‌నాథుడు స్త్రీలను కటూక్తులతో అధిశంసించారు. గురునానక్ దేవ్ దీనిని తీవ్రంగా ఖండించారు. స్త్రీ సమస్త పురుష జాతికి తల్లి అని, అలాంటి వ్యక్తి ఏ విధంగా నీచురాలు, కాగలదని ప్రశ్నించారు.

గురునానక్ దేవ్ లోకుల భాషలో, అందరికీ తెలిసేటట్టు తమ ఉపదేశాలను అందచేసి సన్మార్గగాములను చేశారు. జాతి భేదాన్ని, వర్ణ వ్యవస్థను, నివృత్తి మార్గాన్ని నిరసించారు. సర్వ సమానత్వాన్ని ప్రబోధించి, అన్యాయాన్ని, అక్రమాన్ని నశింపచేసి, నవ సమాజాన్ని, ప్రజాస్వామ్య పునాదులపై నిర్మించడానికి కృషి చేశారు. అందులో కృతకృత్యులయ్యారు కూడా.

శ్రద్ధాళువులు తాము స్వయంగా సంఘసేవ చేయాలని శ్రీ గురునానక్ దేవ్ ప్రబోధించారు. కాయకష్టం చేసి స్వార్జితంతో జీవితం గడపాలనీ, అందులో కొంత వెచ్చించి, అవసరమైన వారికి తగు సహాయం చేయాలని కూడా ఉపదేశించారు. సత్యాన్ని రక్షించడం కోసం అవసరమైతే కత్తి దూయడానికి కూడా వెనుదీయరాదని, ఇతరులను కూడా ఈ మార్గానికి సుముఖులను చేయడానికి ప్రయత్నించాలనీ చెప్పారు. అనగా ప్రతివ్యక్తి ఆయా సమయాన్ని, సందర్భాన్ని బట్టి బ్రాహ్మణుడుగా, క్షత్రియుడుగా, వైశ్యుడుగా, శూద్రుడుగా వ్యవహరించాలని ఆయన ఉద్బోధించారు. ఆయనకు ముందు రామానందుడు, కబీరు, చైతన్యుని వంటి భక్తులెందరో ధార్మిక క్షేత్రంలో ఉచ్చనీచ భేదాలను నిర్మూలించడం కోసం కృషి చేశారు. అయితే వారెవ్వరూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎట్టి ప్రబోధమూ చేయలేదు. కాని గురు గ్రంధ సాహిబ్‌లో చేర్చిన కబీరు, నామదేవ్‌ల రచనలను బట్టి వారిని ప్రభుత్వం హింసించిందని తెలియ వస్తుంది. గురునానక్ తన సమకాలీన ప్రభువుల అత్యాచారాలను సుస్పష్టమైన భాషలో తీవ్రంగా నిరసించారు. అన్యాయ, అక్రమాలకూ, అధికార దుర్వినియోగానికి వ్యతిరేకంగా ఆయన సాగించిన ఉపదేశాల వలన ప్రజల దృష్టి తమ శోచనీయమైన స్థితిపై మరలింది. ఆ తరువాత కొంత కాలానికి ఈ అత్యాచారాలను ప్రతిఘటించడానికి ప్రజలు సంసిద్ధులయ్యారు. దేశవాసులందరిపైన ఆయనకు గల హృదయపూర్వకమైన ప్రేమ, స్నేహానురాగాలు, సంప్రదాయ సిద్ధమైన భేదాలకు అతీతంగా బాబరు కొనసాగించిన దురాక్రమణను ఖండించిన సందర్భంలో స్పష్టంగా వెల్లడి అయ్యాయి. వస్తుతః పరస్పర వైరులైనప్పటికీ, హిందువులు, ముసల్మానులు, ఆ వైరభావాన్ని విస్మరించి, ఆయనను సమానంగా ప్రేమించి, గౌరవించడం ప్రారంభించారు. ఆయన అవసాన సమయంలో వారు ఉభయుల మధ్య తగాదా చెలరేగింది. గురునానక్ తమ వాడంటే తమ వాడని వారు పరస్పరం కలహించుకున్నారు. ఆయన స్థాపించిన నవ సమాజంలో ప్రతి నిత్యము ప్రార్ధన గీతం ఈ క్రింది మాటలతో ముగుస్తుంది.

"నానక్ నామ్ చఢ్‌దీ కలా
తేరే భాణే సర్‌బత్తదా భలా"

"నామము స్ఫూర్తిని నానకు పెంచెను
పంచిపెట్టె నా పలుకులు మంచిని."

ప్రథమ భాగము

# పరా భౌతిక సిద్ధాంతము

## ఈశ్వరుడు

ఏక్ ఓంకార్, సతినాము, కర్తా పురుష్, నిర్భవు
నిర్వైరు, అకాలమూరతి, అజూనీ, సైభంగ్, గురుప్రసాది
- మూలమంత్ర, జపు.

పరమ తత్త్వ వాచకమయిన ప్రణవము - ఓంకారము - ఒకటే సత్యనామం. అదే సృష్టికర్త, పరమ పురుష వాచ్యము, నిర్భయము, నిర్వైరము, అకాలమూర్తి, అయోనిజనితము, స్వయం భూతత్త్వము. గురు ప్రసాదమే దానికి సాధనము.

## అకాల్ పురుఖ్ దీ ఏకతా

1. దూజీ మాయా జగత్ చిత్త వాసు ||
కామ క్రోధ అహంకార బినాసు || 1 ||
దూజా కౌణ్ కహా నహి కోయీ ||
సభ మహి ఏకు నిరంజను సోయీ || రహాఉ ||
దూజీ దురమతి ఆఖై దోయి ||
ఆవై జాయీ మరి దూజా హోయి || 2 ||
ధరణి గగని నహ దేఖు దోయి ||
నారీ పురఖ సబాయీ లోయి || 3 ||
రవి ససి దేఖు దీపక్ ఉజియాలా ||
సరబ్ నిరంతరి ప్రీతము బాలా || 4 ||
కరి కిర్పా మేరా చిత లాయియా ||
సతిగురి మో కౌ ఏక్ బుఝాయియా || 5 ||
ఏకు నిరంజను గురముఖి జాతా ||
దూజా మారి సబది పఛాతా || 6 ||
ఏకో హుకము బరతై సభ లోయీ ||
ఏకసు తే సభ ఓపతి హోయీ || 7 ||
రాహ దోవై ఖసము ఏకో జాణు ||
గుర్ కై సబది హుకము పఛాణు || 8 ||
సగల రూప వరన్ మన్ మాహీ ||
కహు నానక్ ఏకో సాలాహీ || 9 ||

— గాఉడీ అసటపదీయా

2. ఏకో ఏక కహై సభు కోయీ హఉమై గరబు వియాపై ||
అంతరి బాహరి ఏకు పఛాణై ఇఉ ఘరు మహలు సిఞాపై ||
ప్రభు నేడై హరిదూరిస జాణహు ఏకో స్రిసటి సబాయీ ||
ఏకంకార అవరు నహీ దూజా నానక్ ఏక్ సమాయీ ||

— రామకలీ దఖణీ ఓంకార్

## అకాల పురుషుని ఏకత్వము

మాయ వలన ద్వైత భావము జగత్తు యొక్క చిత్తములో ప్రవేశించి వసిస్తుంది ॥ కామక్రోధ అహంకారముల వలన వినాశము కలుగుతుంది ॥॥ నీవు వినా వేరెవ్వరు వేరెక్కడా లేరు ॥ అందరిలో ఉన్నది ఆ నిరంజనుడు ఒక్కడే ॥॥ ఇలాకాక వేరు వేరని చెప్పువాడు దుర్మతి ॥ జీవులు వస్తారు, పోతారు, మరణిస్తారు. వేరు రూపము ధరిస్తారు ॥॥ భూమ్యాకాశాలలో వేరెవ్వరూ కనబడరు ॥ స్త్రీ పురుషులలో సర్వలోకములలో వేరెవ్వరు లేరు. సూర్యచంద్రాది ఉజ్జ్వల దీపములలో నేను ఒకే సవితను, ఒకే ప్రియతముని నిరంతరం దర్శిస్తున్నాను. దాని కృప వల్లనే నా చిత్తము లగ్నమైనది. సద్గురువు నాకు ఒకే ఒక తత్త్వం చూపించాడు. గురూపదేశమున నిరంజనుని ఒక్కని గురించి తెలుసుకొన్నాను. తదితరమును కొట్టివేశాను. శబ్దమును గుర్తించాను. సర్వలోకములందు వాని ఆజ్ఞలే పాటించబడుతాయి. ఒక్కని నుండే సకలము ఉత్పత్తి అవుతున్నది. మార్గములు రెండు. స్వామి ఒక్కడే. ఇది తెలుసుకో. గురూపదేశమున ఆదేశము తెలుసుకో. సకల రూపములు వర్ణములు మనసులోనివే. ఒక్కటే స్తుత్యమని నానక్ ఉక్తి. (223)

2. అందరూ అంటూంటారు, ఒక్కడే ఒక్కడే, అని. కాని గర్వము, అహంకారము, సర్వలోకము లందు వ్యాపించాయి. లోపల, వెలుపల ఒక్కటి గుర్తించు ; అప్పుడే తెలుసుకోగలుగుతావు. వాని తావు, ధామం. ప్రభువు సమీపంలోనే ఉన్నాడు. దూరంగా ఉన్నాడని అనుకోకు. సృష్టి అంతా ఒక్కటే. ఒక్క ఓంకారము తప్ప మరేదీ లేదు. అంతట ఒక్కడే వ్యాపించి ఉన్నాడని నానక్ అంటాడు. (730)

3. ఏక్ అచారు రంగ్ ఇకు రూపు ||
పఉణు పాణీ అగనీ అసరూపు ||
ఏకో భవరు భవై తిహు లోయి ||
ఏకో బూఝై సూఝై పతి హోయీ ||
గిఆను ధిఆను లే సమసరి రహై ||
జిసనో దేయి కిర్ పా తే సుఖు పాఏ ||
గురు దుఆరై ఆఖి సుణాఏ || 7 ||

— రామకలీ దఖణీ ఓంకార్

4. అలాహు అలఖు అగము కాదరు కరణహారు కరీము ||
సభ దునీ ఆవణ జావణీ ముకాము ఏకు రహీము || 6 ||
ముకాము తిసనో ఆఖీయే జిసు సిసి నహోవీ లేఖు ||
అసమాను ధరతీ చలసీ ముకాము ఓహీ ఏకు || 7 ||
దిన్ రవి చలై నిసి ససి చలై తారికా లఖ పలోయి ||
ముకాము ఓహీ ఏకు హై నానకా సచ్ బగోయీ || 8 || || 7 ||

-- సిరీ రాగు అసటపదీయా

5. సచు పురాణా హోవై నాహీ సీలా కదే న పాటై ||
నానక్ సాహిబు సచో సచా తిచర్ జాపీ జాపై || 1 ||

— వార్ రామకలీ, సలోక్ 1, పౌడీ 9

6. ధంను సు కాగదు కలమ్ ధంను ధంను భాండా ధను మసు ||
ధను లేఖారీ నానకా జిని నాము లిఖాయియా సచు || 1 ||

— వార్ మలార్, సలోక్ 1, పౌడీ 28

7. తూ కర్తా పురఖు అగము హై ఆపి సృసటి ఉపాతీ ||
రంగ్ పరంగ్ ఉపారజనా బహు బహు బిధి భాతీ ||
తూం జాణహి జిని ఉపాయీయే సభు ఖేలు తుమాతీ ||

— వార్ మాంఝ్, పౌడీ 1

3. ఆహారము ఒకటే. రంగు, రూపము ఒకటే. వాయువు, జలము, అగ్ని వాని స్వరూపమే. ఒకే భ్రమరము ముల్లోకములో భ్రమిస్తూ ఉంటుంది. ఆ ఒకటి అర్థము చేసుకుంటే పరమార్థం లభిస్తుంది. జ్ఞానంలో, ధ్యానంలో, సమరసంగా ఉండే గురుముఖుడు అతి అరుదు. ఎవరిని అనుగ్రహిస్తే వానికే సుఖం లభిస్తుంది. గురువు ద్వారమున ఇది వినవచ్చు. (930)

## అకాల పురుషుడు చిరంతన సత్ స్వరూపుడు

4. అల్లా అగోచరుడు, అగమ్యుడు, సృష్టికర్త సర్వసమర్థుడు, దయామయుడు. సకల జగత్తు ఉదయిస్తుంది, లయిస్తుంది. ఉండే వాడు రహీము ఒక్కడే. లలాట లిఖితము లేనివాడే శాశ్వతుడని అంటారు. భూమ్యాకాశములు రెండు ఏదో ఒక రోజున పోయేవే. అచలముగా ఉండేవాడు వాడు ఒక్కడే. పగలు సూర్యుడూ, రాత్రి చంద్రుడూ తిరుగుతూనే ఉంటారు. అసంఖ్య తారాసందోహం కూడా తిరుగుతూ లుప్తమై పోతుంది. అచలుడు వాడు ఒక్కడే. నానక్ చెప్పేది వాస్తవం. (69)

5. సత్యమెన్నటికీ పాతబడదు. శిల వలె ఎన్నటికీ పగలదు. నానక్ ఆరాధించే ప్రభువు సత్యస్వరూపుడు. వానిని జపిస్తూ ఉండు, ఎప్పుడూ జపిస్తూ ఉండు. (955-956)

6. ఆ కాగితము ధన్యము. ఆ కలము ధన్యము. సత్యస్వరూపుని సత్యనామము లిఖించినవాడు నిజముగా ధన్యజీవి. (1291)

## అతడు జగత్కర్త – జగన్నివాసి

7. సృష్టికర్తవు నీవు. అగమ్యుడవు నీవే. ఈ సృష్టిని స్వయముగా ఉత్పన్నము చేసినవాడవు. రంగు రంగుల ఈ సృష్టి బహురూపమైనది. ఈ వైవిధ్యాన్ని సృష్టించిన నీకే దీని రహస్యం తెలుసు. ఇదంతా నీ లీల. (138)

8. తృతీయా బ్రహ్మ, బిసను మహేసా ||
దేవీ దేవ ఉపాయే వేసా ||
జోతీ జాతీ గణత న ఆవై ||
జిని సాజీ సో కీమతి పావై ||
కీమతి పాయి రహియా భరపూరి ||
కిసు నేడై కిసు ఆఖా దూరి || 4 ||

– బిలావలు, థితీ పౌడీ 4

9. కరణ్ కారణ్ సమరుధు హై కహు నానక్ బీచారి ||
కారణు కర్తే వసి హై జిని కల్ రఖీ ధారి ||

– సహసకృతీ, సలోక్ 5

10. సహస తవ నైన్ నన నైన్ హహి తోహి
కౌ సహస మూరతి ననా ఏక్ తోహీ ||
సహస పద బిమల నన ఏక్ పద గంధ్ బిను
సహస తవ గంధ్ ఇవ చలత మోహీ || 2 ||
సభ మహి జోతి హై సోయి ||
తిస్ కై చానణి సభ మహి చానణు హోయి || 1 || 7 || 9 ||

– ధనాసరీ

11. బలిహారీ కుదరతి వసితి తేరా అంతు న జాయీ లఖిఆ || రహావు ||
జాతి మహి జోతా జోతి మహి జాతా
అకల కలా భర్పూరి రహితా ||
తూం సచా సాహిబు సిఫతి సుఆల్లిఉ
జిని కీతీ సో పారి పయియా ||

–వార్ ఆసా, సలోక్ 1, పౌడీ 12

8. త్రిమూర్తులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. బహు వేషధారులైన దేవతలను నీవే సృష్టించావు. నీ జ్యోతి వలన జన్మించిన జాతులను గణించలేము. సృష్టించినవాడే విలువ కట్టగలడు. విలువ కట్టేవాడు వాడే సర్వవ్యాపకుడు. వానిని గురించి ఏమి చెప్పను ? ఎవరికి దగ్గరగా ఉన్నాడో, ఎవరికి దూరంగా ఉన్నాడో, ఎలా చెప్పగలం ? (839)

9. అంతా విమర్శించి నానక్ చెప్పేదేమంటే, కరణము, కారణము వాడే. సమర్థుడు వాడే. సకల కారణాలకు మూలకారణుడైన వాని చేతిలో అన్ని కారణాలూ ఉన్నాయి. వాడే యీ కళను ధరించినవాడు. (1353)

## అతడు సర్వాంతర్యామి, కాని నిర్లిప్తుడు

10. సహస్రములు నీ నయనములు. ఒక్క నయనము కూడ నీది కాదు. సహస్రములు నీ మూర్తులు. కాని ఒక్క మూర్తి కూడ నీది కాదు. సహస్ర పదములు నిర్మలములు నీవి. కాని ఒక్క పదము కూడ నీది కాదు. గంధ హీనుడవు నీవు. సహస్ర గంధములు నీవి. నీ యీ లీల నా మనస్సును ముగ్ధపరచింది. అన్నింటిలో జ్యోతి ఉన్నది. అదే ఆ జ్యోతి. వాని వెలుగులో సర్వము వెలుగొందుచున్నది. (13)

11. సకల ప్రకృతిలో నిండి ఉన్న వానికి నా జోహారులు. నీ అంతు తెలియలేము. జాతిలో జ్యోతి. జ్యోతిలో జాతి. కళ కాని కళ నీది. నీవు పరివ్యాప్తుడవు. నీవే నిజమైన స్వామివి. నీ స్తవము కమనీయము. నిన్ను స్తుతించిన వారు భవసాగరము దాటి పోయారు. (469)

12. భై విచి పవణు వహై సద వావ్రా ॥
భై విచి చలహి లఖ దరీయావ్రా ॥
భై విచి అగని కఢై వేగారి ॥
భై విచి ధర్‌తీ దబీ భారి ॥
భై విచి ఇందు ఫిరై సిరి భారి ॥
భై విచి రాజా ధరము దుఆరు ॥
భై విచి సూరజు భై విచి చందు ॥
కోహ్ కరోడీ చలత న అంతు ॥
భై విచి సిధ బుధ సురనాథ్ ॥
భై విచి ఆడాణే ఆకాస్ ॥
భై విచి జోధ మహాబల్ సూర్ ॥
భై విచి ఆవహి జావహి పూర్ ॥
సగలియా భవ్ లిఖియా సిరి లేఖు ॥
నానక్ నిర్‌భవ్ నిరంకారూ సచు ఏకు ॥
నానక్ నిర్భవ్ నిరంకారూ హోరి కేతే రామ్ రవాల్ ॥
కేతీయా కన్హ కహాణీయా కేతే వేద బీచార్ ॥
– వార్ ఆసా, సలోక్ 1, 2, పౌడీ 4

13. జాగి జాగి ధాపి సదా నిరవైరు ॥
జనమి మరణి నహీ ధంధా ధైరూ ॥
– రామకలీ దఖణీ, ఓంకార్ పౌడీ 15

14. జగు తిస్ కీ ఛాయియా జీసు బాపు న మాయియా ॥
నా తిసు భైణ్ న భరావు కమాయియా ॥
నా తిసు ఓపతి ఖపతి కుల జాతీ
ఓహు అజరావరు మని భాయియా ॥ 2 ॥
తూ అకాల్ పురఖు నాహీ సిరి కాలా ॥
తూ పురఖు అగంమ అలేఖ్ నిరాలా ॥
సత సంతోఖి సబది అతి సీతలు సహజ
భాయి లివి లాయియా ॥ 3 ॥
— మారూ సోలహే

## వాడు నిర్భయుడు, నిర్వైరి

12. భయము వల్లనే పవనుడు సదా వీస్తున్నాడు ; భయము వల్లనే ప్రవహిస్తున్నాయి, లక్షలాది నదులు. భయము వల్లనే అగ్ని వెట్టి చాకిరి చేస్తున్నది ; భయము వల్లనే భూమి భారముచే వంగిపోతున్నది. భయము వల్లనే ఇంద్రుడు భారాన్ని శిరసావహించి తిరుగుతున్నాడు ; భయము వల్లనే సూర్యుడు, భయము వల్లనే చంద్రుడు, కోట్ల క్రోసులు పయనిస్తూ ఉన్నారు. అంతం లేదు ; భయము వల్లనే సిద్ధులు, బుద్ధులు, సురులు, నాథులు. భయము వల్లనే ఆకాశము వ్యాపించింది ; భయము వల్లనే శూరులు, మహాబలి యోధులు. భయము వల్లనే వస్తాయి, పోతాయి గుంపులు ; అందరి మస్తకముపై ఉన్నది భయరేఖ. నిర్భయుడు, నిరంకారుడు నిజముగా కేవలము ఒక్కడే. ఆ నిర్భయుడే, నిరంకారుడే ; ఎందరు రాముల్లో వారి చరణ ధూళిలో ఉన్నారు. ఎందరు కృష్ణులు, మరి ఎన్ని కృష్ణ కథలు.

ఎన్ని వేదములు, మరెన్ని వ్యాఖ్యానములు. అన్నీ అతడే. (464)

13. యుగ యుగముల సంస్థాపకుడు సదా నిర్వైరి. జనన మరణములు లేనివాడు. వేరేమీ పని లేనివాడు.

## అకాల మూర్తి

14. ఈ జగము వాని ఛాయ. వానికి తల్లి, తండ్రి, ఎవరూ లేరు. వానికి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు లేరు. జనన మరణములు, కులము, జాతి లేవు. వాడు అజరామరుడు. మనోహరుడు. నీవు అకాల పురుషుడవు. నీ శిరస్సుపై కాలుడు లేడు. నీవు అలేఖ్య పురుషుడవు. అగమ్యుడవు. విలక్షణుడవు. 'సత్' అనే పదం ఎంత తృప్తికరమైనది. ఎంత చల్లని శబ్దం. ఈ శబ్ద మహిమ వల్లనే సహజంగా నీ యందు గురి కుదిరింది. (1038)

15. అలఖ్ అపార్ అగంమ్ అగోచర్ నా తిసు కాలు న కర్మా ||
జాతి అజాతి అజనీ సంభవు నా తిసు భావు నా భర్మా ||
సాచే సచియార్ విటహు కుర్బాణు ||
నా తిసు రూప వరను నహిఁ రేఖియా సాచే సబది నీసాణు || రహాఉ ||
నా తిసు మాత పితా సుత బంధప నా తిసు కాము న నారీ ||
అకుల నిరంజన అపర పరంపరు సగలీ జోతి తుమారీ ||

-సోరఠి

16. నా తిసు బాపు న మాయి కిని తూ జాయియా ||
నా తిసు రూపు న రేఖ బరన్ సచాయియా ||
నా తిసు భుఖ్ పియాస్ రజా ధాయియా ||

– వార్ మలార్, పౌడీ 2

17. ఆప్నై ఆపు సాజియో ఆప్నై రచియో నాఉ ||
దుయీ కుదరతి సాజీ ఏ కరి ఆసణుడిఠో చాఉ ||
దాతా కర్తా ఆపి తూఁ తుసి దేవహి కరహి పసాఉ ||

-వార్ ఆసా, పౌడీ 1

18. పపె హాతిసాహా పరమేసరు వేఖణ్ కు పరపంచు కీఆ ||
దేఖై బూఝై సభకిఛు జాణై అంతరి బాహరి రవి రహిఆ || 24 ||

- ఆసా పటా

19. తూఁ దరీఆఉ దానా బీనా మైఁ మఛులీ కైసే అంతు లహా ||
జహ జహ దేఖా తహ తహ తూఁ హై తుంఝ్ తే నికసీ ఫూటి మరా ||
న జాణా భే ఉ న జాణా జాలీ ||
జా దుఖు లాగై తా తుఝై సమాలీ || 1 || || 31 || రహావు ||

— సిరీ రాగు

## అతడు జన్మ రహితుడు

15. అలక్ష్యుడు. అహారుడు. అగమ్యుడు. అగోచరుడు. వాడు కాలరహితుడు. కర్మరహితుడు. వాడు అయోనిజాడు. స్వయంభువు. వానికి భావము లేదు. భ్రమ లేదు. వాడు చిరంతన సత్యస్వరూపుడు. వానికి నా జోహారులు. వానికి రూపము, వర్ణము, రేఖ ఏమీ లేవు. సత్య శబ్దమున గుర్తించబడువాడు. వానికి మాతాపితలు, పుత్రులు, సోదరులు అంటూ ఎవరూ లేరు. వాడు కామరహితుడు. వానికి స్త్రీ లేదు. వాడు అకులుడు, నిరంజనుడు, పరంపరాతీతుడు. ఈ సకల విశ్వము నీ జ్యోతి. (597)

16. వానికి తల్లి లేదు. తండ్రి లేదు. వానికి జన్మ ఇచ్చిన వారెవరు ? వానికి రూపురేఖలు లేవు. అయినా అన్ని వర్ణములు వానివే. వానికి ఆకలి లేదు. దప్పిక లేదు. వాడు చిరతృప్తుడై ఉంటాడు. (1279)

## వాడు స్వయం ప్రభువు

17. వాడు ఆత్మ సంభవుడు. వాడే నాకు రచయిత. ప్రకృతి రచయిత కూడా వాడే. ప్రకృతి వాని ఆసనము. సుఖాసీనుడై చూశాడు. దాతవు కర్తవు స్వయముగా నీవే. నీవు తుష్టుడవు. కృపాదాతవు. (463)

## వాడు చిత్–స్వరూపుడు

18. వాడు పరమ పిత పరమేశ్వరుడు. వాడు తన దృష్టితో ప్రపంచమును రచించినవాడు. వాడు చూశాడు. అర్థం చేసుకున్నాడు. సర్వజ్ఞుడు. సర్వము లోపల వెలుపల నిండియున్నవాడు. (433)

## అతని లోతుపాతులు ఎవరికీ తెలియవు

19. నీవు నదివి. నీవు సర్వము తెలిసిన వాడవు. మాయవాడవు. నేను చేపను, నీ అంతు ఎట్లు తెలుసుకోగలను ? నేను ఎక్కడెక్కడ చూచిన అక్కడక్కడ నీవే కనబడుతున్నావు. నేను నీ నుండి విడిపోతే మరణిస్తాను. నాకు ఎలా తెలుస్తుంది. ఎవరు జాలరో ? వాని వల ఎటువంటిదో ? ఆపత్కాలంలో నిన్నే స్మరిస్తూ ఉన్నాను. (25)

20. సాలాహి సాలాహి ఏతీ సురతి న పాయియా ॥
నదీఆ అతై వాహ పవహి సముంది న జాణీ అహి ॥
సముంద సాహ్ సుల్ తాన్ గిర్ హాసేతీ మాలు ధను ॥
కీడీ తులి న హోంవనీ జే తిసు మనహు న వీసరహి ॥ 23 ॥

— జపు పౌడీ 23

20. వందిమాగధులు నిన్నే స్తుతిస్తున్నారు. అయినా వారికి నీ అంతు ఎలా తెలుస్తుంది. నదులు, ఏరులు పోయి సాగరములో కలుస్తాయి. కాని వాటికి సాగరము లోతు ఏమి తెలుస్తుంది ? క్షితిసాగర పతులు, రాజాధిరాజులు, ధనికులు, గిరితుల్యులు, అందరూ కీటక సదృశులు. ప్రభువును స్మరించిన పుణ్యాత్ములకు వీరెవ్వరూ సరితూగరు. (5)

# జగదుత్పత్తి

హుకమీ హోవని ఆకార్, హుకమి న కహి యా జాయీ
హుకమీ హోవని జీవ్, హుకమి మిలై వడియాయీ.
- జపు, పౌడీ 2

1. ఆదేశము వల్లనే ఆకారము, ఆదేశము అనిర్వచనీయము. ఆదేశము వల్లనే జీవము. ఆదేశము వల్లనే మహనీయత. (1)

21. అర్బుద్ నర్బుద్ ధుంధూకారా ॥
ధరణి న గగనా హుకము అపారా ॥
నా దిను రైని న చందు న సూరజూ సున్న సమాధి లగాయిదా ॥ 1 ॥
ఖాణి న బాణి పవుణ్ న పాణి ॥
ఓపతి ఖపతి న ఆవణ్ జాణి ॥
ఖండ్ పతాళ్ సపత్ నహీం సాగర్ నదీ న నీరూ వహోయిదా ॥ 2 ॥
నా తది సురగు మధు పయ్యాలా ॥
దోజక్ భిసతు నహీ ఖై కాలా ॥
నరకు సురగు నహీ జమ్మణు మరణా నా కో ఆయి న జాయిదా ॥ 3 ॥
బ్రహ్మ బిసను మహేసు న కోయీ ॥
అవరు న దీసై ఏకో సోయీ ॥
నారి పురఖు నహీం జాతి న జనమా నా కో దుఖు సుఖు పాయిదా ॥ 4 ॥
నా తది జతీ సతీ బన్‌వాసీ ॥
నా తది సిధ్ సాధిక్ సుఖ్‌వాసీ ॥
జోగీ జంగమ్ భేఖున కోయీ నా కో నాధు కహోయిదా ॥ 5 ॥
జప తప సంజమ నా బ్రత్‌పూజా ॥
నా కో ఆఖి వఖాణై దూజా ॥
ఆపై ఆపి ఉపాయి విగసై ఆపై కీ మతి పోయిందా ॥ 6 ॥

నా సుచి సంజము తులసీ మాలా ॥
గోపీ కాను న గవూ గోఆలా ॥
తంతు మంతు పాఖండు న కోయీ నా కో వంసు వజాయిదా ॥ 7 ॥

కరమ్ ధరమ్ నహీ మాయియా మాఖీ ॥
జాతి జనము నహీ దీసై ఆఖీ ॥
మమతా జాలు కాలు నహీం మాథై నా కో కిసై ధిఆయిదా ॥ 8 ॥

నా కో ములా నా కో కాజీ ॥
నా కో సేఖు మసాయికు హాజీ ॥
రయ్యతి రావు న హౌయే దునియా కో కహణు కహోయిదా ॥ 11 ॥

21. అర్బుదములు, నిర్బుదములు, యుగములు, పొగ, అంధకారము వ్యాపించాయి. అప్పుడు గగనము లేదు. ధరణి లేదు. అప్పుడు ఉన్నది కేవలము అపారమైన ఆదేశమే. దినములు లేవు. రాత్రులు లేవు. సూర్యుడు లేడు. చంద్రుడు లేడు. అప్పుడు శూన్య సమాధిలో కూర్చున్నాడు. ఖనులు లేవు. వనములు లేవు. నీరు లేదు. గాలి లేదు. ఏమీ లేదు. జనన మరణములు లేవు. రాకపోకలు లేవు. నవఖండములు, సప్తసాగరములు, పాతాళము ఏవీ లేవు. నదులలో నీరు లేదు. ప్రవాహము లేదు. అప్పుడు స్వర్గము, పాతాళములు, త్రిలోకములూ లేవు. పాపపుణ్యాలు, చరమగతి లేవు. నరకము, స్వర్గము, జననము, మరణము లేవు. ఎవ్వరూ రావడం లేదు. ఎవ్వరూ పోవడం లేదు. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు ఎవ్వరూ లేరు. ఉన్నది కేవలం వాడొక్కడే. అన్యులెవరూ లేరు. నరుడూ లేడు. నారీ లేదు. జన్మమూ లేదు. జాతీ లేదు. అప్పుడు సుఖ దుఃఖములు పొందువారే లేరు. అప్పుడు యతులు, సతులు, వనవాసులూ ఎవరూ లేరు. అప్పుడు సిద్ధులు, సాధకులూ లేరు. సుఖవాసులూ లేరు. యోగులు, జగములు, వేషధారులూ ఎవరూ లేరు. అప్పుడు తనకుతాను నాధుడనుకొనేవాడే లేడు. జపము, తపము, సంయమము లేవు. వ్రతము లేదు. పూజ లేదు. అప్పుడు నీవు తప్ప వర్ణించగలవారు వేరెవ్వరున్నారు ? వాడు స్వయంభువు. స్వయంభాసితుడు. తన విలువ తెలుసుకోగలిగిన వాడు తానొక్కడే. శుచి సంయమము, తులసి మాలలు వగైరా లేవు. గోపికలు, కృష్ణుడు, గోవులు, గోపాలకులు లేరు. అప్పుడు తంత్రము లేదు. మంత్రము లేదు. పాషండులు లేరు. అప్పుడు మురళి ప్రయోగించువాడు కూడా లేడు. అప్పుడు ధర్మము లేదు. కర్మము లేదు. మాయ లేదు. మర్మమూ లేదు. లలాట లిఖితము లేదు. భాగ్యరేఖ లేదు. అప్పుడు ధ్యానించే వారే లేరు.

ముల్లా, కాజీ, షేక్, ముసాయిక్, హాజీ రాజు ప్రజలు లేరు. అహంకార భూయిష్ఠమైన ప్రపంచమూ లేదు. చెప్పేవాడు, చెప్పించేవాడు లేరు.

అప్పుడు వేదము, ఖురాను, స్మృతులు, శాస్త్రములు లేవు. అప్పుడు పురాణమూ లేదు. పఠనమూ లేదు. ఉదయాస్తమయములు లేవు. వాడు స్వయముగా అగోచరుడు. వాడే వచనము. వాడే వక్త. వాడు గోచరుడు. తనకు తానే గోచరించగలవాడు.

బేద్ కతేబ్ న సింమ్రృతి సాసత్ ||
పాఠ పురాణ్ ఉదై నహీఁ ఆసత్ ||
కహ్తా బక్తా ఆపి అగోచరు ఆపై అలఖు లఖాయిదా || 13 ||

జా తిసు భాణా తా జగతు ఉపాయియా
బాఝు కలా ఆడాణు రహాయియా
బ్రహ్మా, బిసను మహేసు ఉపాఏ మాయియా మోహు వధాయిదా || 14 ||

విరలే కవుగురి సబదు సుణాయియా
కరికరి దేఖై హుకము సబాయయియా
ఖండ బ్రహమండ పాతాల్ అరంభే
గుపతాహు పరగటి ఆయిదా || 15 ||

తా కా అంతు న జాణై కోయీ । పూరే గుర్ తే
సోఝీహోయీ ||
నానక్ సాచి రతే బిసమాదీ బిసమభాయే
గుణ గా యిదా || 16 ||

22. పాతాలా పాతాల్ లఖ్ ఆగాసా ఆగాస్
ఓడక్ ఓడక్ భాలి ధకే వేద కహని ఇక్ వాత్
సహస అఠారహ్ కహని కతేబా అసులూ ఇకు ధాతు
లేఖా హోయి త లిఖీఐ లేఖై హోయి విణాసు
నానక్ వడా ఆఖీయై ఆపే జాణై ఆపు

తనకు ఇచ్ఛ కలిగినప్పుడే జగత్తును రచించినాడు. వాడే ఆకాశమును నిరాధారముగా నిలిపినవాడు. అప్పుడు బ్రహ్మను, విష్ణువును, మహేశ్వరుని సృష్టించినవాడు వాడే. మాయా మోహములను వ్యాపింపచేసినవాడు వాడే.

ఖండ ఖండాంతరాలేకాదు, బ్రహ్మాండం సహితం అతని ఆదేశం వల్లనే ఆవిర్భవించింది. రహస్యంగా ఉన్న వాటిని బహిర్గతం చేసి వెలుగులోకి తెచ్చింది తదీయమైన ఆదేశమే || 15 ||

వాని అంతు ఎవరికి తెలియదు. పూర్ణ గురువు ద్వారా జ్ఞానం లభిస్తుంది. సత్యానురక్తులు విస్మయంతో, ఉన్మాదంతో వాని గుణగానం చేసారు.

రచన అనంతం

22. పాతాళముల క్రింద లక్ష పాతాళములు. ఆకాశముల పై పలు ఆకాశములు. వేదములు చెప్పేది యిదే. సీమాన్వేషణముతో అలసిపోయాము. పద్దెనిమిది వేల విశ్వముల గురించి ధర్మగ్రంథంలో ప్రస్తావించబడింది. సృష్టికి అంతమంటూ ఉంటే ఆ సంగతి వ్రాయండి చూద్దాం. ఈ లెక్కకట్టడంలోనే జీవితం నష్టమైపోతున్నది. నానక్ చెప్పునదేమనగా అది సుదీర్ఘమైనది. వాడెంత గొప్పవాడో వానికే తెలుసు.

23. కేతే పవణ్ పాణీ బైసంతర్ కేతే కాన మహేస్ ॥
కేతే బర్మే ఘాడతి ఘడీఅహి రూప్ రంగ్ కే వేస్ ॥
కేతేఆ కరమ్ భూమీ మేర్ కేతే కేతే ధూ ఉపదేస్ ॥
కేతే ఇంద్ చంద్ సూర్ కేతే కేతే మండల దేస్ ॥
కేతే సిధ్ బుధ్ నాథ్ కేతే కేతే దేవీ వేస్ ॥
కేతే దేవ్ దానవ్ ముని కేతే కేతే రతన సముంద్ ॥
కేతీఆ ఖాణీ కేతీఆ బాణీ కేతే పాత్ నరింద్ ॥
కేతీఆ సురతీ సేవక్ కేతే నానక్ అంతు న అంతు ॥

— జపు పౌడీ 35

24. కవణు సువేలా వఖతు కవణు కవణ్ తిధి కవణు వారు ॥
కవణి సి రుతీ మాహు కవణు జితు హోఆ ఆకారు ॥
వేల న పాయీఆ పండతీ జిన్ హోవై లేఖు పురాణు ॥
వఖతు న పాయిఓ కాదీఆ జి లిఖని లేఖు కురాణు ॥
థితి వారు నా జోగీ జాణై రుతి మాహు నా కోయీ ॥
జా కర్తా సిరఠీ కఉ సాజే ఆపే జాణై సోయీ ॥
కివ కరి ఆఖా కివ సాలాహీ కిఉ వరనీ కివ జాణా ॥
నానక్ ఆఖణి సబు కో ఆఖై ఇకదూ ఇకు సిఆణా ॥

— జపు పౌడీ 21

25. సచే తేరే ఖండ్ సచే బ్రహ్మాండ్ ॥
సచే తేరే లోఅ సచే ఆకార్ ॥
సచే తేరే కరణే సరబ్ బీచార్ ॥
సచా తేరా అమరు సచా దీబాణు ॥
సచా తేరా హుకము సచా పురమాణు ॥
సచా తేరా కరము సచా నీసాణు ॥
సచే తుధు ఆఖిహి లఖ కరోడి ॥
సచె సభి తాణి సచె సభి జోరి ॥
సచ్ తేరీ సిఫతి సచ్ సాలాహ్ ॥
సచీ తేరీ కుదరతి సచే పాతిసాహ్ ॥
నానక్ సచు ధిఆయిని సచు ॥
జో మరి జంమ్యై సు కచు నికచు ॥ 1 ॥ మ 1 ॥

— వార్ ఆసా, పౌడీ 2, సలోక్ 1

23. ఎన్ని విధాల గాలి, నీరు, అగ్ని ! ఎందరు మహేశ్వరులు, ఎందరు బ్రహ్మలు, ఈ సృష్టిని రచిస్తూ ఉన్నారు. లెక్కకందనివి వాని రూపములు. లెక్కకందనివి వాని వర్ణములు. లెక్కకు చిక్కని కర్మభూములు. లెక్కకు మించిన ధ్రువులు, నారదులు. లెక్కకు మించిన ఇంద్రులు, చంద్రులు, సూర్యులు, భూమండలములు. లెక్కకు చిక్కని సిద్ధులు, బుద్ధులు, నాథులు, దేవులు. లెక్కకు చిక్కని దానవులు, మునులు అనేకులు. అసంఖ్యాకములు రత్నాకరములు. లెక్కకు చిక్కని జీవజాతులు. లెక్కకు అందని వాగ్విలాసములు. లెక్కల కందని నరేంద్రులు. సమ్రాట్టులు. లెక్కలేని శ్రుతులు. వారి సేవకులు అసంఖ్యాకులు. నానక్ చెప్పునదేమనగా దేనికీ అంతులేదు. (7)

## రచనా కాలం

24. ఏ సమయములో, ఏ ముహూర్తమున, ఏ తిథిలో, ఏ దినమున ? ఏ ఋతువు, మాసములో ఆకారములు ఏర్పడెనో ? పండితులకు సైతం సమయము తెలియదు. కాని వారు పురాణములు రచించారు. ముహూర్తమేదో కాజీకి సైతము తెలియదు. కాని కురాన్ రచించారు. యోగులకు సైతము తిథి, వారము తెలియదు. ఋతువు, మాసము ఎవరికీ తెలియదు. ఈ సృష్టికర్త ఒక్కనికి మాత్రమే అంతా తెలుసు. ఎలా స్తుతించను ? ఏమని చెప్పదగును ? ఎలా వర్ణించెదను ? నాకు ఎలా తెలుస్తుంది ? చెప్పడానికి అందరూ చెప్పుతారు. ఒకళ్ళను మించిన మేధావులు మరొకళ్లు. (4)

## రచన సత్యం, మిధ్య కాదు

25. సత్యము ఖండము, సత్యము బ్రహ్మాండము ; సత్యము లోకము, సత్యము ఆకారము. సత్యము నీ కార్యము, నీ ఆలోచనలు సత్యం ; సత్యము నీ శాసనము. సత్యము దర్బారు. సత్యము నీ ఆదేశము. సత్యము ఫర్మానా ; సత్యము నీ కృప, సత్యము నీ ఆమోద ముద్ర. లక్షలు, కోట్లు నిన్ను సత్యము అంటారు. సత్యము సర్వ జగద్రక్ష. సత్యము సర్వశక్తి. సత్యము నీ గుణగానము. సత్యము నీ స్తుతి. నీవు నిజమైన ప్రభువువి. సత్యము నీ శక్తి. నానక్ చెప్పునదేమనగా సత్యలీనులు సైతము సత్యస్వరూపులే. జనన మరణములలో చిక్కుకున్న వారిదే అసత్యము. (463)

26. కితు కితు బిధి జగు ఉపజై పురఖా
    కితు కితు దుఖి బినసి జాయీ
హౌమై విచి జగు ఉపజై పురఖా నామి విసరిఐ దుఖు పాయీ ॥
గుర్ముఖి హోవై సు గిఆను తతు బీచారై హౌమై సబది జలాఏ ॥
తను మను నిరమలు నిరముల వాణీ సాచై రహై సమాయే
నామే నామి రహై బైరాగీ సాచు రఖియా ఉరి ధారే
నానక బిను నావై జోగు కదే న హోవై దేఖహు రిదై బీచారే ॥ 68 ॥
— రామకలీ సిధ్ గోసటి, పౌడీ 68

27. ఆపే ఛింంఝ్ పవాయి మలాఖాడా రచియా ॥
లధే భడదూ గాయి గురముఖి మచియా ॥
మనముఖి మారే పఛాడి మూరఖ్ కచియా ॥
ఆపి భిడై మారే ఆపి ఆపి కారజు రచియా ॥
— వార్ మలార్, పౌడీ 4

28. గుర్ముఖి ధరతీ సాచై సాజీ
తిస్ మహి ఓపతి ఖపతి సు బాజీ ॥
గుర్ కై సబది రపై రంగు లాయి ॥
సాచి రతౌ పతి సిపు ధరి జాయి ॥
సాచ్ సబద్ బిను పతి నహి పావై ॥
నానక్ బిను నావై కిపు సాచి సమావై ॥ 30 ॥
— రామకలీ సిధ్ గోసటి, పౌడీ 30

29. సంత్ హేతి ప్రభి త్రిభువణ్ ధారే ॥
ఆతము చీనై సు తతు బీచారే ॥ 8 ॥
సాచు రిదై సచు ప్రేమ్ నివాస్ ॥
ప్రణవతి నానక్ హమ్ తా కే దాస్ ॥ 9 ॥ 8 ॥
— గాడీ అసటపదీయా

## రచనారీతి

26. ఓ ప్రభూ ! ఈ జగద్రచన ఎలా సాగుతున్నది ? ఏ దుఃఖము చేత విఘటితమవుతున్నది ? ఓ ప్రభూ ! ఈ జగద్రచన సాగుతున్నది అహంకార మధ్యమున. మరి నామమును విస్మరించుట వల్లనే దుఃఖము కలుగుతున్నది. గురుముఖుడు నామతత్వ విచారణ చేస్తాడు. శబ్దము ద్వారా అహంకారమును దహింపజేస్తాడు. సత్యలీనుడైన వాని తనువు, మనస్సు నిర్మలము. నామమును స్మరిస్తూ సత్యమును ఉల్లమున ధరించు వాని వాక్కు నిర్మలము. వాడే నిజమైన బైరాగి. నానక్ చెప్పినట్టు హృదయములో భావించి అర్థము చేసుకో. నామము లేక యోగము ఎప్పుడూ సిద్ధించదు. (946)

## ఎందుకీ రచన ?

27. ఈ మల్లయుద్ధ వ్యూహ స్వయముగా వానిదే. ఈ మల్లయుద్ధ వేదిక రచన కూడా వాడు చేసినదే. కామాది సన్నాహముతో యుద్ధానికి సిద్ధపడ్డారు. గురుముఖులు సైతము వానిని చూచి మండిపడ్డారు. గురుముఖులు మూర్ఖ మనోముఖులను పరాజితులను చేశారు. వాడు స్వయముగా కలబడి తనకై తాను స్వయంగా కొడతాడు. తనను తానే రచించుకుంటాడు. (1280)

28. సత్యమే ధరణిని సృజించింది, గురుముఖుని కోసమే. ఉత్పత్తి, వినాశము, రెండూ వాని లీలలే. గురు శబ్దమున ఎవరు రతులో, వారు సత్యలీనులు, సన్మానముతో గృహము చేరుతారు. సత్య శబ్దము లేక మాన్యత లభించదు. నానక్ చెప్పునదేమనగా నామము లేక ఎవ్వరూ సత్యలీనులు కాలేరు.(941)

29. సాధువుల కోసం ప్రభువు త్రిభువనములను ధరించినాడు. ఆత్మను గుర్తించి తత్త్వ విచారము చేయువాడే, సాధువు. సత్య హృదయమున సత్యప్రేమ వసిస్తుంది. నానక్ వానికి ప్రణతి చేసి దాసోహం అంటాడు. (224)

# జీవాత్మ, అహంకారం,
# కర్మ సిద్ధాంతం, ఆవాగమనం

హుకమీ హోవని జీవ్, హుకమి మిలై వడియాయీ
- జపు, పౌడి 2

## 1. ఆదేశముననే జీవము - ఆదేశముననే మహనీయత (1)

30. పాణ్ పాణీ అగనీ కా మేలు ||
చంచల్ చపల్ బుధి కా ఖేలు ||
నౌ దర్వాజే దస్వా దువారు ||
బుఝు రే గియానీ ఏహు బీచారు || 1 ||
కథతా బక్తా సున్తా సోయీ ||
ఆపు బీచారే సు గియానీ హోయీ || 1 || రహౌ ||
దేహీ మాటీ బోలై పౌణు ||
బుఝు రే గియానీ మూఆ హై కౌణు ||
మూయీ సురతి బాదు అహంకారూ ||
ఓహు నమూఆ జో దేఖణ్ హారూ || 2 ||
జై కారణి తటి తీరథ జాహీ ||
రతన పదారథ ఘట్ హీ మాహీ ||
పడి పడి పండితు బాదు బఖానై ||
భీతరి హోదీ వసతు న జాణై || 3 ||
హౌ న మువా మేరీ ముయీ బలాయి ||
ఓహు న మూవా జో రహి యా సమాయి ||
కహు నానక్ గురి బ్రహ్ము దిఖాయియా ||
మర్తా జాతా నదరి న ఆయియా || 4 || 4 ||
— గౌడీ

31. ఆతమ్ మహి రాము రామ్ మహి ఆతము
చీనసి గుర్ బీచారా ||
అమ్రుత్ బాణీ సబది పఛాణీ
దుఃఖ్ కాటై హౌమారా || 1 ||
నానక్ హౌమై రోగ్ బురే ||
జహ దేఖా, తహ ఏకో బేదన్
ఆపే బఖసై సబది ధురే || రహౌ ||
— భైరవు అసటపదీయా

## జీవాత్మకు చావులేదు

30. గాలి, నీరు, అగ్ని, వీటి సమ్మేళనమే ఈ శరీరము. దీనిలో వర్తిస్తుంది. చంచల మతి చపల లీల. తొమ్మిది తలుపులు. పదోది ద్వారము. తెలుసుకోరా జ్ఞాని ఈ విచారము. వాడే వక్త, శ్రోత, వ్యాఖ్యాత కూడా. ఆత్మ విచారము చేస్తాడు, సుజ్ఞాని. మట్టి ముద్ద ఈ దేహము. దీనిలో మ్రోగుతుంది గాలి. తెలుసుకోరా జ్ఞానీ అసలు మరణించేదీ ఏది ? ఎవరు ? మరణించేది సురతి, పనికిమాలిన అహంకారము. దీనిని చూచేవాడు, మరణించాడు. దేని కోసము తీర్థాటనము చేయాలి ? రత్నంలాంటి పదార్థం మన ఘటములోనే ఉన్నది. పండితులు పఠిస్తారు. వాద వివాదములు చేస్తారు. కాని తనలోనే గల ఆ అమూల్య వస్తువును వారు తెలుసుకోజాలని అనభిజ్ఞులు. నేను మరణించను. మరణించునది నా భౌతిక దేహం. రోమరోమమున వ్యాపించిన పరతత్త్వం మరణించదు. నానక్ చెప్పునదేమనగా గురువు బ్రహ్మను చూపించాడు. ఇప్పుడు మరణిస్తున్న వారెవ్వరూ కనబడడం లేదు. (152)

## జీవాత్మలో ఆత్మారాముడు

31. ఆత్మలో రాముని, రామునిలో ఆత్మను దర్శించేందుకు గురూపదేశం సహకరిస్తుంది. శబ్దము ద్వారా గుర్తిస్తారు. గురువు పలికిన అమృతవాణిని. అది దుఃఖమును తొలగిస్తుంది. అహంకారాన్ని చంపుతుంది. నానక్ చెప్పునదేమనగా అహంకార రోగము చాలా పెద్దది. ఎక్కడ చూచినా ఈ వేదన ఒక్కటే కనబడుతున్నది. గురుముఖమున వెలువడు శబ్దము ద్వారా ఆ నిరంకారుడే ముక్తిని ప్రసాదిస్తాడు. (1153)

32. హౌమై కరత భేఖీ నహిఁ జానియా ||
గురుముఖి భగతి విరలే మను మానియా || 1 ||
హౌ హౌ కరత నహిఁ సచు పాయీయే
హౌమై జాయి పరమ పదు పాయీయై || 1 || రహాఉ ||
హౌమై కరి రాజే బహు ధావహి ||
హౌమై ఖపహి జనమి మరి ఆవహి || 2 ||
హౌమై నివరై గుర్ సబదు బీచారై ||
చంచల మతి తియాగై పంచ్ సంఘారై || 3 ||
అంతరి సాచు సహజ ఘరి ఆవహి ||
రాజను జాణి పరమ గతి పావహి || 4 ||
సచు కరణీ గురు భరము చుకావై ||
నిరభౌ కై ధరి తాడీ లావై || 5 ||
హౌ హౌ కరి మరణా కియా పావై ||
పూరా గురు భేటై సో ఝగరు చుకావై || 6 ||
జేతీ హై తేతీ కిహు నాహి ||
గురముఖి గియాన్ భేటి గుణ్ గాహి || 7 ||
హౌమై బంధన్ బంధి భవావై ||
నానక్ రామ్ భగతి సుఖు పావై || 8 || || 13 ||

— గాడీ అసటపదీయా

33. హౌమై కరీ తా తూ నాహి తూ హోవహి హౌ నాహి ||
బూఝహు గియానీ బూఝణ్ ఏహ్ అకథ్ కథా మన్ మాహి ||
బిను గుర్ తతు న పాయీయే అలఖు బసై మల మాహి ||
సతిగురు మిలై త జాణీయే జాఁ సబదు బసై మన మాహి ||
ఆపు గయియా భ్రమ భౌ గాయియా జనమ్ మరన్ దుఃఖ్ జాహి ||
గురమతి అలఖు లఖాయీయే ఊత్తమ మతి తరాహి ||
నానక్ సోహం హంసా జపు జాపహు త్రిభవణ్ తిసై సమాహి || 1 || మం 3 ||

— వార్ మారూ, సలోక్ 1, పౌడీ 19

32. అహంకారముతో అనేక వేషాలు వేశాను. కాని వానిని గురించి ఏమీ తెలుసుకోలేకపోయాను. కోటికొకరు గురుముఖుని మనసులోని కోరిక భక్తి ద్వారా తెలుసుకోగలుగుతారు. అహంకారం ఉన్నంతవరకు సత్యము లభించదు. అహంకార నాశనము ద్వారానే పరమ పదము లభించగలదు. అహంకార వశులైన రాజులు ఒకరిపై మరొకరు యుద్ధం చేస్తారు. అహంకార వశులైన వారే నశిస్తారు. జనన మరణములకు ఆవాగమనములకు గురి అవుతారు. గురు శబ్ద విచారమున అహంకారము నివారించబడును. చంచలమతిని త్యజించిన, పంచత్వం నశిస్తుంది. అంతరంగంలో హాయిగా నివసించిన పరమ సత్యమనే రాజాధిరాజును గురించిన పరిజ్ఞానము పరమ గతిని ప్రసాదిస్తుంది. భ్రమ తొలగిపోతుంది. సత్యము హస్తగతమవుతుంది. నిర్భయ పదమున మనస్సు లగ్నమవుతుంది. అహంకారముతో మరణించు వానికి ఏమి దొరకగలదు ? పూర్ణ గురుని సందర్శనమున సకల వివాదములు అణగిపోతాయి. కనిపించునదెల్లా నశించునదే. గురువును గుర్తించినవాడు వాని గుణగానము చేస్తాడు. అహంకారము బంధనము. బంధనం వల్ల భ్రమ. నానక్ చెప్పునదేమనగా రామభక్తి వలన సుఖము కలుగుతుంది.

(226-27)

33. నేనుంటే నీవుండవు. నీవుంటే నేనుండను. తెలుసుకో జ్ఞానీ తెలుసుకో ఈ మాటలకందని మర్మాన్ని. అగోచరుడు అందరిలోనూ ఉన్నాడు. గురువు లేక తత్త్వము తెలియదు. సద్గురువు దొరికినప్పుడు మనస్సులో శబ్దము నింపినప్పుడు, జ్ఞానము కలుగుతుంది. అహంకారం తొలగిపోతుంది. భయభ్రాంతులు తొలగిపోతాయి. జన్మమరణ దుఃఖం నశిస్తుంది. గురుమతి అలక్షుని యందు లక్ష్యము కుదురుతుంది. సన్మతి వలన ఒడ్డు చేరగలడు. నానక్ చెప్పునదేమనగా వానిని జపించుము. త్రిభువనములో వాడే నిండి యున్నాడు. (1092-93)

34. దదె దోసు నదేవు కిసె దోసు కరంమా ఆపణియా ॥
జోమై కియా సోమై పాయియా దోసు నదీజే అవర్ జనా ॥ 2 ॥
ధధె ధారి కలా జిని ఛోడీ హరి చీజీ జిని రంగ్ కియా ॥
తిస్ దా దీయా సభనీ లీయా కర్‌మీ కర్‌మీ
హుకము పయియా ॥ 22 ॥
— ఆసా పటీ

35. నానక్ జీయ ఉపాయి కై లిఖి నావై ధరము బహాలియా ॥
ఓథై సచో హీ సచి నిబడై చుణి వఖి కఢై జజమాలియా ॥
థావున పాయిని కూడియార్ ముహ్ కాలై దోజకి చాలియా ॥
తేరై నాయి రతేసే జిణి గయే హారి గయే సి ఠగణ్ వాలియా ॥
లిఖి నావై ధరము బహాలియా ॥ 2 ॥
ఆప్‌నై భోగ్ భోగి కై హోయి భసమడి భౌరు సిధాయియా ॥
వడా హోవా దునీదారు గలి సంగలు ధతి చలాయియా ॥
అగై కరణీ కీరతి వాచీయై బహి లేఖా కరి సమ్ ఝాయియా ॥
థావు న హోవీ పౌదీయా హుణి సుణీయై కియా రూఆయియా ॥
మని అంధై జనము గవాయియా ॥ 3 ॥
పడి యా హోవై గునహ్‌గారూ తా ఓమీ సాధు న మారీయై ॥
జేహా ఘాలే ఘాలణా తేవేహో నావు పచారీయై ॥
ఐసీ కలా న ఖేడీయై జితు దరగహ గయియా హారీయై ॥
పడియా అతై ఓమీయా వీచారు అగై వీచారీయై ॥
ముహి చలై సు అగై మారీయై ॥ 12 ॥
— వార్ ఆసా, పౌడీ 2, 3, 12

34. ఎవరిమీదనైనా నెపం ఎందుకు వెయ్యాలి ? తప్పు అంతా తన కర్మదే. నేను చేసిన దాని ఫలితం నాకే దక్కింది. ఇతరులెవ్వరి దోషం ఏమీ లేదు. ఎవడు తన కళ ద్వారా జగత్తును ధరించాడో, ఎవడు ప్రతి వస్తువుకు రంగు వేశాడో వాడు ఇచ్చిన దానినే అందరూ స్వీకరిస్తారు. వాడు తమ తమ కర్మానుసారం అందరినీ ఆజ్ఞాపిస్తూ ఉంటాడు. (463)

35. నానక్ చెప్పునదేమనగా వాడే జీవమును ఉత్పత్తి చేసినవాడు. లెక్క-డొక్క తేల్చడం కోసమే ధర్మరాజును కూర్చోబెట్టాడు. అక్కడ సత్య పరీక్ష జరుగుతుంది. పాపిని ఎంచి వేరు చేస్తారు. అబద్ధాల కోరులకు అక్కడ చోటు లేదు. దురితాత్ములు నరకానికి వెళ్తారు. నీ నామములో లీనమైన వారిదే జయం. మోసగాళ్ళు ఓడిపోతారు. లెక్కవ్రాయడం కోసమే ధర్మరాజును కూర్చోబెట్టాడు. నిజకర్మ ఫలాన్ని అనుభవించి జీవి భస్మీ భూతుడైపోతాడు. లౌకికుడు మరణించక తప్పదు. గళమున నిగళము దాల్చి నశించిపోతాడు. కీర్తి అక్కడ ఆచరణ వల్లనే లభిస్తుంది. కూర్చోబెట్టి లెక్క తెలియచెప్పుతాడు. దండన అక్కడ తప్పదు. తప్పించుకునేందుకు అవకాశం లేదు. రోదనం వినే వాడెవడు ? గుడ్డి మనస్సు, జన్మము వృధా చేసినది. చదువుకున్నవాడు పాపిష్ఠి అయితే దాని శిక్ష నిరక్షర సాధువు కెందుకు ? వాని కర్మ ప్రకారమే వాని ఖ్యాతి వ్యాపిస్తుంది. అలాంటి ఆట ఇంకెప్పుడూ ఆడకు. దానివల్ల పరలోకంలో పరాభవం కలుగుతుంది. అక్కడ సాక్షర-నిరక్షర పరీక్ష జరుగుతుంది. స్వేచ్ఛాచారికి అక్కడ దండన కలుగుతుంది. (469-70)

36. కరణీ కాగదు మను మస్వాణీ బురా భలా దుయి లేఖ్ పయే ॥
జివు జివు కిరతు చలాయే తివు చలీయే
తవు గుణ్ నాహీ అంతు హరే ॥ 1 ॥
చిత్ చేతసి కీ నహీ బావరియా ॥
హరి బిసరత్ తేరే గుణ్ గలియా ॥ రహాఉ ॥
జాలీ రైని జాలు దిను హూవా జేతీ ఘడీ ఫాహీ తేతీ
రసి రసి చోగ్ చుగహి నిత్ ఫాసహి
ఛూటసి మూడే కవన్ గుణీ ॥ 2 ॥
కాయియా ఆరణు మను విచి లోహా పంచ్
అగని తితు లాగి రహీ ॥
కోయిలే పాప్ పడే తిసు ఊపరి మను
జాలియా సంనీ చింత్ భయీ ॥ 3 ॥
భయియా మనూరు కంచను ఫిరి హోవై
జే గురు మిలై తినేహా ॥
ఏకు నాము అంమ్రుత ఓహు
దేవై తవు నానక్ తృసటసి దేహా ॥ 4 ॥ 3 ॥
— మాయా

37. ఘర్ దర్ ఫిరి థాకే బహుతేరే ॥
జాతి అసంఖ్ అంత్ నహీ మేరే ॥
కేతే మాత పితా సుత ధీయా ॥
కాచే గుర్ తే ముకతి న హూవా ॥
కేతీ నారి వరు ఏకు సమాలి ॥
గురముఖి మరణు ఓవణు ప్రభ్ నాలి ॥
దహదిస్ ఢూఢి ఘరై మహి పాయియా ॥
మేలు భయియా సతిగురూ మిలాయియా ॥ 21 ॥
— రామకలీ దఖణీ, ఓంకార్, పౌడీ 29

## నామస్మరణతో కర్మ చక్ర నివారణ

36. ఆచరణ కాగితము. మనసు సిరా. మంచి, చెడు, రెండు లెక్కలూ అక్కడ అంకితమవుతాయి. కర్మ ఎలా నడిపిస్తుందో అలాగే మనం నడతాము. ఓ హరీ ! నీ గుణము అనంతము. ఓ చలచిత్తమూ, నీకెందుకు తెలియదు ? హరిని విస్మరించినచో నీ గుణములు కరిగిపోతాయి. దినము జాలము. రాత్రి మరుగు. ఎన్ని ఘడియలో అన్ని ఉచ్చులు. ఎర చూచి మురిసిపడి, చవిచూచి వలత్రాళ్ళ చిక్కుకొనిపోతాడు. మూఢమతి. బయటపడేందుకు తనలో గుణమేమీ లేదాయె. కాయమనే కొలిమిలో మనస్సు అనే లోహం ఉంది. పంచాగ్నులు దీనిని వ్రేలుస్తూ ఉన్నాయి. పాపము బొగ్గులా దానిమీద పడుతుంది. మనస్సు మండుతుంది. చింత అనే తంటసం దానిని పట్టి ఉంచింది. లోహము భస్మమై పోయింది. మళ్ళీ కాంచనమై పోగలదు. నామామృత మివ్వగల గురువు లభించినప్పుడే దేహ పిపాస తొలగుతుంది — అని నానక్ అంటాడు. (990)

## ఆవాగమనం

37. ఇల్లిల్లు, గుమ్మం గుమ్మం తిరిగి బాగా అలసిపోయాను. అగణిత జన్మలు నావి. అంతు తెలియలేదు. నాకు ఎందరో తల్లులు, ఎందరో తండ్రులు, సుతులు, కన్యలు ఎందరో. ఎందరు గురువులకు శిష్యుడనయ్యానో. ఏ గురువు వల్లా ముక్తి దొరకలేదు. స్త్రీలు అసంఖ్యాకులు. కాని వారంతా ఒకే భర్తనే ఆశ్రయిస్తారు. గురుముఖునికి జీవనమూ, మరణమూ ప్రభువుతోనే. దశదిశలు అన్వేషించాను. కాని వాడు ఇంటిలోనే దొరికాడు. సద్గురువుతో సమాగమం కలిగింది. ఆయనే ప్రభువును చూపించాడు. (932)

38. జాడి జాడి బిఛుడే బిఛుడే జాడే ॥
జీవి జీవి ముయే ముయే జీవే ॥
కేతియా కే బాప్ కేతియా కే బేటే కేతే గుర్ చేలే హూయే ॥
ఆగై పాఛై గణత్ న ఆవై కిఆ జాతీ కియా హాణి హూయే ॥
సభు కరణా కరతు కరి లిఖియై
కరి కరి కర్తా కరే కరే ॥
మనముఖి మరీయై గురముఖి తరియై
నానక్ నదరీ నదరి కరే ॥ 2 ॥
— వార్ సారంగ్, సలోక్ 2, పౌడీ 6

38. పలుమారులు కలుసుకొని మరల విడిపోయారు. విడిపోయి మళ్ళీ కలుసుకున్నారు. జీవించి మరణించారు. మరణించి మళ్ళీ జీవించారు. ఎందరికో తండ్రినయ్యాను. ఎంతమందికీ కొడుకునయ్యాను. ఎందరు గురువులకో శిష్యుడనయ్యాను. ముందు, వెనక ఇప్పుడు నా జన్మలకు లెక్కలేదు. చేసిన కర్మ, చేస్తున్న కర్మ అంతా విధి లిఖితమే. కర్త మనలను తిరిగి తిరిగి సృష్టిస్తూ ఉంటాడు. మనోముఖుడు మరణిస్తాడు. గురుముఖుడు తరిస్తాడు. కరుణామయుడు కరుణిస్తాడు.
(1238)

# ముక్తి - అనుగ్రహం

కర్మీ ఆవై కపడా నదరీ మోఖు దువారు

— జపు, పౌడీ 4

1. కర్మవల్ల శరీరం లభిస్తుంది. స్వామి అనుగ్రహం వల్ల మోక్షంలోకి ప్రవేశం లభిస్తుంది. (2)

39. అధిఆతమ్ కరమ్ కరే తా సాచా ॥
ముకతి భేదు కియా జాణై కాచా ॥
ఐసా జోగీ జుగతి బీచారై ॥ పంచ్ మారి సాచు ఉరిధారై ॥ 1 ॥
జిస్ కై అంతరి సాచు వసావై ॥ జోగ్ జుగతి కీ కీమతి పావై ॥ 2 ॥
రవి ససి ఏకో గృహ్ ఉదియానై ॥ కరణీ కీరతి కరమ్ సమానై ॥ 3 ॥
ఏక్ సబద్ ఇక్ భిఖియా మాగై ॥
గియాను ధియాను జుగతి సచు జాగై ॥ 4 ॥
భై రచి రహై న బాహరి జాయి ॥
కీమతి కౌణ్ రహై లివ్ లాయి ॥ 5 ॥
ఆపే మేలే భరము చుకాయే ॥
గుర్ పర్‌సాది పరమ్ పదు పాయే ॥ 6 ॥
గుర్ కీ సేవా సబదు వీచారు ॥
హౌమై మారే కరణీ సారు ॥ 7 ॥
జప తప సంజమ పాఠ పురాణు ॥
కహు నానక్ అపరంపర్ మాను ॥ 8 ॥ ॥ 6 ॥ — గౌడీ అసటపదీయా

40. లేఖ్ అసంఖ్ లిఖి లిఖి మాను ॥
మని మానియై సచు సురతి బఖాను ॥
కథనీ బదనీ పడి పడి భారు ॥
లేఖ్ అసంఖ్ అలేఖు అపారు ॥ 1 ॥
ఐసా సాచా తూ ఏకో జాణు ॥
జంమణు మరణా హుకము పఛాణు ॥ రహౌఉ ॥
మాయియా మోహి జగు బాంధా జమకాలి ॥
బాంధా ఛూటై నాము సంహాలి ॥
గురు సుఖదాతా అవరు న భాలి ॥ హలతి పలతి నిబహీ తుధ్ నాలి ॥ 2 ॥
సబది మరై తా ( ఏక్ లివ్ లాయే ॥ అచరు చరై త భరము చుకాయే ॥
జీవన్ ముక్తి మని నాము బసాయే ॥
గురముఖి హోయి త సచి సమాయే ॥ 3 ॥
జిని ధర్ సాజీ గగను ఆకాసు ॥
జిని సభ థాపీ థాపి ఉథాపి ॥
సరబ్ నిరంతరి ఆపే ఆపి ॥
కిసై న పూఛే బఖసే ఆపి ॥ 4 ॥

— ఆసా అసటపదీయా

39. ఆధ్యాత్మిక సాధన చేయువాడే సాధువు. ముక్తి రహస్యము పామరునికి ఎలా తెలుస్తుంది ? అయిదింటిని పరిహరించి సత్యమును ఉల్లమున ధరించిన ఆ యోగికే ముక్తి జ్ఞానము కలుగుతుంది. ఎవరి మనస్సులో సత్యము వసిస్తుందో వానికి యోగమోక్షముల విలువ తెలుస్తుంది. వానికి భవనము ఎటువంటిదో, ఉద్యానవనము కూడా అటువంటిదే. రవి చంద్రులకు వ్యత్యాసమేమిటి ? సత్కార్మలయందు, ప్రభుని స్తుతించుట యందు మగ్నుడై ఉంటాడు. జ్ఞానం, ధ్యానం, యుక్తి సత్యాన్ని ప్రజ్వలింప చేస్తాయి. భయములో నివసించాలి. భయము నుంచి ఎన్నడూ వైదొలగరాదు. నిత్యము ప్రభుని యందు ధ్యాన మగ్నులైన వారి విలువ ఎవరు కట్టగలరు ? స్వయముగా ప్రభువే వారి భ్రాంతిని తొలగిస్తాడు. ఆయనే వానిని తనలో లీనమొనర్చుకుంటాడు. గురు ప్రసాదమున వానికి ఆ పరంపర లభిస్తుంది. శబ్ద విచారమే గురు సేవనము. అహంకార నాశనమే సర్వోత్తమ కర్మ. నానక్ చెప్పునదేమనగా పరాత్పరుడయిన ప్రభునిలో ఆస్థ పెంచుకోవాలి. అదే జపము, తపము, సంయమము, పురాణ పఠనం. (223)

40. వ్రాతలు అసంఖ్యములు. వ్రాసి వ్రాసి వానికి గర్వము ఏర్పడింది. ప్రభుని మనస్సు తెలుసుకుంటే బుద్ధి సత్య వ్యాఖ్యానము చేయిస్తుంది. కథనము ప్రవచనము, అధ్యాపనము, వ్యర్థములు. రచనలు అసంఖ్యములు. విరచన అపారము. సత్యము ఒక్కటే అని తెలుసుకో. జనన, మరణములు వాని ఆజ్ఞానుసారమే అని తెలుసుకో. మాయా మోహవశము జగత్తు. యముడు దానిని బంధించి ఉంచాడు. బంధనముల నుండి విముక్తికి నామమును స్మరించు. గురువు సుఖదాత. మరి ఎవ్వరినీ అన్వేషించకు. లోకములో, పరలోకములో నీ వెంట వచ్చేది వాడే. శబ్దము ద్వారా అహమును తొలగించుకొని ఒక్కదానియందే మనస్సు లగ్నము చేసుకో. మనస్సు చంచలమైనప్పుడు సర్వభ్రమలు తొలగిపోతాయి. మనసున నామము నెలకొంటే జీవన్ముక్తి ప్రాప్తిస్తుంది. గురుముఖుడైతే సత్యము సాక్షాత్కరిస్తుంది. ఎవడు ధరిత్రిని సృజించాడో, వాడే ఆకాశమును కూడా నిర్మించాడు. ఎవడు సర్వము రచించాడో వాడే రచించిన దాన్ని నాశనము చేస్తాడు. సర్వనిరంతరుడు. వాడు స్వయంభువు. ఎవరినీ ఏమీ అడగకు. వాడే స్వయంగా మన్నిస్తాడు. (412)

41. ఝూఠే కౌ వాహీ పతి నావు ||
కలహు న సూచా కాలా కావు ||
పింజరి పంఖీ బంధియా కోయి ||
ఛేరీ ( భరమై ముకతి న హోయి ||
తౌ ఛూటే జా ఖసము ఛడాయే ||
గురమతి మేలే భగతి దృడాయే || 7 ||
— బిలావల్ థితీ

42. సపతమీ సతు సంతోఖ్ సరీరి ||
సాత్ సముంద్ భరే నిరమల నీరి ||
మజను సీలు సచు రిదై వీచారి ||
గుర్ కై సబది పావై సభి పారి ||
మని సాచా ముఖి సాచౌ భాయి ||
సచు నీసాణై ఠాక్ న పాయి || 9 ||
— బిలావల్ థితీ

43. జోతి సబాయిడీ యె త్రిభవణ్ సారే రామ్ ||
ఘటి ఘటి రవి రహియా అలఖ్ అపారే రామ్ ||
అలఖ్ అపార్ అపారు సాచా ఆపు మారి మిలాయియాయై ||
హౌమై మమతా లోభు జాలహు సబది మై లు చుకాయియాయై ||
దరి జాయి దరసను కరీ భాణై తారి తారణహారియా ||
హరి నాము అంమ్రితు చాఖి తృపతీ నానకా ఉర్ ధారియా || 4 ||
— బిలావలు ఛంత్ దఖణీ

44. సభనీ ఛటీ సహు వసై సహ బిను ఘటు న కోయి ||
నానక్ తే సోహాగణీ జిన్హా గురముఖి పరగటు హోయి ||
— సలోక్ వారా ( తే వధీక్

41. అబద్ధాలకోరులకు నామము రుచించదు. నల్లటి కాకి ఎప్పుడూ పవిత్రము కాలేదు. పక్షి ఒక పంజరములో బంధించబడింది. లోపలనే గుంజాకుంటూ ఉంటుంది. ముక్తి లభించదు. ప్రభువు వదలి పెట్టినప్పుడే విముక్తి కలుగుతుంది. గురుమతిలో కలిపిన భక్తి దృఢ పడుతుంది. (339)

42. సత్యసంతోషములు శరీరము కాగా సప్తసముద్రములు నిర్మలమైన నీరు కాగా, శీలమే మజ్జనము కాగా, హృదయములో సత్య విచారము జరిగిన గురు శబ్దము ద్వారా సర్వజ్ఞత సమకూరుతుంది. మనస్సులో సత్యమున్న, ముఖమున సత్య భావమున్న, మస్తకముపై సత్యముద్ర యున్న మార్గము నిరాటంకముగా కొనసాగుతుంది.

43. వాని జ్యోతియే త్రిభువనములలో వ్యాపించింది. ఘటఘటమున వెలుగుతుంది. వాడు అగోచరుడు. అనంతుడు. అనంతము. సత్యము. తన్ను చంపుకొని వానిలో లీనం కావాలి. అహంకారమును, మమకారమును, లోభమును దహించు. శబ్దము ద్వారా మాలిన్యమును తొలగించుకో. తారకా ! నాయందు దయచేసి ఉద్ధరించు. అప్పుడే నీ ద్వారము చేరి దర్శనము చేసుకోగలుగుతాను. నానక్ వానిని ఉరములో ధరించి హరి నామామృతమును ఆస్వాదించాడు. ఇప్పుడు మనస్సు తృప్తిపడింది. (343)

44. సర్వఘటములలోను పతి ఆవాసమున్నది. పతి లేని ఘటము ఏదీలేదు. నానక్ చెప్పునదేమనగా గురూపదేశమున పతిని సాక్షాత్కరించుకున్న పతియే సౌభాగ్యవతి. (1412)

45. అఖీ ఁ ఫరణై జే ఫిరా ఁ దేఖా ఁ సభు ఆకారు ॥
పుఛా గియానీ పండితా ఁ పుఛా ఁ బేద్ బీచార్ ॥
పుఛా ఁ దేవా ఁ మ్హాణసా ఁ జోౕధ్ కరహి అవ్తార్ ॥
సిధ్ సమాధీ సభి సుణీ జాయి దేఖా ఁ దర్బారు ॥
అగె సచా సచి నాయి నిర్భవు బైె విణు సారు ॥
హోౕర్ కచీ మతీ కచు పిచు అంధియా అంధు బీచారు ॥
నానక్ కర్మీ బంద్గీ నదరి లంఘాయే పారి ॥

— వార్ సారంగ్, సలోౕక్ 2, పౌడీ ॥

45. కళ్ళలో బలమున్నప్పుడే అగ్ని ఆకారములను చూస్తాను. వాటి సంగతిని గురించి జ్ఞానులను, పండితులను అడుగుతాను. వేదవేత్తలను కూడా అడుగుతాను. దేవుళ్ళనూ, యోద్ధలను అవతార పురుషులుగా భావించే మనుష్యులనూ అడుగుతాను. సిద్ధుల వలన సమాధి సంగతి వింటాను. వాని దివాణము చేరి చూస్తాను. అక్కడ సత్య నామమును గ్రహించినవాడే సత్యస్వరూపుడు. భయమును జయించిన నిర్భయుని నామము జపించు. వాడే పరమ శ్రేష్ఠుడు. అంధుడి ఆలోచనలు కూడా అంధములే. అతని ఉపదేశము అపరిపక్వము. నానక్ చెప్పునదేమనగా సత్కర్మ, భక్తి, వాని కృప భవసాగరమును తరింపచేస్తాయి.

(1241 - 42)

ద్వితీయ భాగము

# జీవిత లక్ష్యము

జినీ నాము ధియాయియా, గయే మసకతి ఘాలి
నానక్ తే ముఖ్ ఉజలే, కేతీ ఛుటీ నాలి.
— జపు, అంతిమ సలోక్

1. ఎవరు నామాన్ని ధ్యానిస్తారో
ఎవరు కష్టపడి తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తారో
వారి ముఖ వర్చస్సే వర్చస్సు
వారి వల్ల అనేకులు ముక్తి పొందుతారు. (8)

46. దరసన కీ పియాస్ జిసు నరహోయి ॥ ఏకతు రాచై పరహరి దోయి ॥
దూరి దరదు మథి అమ్మ్రితు ఖాయి ॥ గురముఖి బూఝై ఏక్ సమాయి ॥ 1 ॥
తేరే దరసన్ కౌ కేతీ బిలలాయి ॥
బిరలా కో చీనసి గుర్ సబది మిలాయి ॥ 1 ॥ రహాఉ ॥
వేద్ వకాణి కహహి ఇకు కహీయై ॥
ఓహు బేఅంత్ అంతు కివి లహీయై ॥
ఏకో కర్తా జిని జగు కీయా ॥ బాఝు కలా ధరి గగను ధరీయా ॥ 2 ॥
ఏకో గియాను ధియాను ధుని బాణీ ॥
ఏకు నిరాలము అకథ కహాణీ ॥
ఏకో సబదు సచా నీసాణు ॥ పూరే గుర్ తే జాణై జాణు ॥ 3 ॥
ఏకో ధరము ద్రిడై సచు కోయీ ॥
గురమతి పూరా జుగి జుగి సోయీ ॥
అనహది రాతా ఏక్ లివ్ తార్ ॥ ఓహ్ గుర్ముఖి పావై అలఖ్ అపార్ ॥ 4 ॥
ఏకో తఖతు ఏకో పాతిసాహు
సరబీ థాయీ వేపర్ వాహు
తిస్ కా కీయా త్రిభవణ్ సారు ॥ ఓహ్ అగము అగోచరు ఏకంకారు ॥ 5 ॥
ఏకా మూరతి సాచా నావు ॥
తిథై నిబడై సాచు నియావు ॥
సాచీ కరణీ పతి పరవాణు ॥ సాచీ దర్గహ్ పావై మాణు ॥ 6 ॥
ఏకా భగతి ఏకో హై భావు ॥
బిను భై భగతీ ఆవణు జావు ॥
గుర్ తే సమఝు రహై మిహమాణు ॥
హరి రసి రాతా జను పరవాణు ॥ 7 ॥
ఇత ఉత దేఖవు సహజే రావవు ॥ తుఝ్ బిన్ ఠాకుర్ కిసై న భావవు ॥
నానక్ హౌమై సబది జలాయియా
సతి గురి సాచా దరసు దిఖాయియా ॥ 8 ॥ 3 ॥

బసంతు అసటపదీయా

## సమస్త మానవజాతికి ముక్తి మార్గం ఒకటే

46. ఏ నరునకు దర్శన పిపాస కలుగుతుందో వాడు ఒకదానినే ప్రేమిస్తాడు. రెండవదానిని త్యజిస్తాడు. ఎవరు మథించి అమృతపానము చేస్తారో వారికి సర్వదుఃఖములు, బాధలు తొలగిపోతాయి. గురువు వలన దీక్ష పొందినవారు ఒకదానిలో లీనమై ఉంటారు. ఎంతమంది నీ దర్శనం కోసం విలపిస్తున్నారో. గురు శబ్దమున ప్రభువుతో సమాగమును జరుగుతుందని తెలిసినవారు అతి అరుదు. వేదములు వాడు ఒక్కటేనని, ఒక్కరిని మాత్రమే పేర్కొనవలెనని వ్యాఖ్యానిస్తున్నాయి. వాడు అనంతుడు. వాడి అంతు మనకు ఎలా చిక్కుతుంది ? కర్త వాడు ఒక్కడే ఈ జగత్తును రచించినవాడు. నిరాధారముగా ధరిత్రిని, ఆకాశమును నిలబెట్టినవాడు. ఒకటే జ్ఞానము ; ధ్యానము, ధ్వని, వాణి. ఒక్కడే వాడు నిరాలంబుడు. వాని కథ కథనమునకు అందనిది. పూర్ణ గురుని వల్లనే వాని సంగతి తెలియగలదు. ఒకే శబ్దము సత్య చిహ్నము. అందరికీ ఒకటే ధర్మము. సత్యముపై దృఢముగా ఉండుము. ఇదే గురుమతము. యుగయుగముల పరిపూర్ణుడు వాడు ఒక్కడే. అనాహతములో లీనమై చలించక ధ్యానించే గురుముఖులే అలక్ష్యుని, అపారుని, పొందగలిగినవారు. ఒకటే గద్దె. ఒక్కడే పాదుషా. సర్వస్థానములలోను వాడే నిర్భయుడు. త్రిభువనములను రచించినవాడు వాడే. వాడే అగమ్యుడు, అగోచరుడు, ఒకే ఓంకార స్వరూపుడు. ఒకటే మూర్తి అదే వాడి సత్యనామము. వాని సమక్షములో సదా న్యాయము లభిస్తుంది. అక్కడ మాన్యత సత్యకర్మ నిష్ఠ. సత్య ద్వారమున వీటికీ గౌరవము లభిస్తుంది. ఒక్కనియందే భక్తి. ఒక్కటే భావము. భయభక్తులు లేక రాకపోకలు నిలిచిపోవు. ఎవరు గురువు వలన ఉపదేశము పొందుతారో, అతిథి వలె ఉంటారో, హరి రస మగ్నులై ఉంటారో, వారినే ప్రభువు స్వీకరిస్తాడు. ఇటుఅటు చూచినప్పుడెల్ల సహజముగా నిన్నే పొందుతున్నాను. నీయందు తప్ప ప్రభూ, నాకు వేరెవ్వరి యందూ ప్రేమ లేదు. నానక్ చెప్పునదేమనగా శబ్దము అహంకారమును భస్మీభూతము చేసింది. సద్గురువు సత్యదర్శనం ఇప్పించాడు.

(1188-89)

47. బద్ ఫైలీ గెచానా ఖసము న జాణయీ ॥
సో కహి యె దేవానా ఆపు న పఛాణయీ ॥
కలహి బురీ సంసారి వాదే ఖపీయె ॥
విణు నావె బేకారి భర్ మే పచీయె ॥
రాహ్ దోవె ఇకు జాణై సోయీ సిఝసీ ॥
కుఫర్ గోవ కుఫరాణై పయియా దఝసీ ॥
సభ్ దునీయా సుబహాను సచి సమాయీయై ॥
సిఝై దరి దీవాని ఆపు గవాయీయై ॥ 9 ॥

— వార్ మాఝ్ పౌడీ 9

48. సో బ్రహమణు జో బిదై బ్రహము ॥
జపు తపు సంజము కమావై కరము ॥
సీల్ సంతోఖ్ కా రఖై ధరము ॥
బంధన్ తోడై హోవై ముకతు ॥
సోయి బ్రహమణు పూజణ్ జుగత్ ॥ 6 ॥

— సలోక్ వారా తే వధీక్

49. ఖత్రీ సో జు కర్మా కా సురూ ॥
పుంన్ దాన్ కా కరై సరీరూ ॥
ఖేతు పఛాణై బీజై దాను ॥
సో ఖత్రీ దర్గహ్ పర్వాణు ॥
లబు లోభు జే కూడ్ కమావై ॥
అపణా కీతా ఆపే పావై ॥ 7 ॥

47. దాగి దాగి దుండగములు చేయువానికి స్వామి సంగతి ఎలా తెలుస్తుంది ? తన గురుతు తనకు తెలియనివాడు పిచ్చివాడు. ప్రపంచములో కలహము పెద్దది. మనము వ్యర్థ వివాదములతో బ్రతుకు వమ్ము చేసుకుంటున్నాము. హరి నామము లేక వృధాగా భ్రమలో మునిగిపోతున్నాము. రెండే మార్గములు. వానిలో ఒకటి ఎంచుకో. దానివలన జన్మము ఫలిస్తుంది. దుర్భాషలు చేయువారు దుష్టాగ్నిలో మండిపోతారు. సత్యములో లీనమైనప్పుడు జగత్తు నిన్ను కొనియాడుతుంది. అహంకారము మాయమైనప్పుడు, ప్రభు చరణములలో జన్మ సాఫల్యం లభిస్తుంది. (142)

48. బ్రహ్మజ్ఞాని అయిన వాడే బ్రాహ్మణుడు. ఆత్మ సంయమములో అతడు జపతపాది కర్మలు చేస్తాడు. శీలము, సంతోషము అతని స్వభావం. బంధనములు వదుల్చుకొని ముక్తుడు కాగల బ్రాహ్మణుడే పూజనీయుడు. (1411)

49. కర్మశూరుడైన వాడే క్షత్రియుడు. వాడు పుణ్యదానములు మూర్తీభవించినవాడు. వాడు దాన బీజములను, క్షేత్రమును గుర్తించి చల్లుతాడు. అట్టి క్షత్రియుడే ప్రభువు చరణముల కడ స్వీకార్యుడు. దురాశ, లోభము, అసత్యములకు లోనైనవాడు తన కర్మ ఫలములను అనుభవిస్తాడు. (1411)

50. కాయియా కాగదు మను పర్వాణా ॥ సిర్కే లేఖ్ న పడై ఇయాణా ॥
దర్గహ్ ఘడీయహి తీనే లేఖ్ ॥
ఖోటా కామి న ఆవై వేఖు ॥ 1 ॥
నానక్ జే విచి రూపా హోయి
ఖరా ఖరా ఆఖై సభు కోయి ॥ రహోఉ ॥
కాదీ కూడు బోలి మలు ఖాయి ॥ బ్రాహ్మణు నావై జీయా ఘాయి
జోగీ జుగతిన జాణై అంధు ॥ తీనే ఓజాడే కా బంధు ॥ 2 ॥
సో జోగీ జో జుగతి పఛాణై ॥ గురు పర్సాదీ ఏకో జాణై ॥
కాజీ సో జో ఉలటీ కరై ॥ గుర్ పర్సాదీ జీవు మరై ॥
సో బ్రహ్మణు జో బ్రహ్ము బీచారై ॥
ఆపి తరై సగలే కుల్ తారై ॥ 3 ॥
దానసబందు సోయీ దిలి ధోవై ॥
ముసలమాణు సోయీ మలు ఖోవై ॥
పడియా బూఝై సో పర్వాణు ॥
జిసు సిరి దర్గహ్ కా నీసాణు ॥ 4 ॥ 5 ॥ 7 ॥

— ధనాసరీ

51. సభు కో ఊచా ఆఖీయై నీచు న దీసై కోయి
ఇకనై భాండే సాజీయై ఇకు చానణు తిహు లోయి
కరమి మిలై సచు పాయీయై ధురి బఖస్ న మేటై కోయి ॥ 6 ॥

— సిరీ రాగు అసటపదీయా

52. ఫకడ్ జాతీ ఫకడు నావు ॥
సభనా జేయా ఇకా ఛావు ॥
ఆపహు జే కో భలా కహాయే ॥
నానక్ తాపరు జాపై జా పతి లేఖై పాయే ॥ 1 ॥

— వార్ సిరీ రాగు, సలోక్ 9, పౌడీ 3

50. శరీరము ఒక కాగితము. మనస్సు లిఖితము. లలాట లిఖితమును మూర్ఖుడు అర్థం చేసుకోలేడు. ప్రభువు చరణ సన్నిధిని ఈ లేఖనము జరుగుతుంది. చెల్లని నాణెం చెల్లదు. నానక్ చెప్పేదేమంటే నాణెములో వెండి కలిసినట్లయితే అందరూ దానిని 'మంచిది, మంచిది' అంటారు. కాజీ అబద్ధాలాడి మలమును భక్షిస్తాడు. బ్రాహ్మణుడు జీవహత్య చేసి స్నానం చేస్తాడు. యోగి గుడ్డివాడు. గుర్తులు తెలియనివాడు. ఈ ముగ్గురు సర్వనాశనానికి దగ్గిఅ చుట్టాలు. యోగి ఎవరంటే యోగయుక్తి తెలిసిన జ్ఞాని. గురుకృప వలన కేవలం ఒక్కడానినే తెలుసుకో. కాజీ ఎవడంటే ఇహలోక విషయాలకు దూరంగా ఉండేవాడు. గురుప్రసాదమున జీవన్ముక్తుడై జీవిస్తాడు. బ్రాహ్మణుడు ఎవడంటే బ్రహ్మ విచారము చేయువాడు. తాను తరించి సకల కులమును తరింప చేస్తాడు. హృదయమును పరిశుభ్రము చేసుకున్నవాడే బుద్ధిమంతుడు. మలమును తొలగించుకున్నవాడే ముసలమాన్. చదివిన దానిని అర్థం చేసుకున్నవాడే పండితుడు. వాని మస్తకము ప్రభు చరణ ముద్రాంకితము. (662)

## మానవులందరూసమానులే

51. అందరూ ఉన్నతులనే చెప్పు. ఎక్కడ కూడా నీచులంటూ కనపడరు. వాడు ఒక్కడే అన్ని పాత్రలను రచించినవాడు. ముల్లోకముల లోను ఒకే వెలుగు వ్యాపించి వుంది. వాని కృపచేతనే సత్యము ప్రాప్తిస్తుంది. మౌలికమైన ఈ కృపను ఎవరూ తొలగించజాలరు. (62)

52. జాతి అభిమానము వృథా. పేరు వృథా. అన్ని జీవులు ఉండేది ఒక్కని నీడలోనే. ప్రతివాడు తనకుతానే ఉత్తముడు అని అనుకుంటూ వుంటాడు. కాని శ్రీ చరణ సన్నిధిని ఆదరణ లభించినపుడే ఉత్తముడు పరీక్షలో నెగ్గుతాడు. (83)

53. జాతీ దె కియా హథి సచు పరఖీయై ॥
మహురా హోవై హథి మరీయై చఖీయై ॥
సచే కీ సిర్‌కార్ జాగు జాగు జాణీయై ॥
హుకము మంనే సిర్‌దార్ దరి దీబాణీయై ॥
ఫుర్‌మానీ హై కార్ ఖసమి పఠాయియా ॥
తబలబాజ్ బీచార్ సబది సుణాయియా ॥
ఇకి హోయే అసవార్ ఇక్‌నా సాఖతీ ॥
ఇక్‌నీ బధే భార్ ఇక్‌నా తాఖతీ ॥ 10 ॥
— వార్ మాఝ్ పౌడీ 10

54. ముందా సంతోఖు సరము పతు ఝోలీ ధియాన్ కీ కరహి విభూతి ॥
ఖింథా కాలు కుఆరీ కాయియా జుగతి డండా పర్‌తీతి
ఆయీ పంథీ సగల్ జమాతీ మని జీతై జగు జీతు ఆదేసు తిసై ఆదేసు ॥
ఆది అనీలు అనాది అనాహతి జుగు జుగు ఏకో వేసు ॥ 28 ॥

55. మరణై కీ చింతా నహీ । జీవణ్ కీ నహీ ఆస్
తూ సరబ్ జీయా ప్రతిపాలహీ లేఖై సాస్ గిరాస్
అంతరి గురముఖి తూ బసహి జివు భావై తివు నిరజాసి ॥ 1 ॥
జీయరే రామ జపత మను మాను ॥
అంతరి లాగీ జలి బుఝీ పాయియా గురముఖి గియాను ॥ 1 ॥ రహాఉ ॥
అంతర్ ది గతి జాణీయై గుర్‌మిలీయై సంక్ ఉతారి
ముయియా జితు ఘరి జాయీయై తితు జీవదియా మరు మారి ॥
అనహద్ సబద్ సుహావణే పాయీయై గుర్ బీచారి ॥ 2 ॥
అనహద్ వాణీ పాయీయై తహ హౌమై హోయి బినాసు ॥
సత్‌గురు సేవే ఆపణా హౌ సద్ కుర్‌బాణై తాసు ॥
ఖడి దర్‌గహ్ పైనాయీయై ముఖి హరినామ్ నివాసు ॥ 3 ॥
జహ దేఖా తహ రవి రహే సివ సకతీ కా మేలు ॥
త్రిహు గుణ్ బంధీ దేహురీ జో ఆయియా జగి సో ఖేలు ॥
విజోగీ దుఖి విఛుడే మనముఖి లహహి న మేలు ॥ 4 ॥
మను బైరాగీ ఘరి బసై సచ్ భై రాతా హోయి ॥
గియాన్ మహారసు భోగవై బాహుడి భూఖ్ న హోయి ॥
నానక్ ఇహు మను మారి మిలు భీ ఫిరి దుఖు న హోయి ॥ 5 ॥ 8 ॥
— సిరీ రాగు

53. జాతిలో ఏమున్నది ? సత్యము బయలుపడుతుంది. విషపానము చేసినవాడు మరణించక తప్పదు. సత్య ప్రభువు ఆదేశము ప్రతి యుగములోను చెల్లుతుంది. ఎవరు ఈ ఆదేశమును పాటిస్తారో వారే ప్రభువు దర్బారులో నిజమైన సర్దారులు. ఇది వాని ఆజ్ఞ. మనలను పని చేసేందుకు స్వామి స్వయంగా పంపించాడు. నగారా మనకు శబ్దాన్ని వినిపించింది. గురువు దాని అర్థాన్ని తెలియజేసాడు. కొంతమంది ప్రయాణమయ్యారు. కొంతమంది బరువు ఎత్తుకున్నారు. కొంతమంది పరుగు ప్రారంభించారు.

## పరమాత్ముని చేరేందుకు రాజమార్గం

54. సంతోషమే ముద్రిక. పరిశ్రమే కమండలం. ధ్యానమే విభూతి. కాలమే బొంత. కాయమే కావడి. విశ్వాసమే యోగదండము. అందరినీ ఆత్మసములుగా భావించటమే ఆరాధన. మనస్సును జయిస్తే జగమును జయించినట్లే. ఆదియై, అనీలమై, అనాదియై, అనాహతమై, యుగయుగాలకు మారని నిర్వికారునకు నమోవాకములు. (6)

55. మరణచింత లేదు. జీవితాశ లేదు. నీవు సర్వజీవులకు ప్రతిపాలకుడవు. శ్వాసగ్రాసముల లెక్కచూసేది నీవే. నీ ఇచ్ఛయే నిర్ణయము. అదే జరుగుతుంది. రాముని జపించినప్పుడే మనస్సు సమాధానపడుతుంది. గురుముఖమున జ్ఞానం ఉదయించింది. అంతర్జ్వాల శాంతించింది. శంకారహితుడవై గురువును దర్శించినప్పుడు లోని జాడ తెలుస్తుంది. మరణించిన పిదప నీవు యముని ఇంటికి పోవలసి వున్నది. కనుక ముక్తిని పొంది ఆ ఇంటిని ధ్వంసం చెయ్యి. గురూపదేశములో అనాహత నాదమును తెలుసుకో. అది మనోహరమైనది. అనాహత వాణి ప్రాప్తించేది అహంకారము నశించినప్పుడే. నిజ సద్గురు సేవారతుడైన వానికి నేను శతశత ప్రణామములు సమర్పిస్తాను. ఎవని జిహ్వపై హరినామము వసిస్తుందో వారు శ్రీ చరణములు చేరుకుంటారు. ఎటు చూచినా, ఎక్కడ చూచినా నాకు శివశక్తుల సమ్మేళనమే గోచరిస్తున్నది. త్రిగుణములతో బంధింపబడిన ఈ దేహము ఈ జగత్తులోనికి రావటం కేవలం లీలా విశేషము. మనోముఖుడు వియోగ దుఃఖముతో బాధపడుతూ ఉంటాడు. సంయోగ సుఖం అతనికి లభించదు. మనస్సు విరక్తి చెంది సత్య భయములలో లీనమైనపుడే జ్ఞాన మహా రసానందము కలుగుతుంది. ఆకలి శాశ్వతముగా అణిగిపోతుంది. నానక్ చెప్పినమాట విని ఈ మనస్సును మసి చేసి ఆ ప్రభువును చేరుకో. అప్పుడు నీకు ఎన్నడూ దుఃఖము కలగదు. (20-21)

56. అమలు కరి ధర్ తీ బీజ్ సచ్ దో కరి సచ్ కీ
ఆబ్ నిత్ దేహి పాణీ ||
హోయి కిర్ సాణు ఈమాను జమాయి లె
భిసతు దోజకు మూడే ఏవ జాణీ || 1 ||
మతు జాణ సహి గలీ పాయియా ||
మాల్ కై మాణై రూప్ కీ సోభా ఇతు బిధీ
జనము గవాయియా || రహాఉ ||
ఏబ్ తని చిక్ డో ఇహు మను మీడకో కమల్ కీ సార్
నహీ ( మూలిపాయీ ||
భౌరు ఉస్తాదు నిత్ భాఖియా బోలే కివు
బూఝై జా నహ బుఝాయీ || 2 ||
ఆఖణు సునణా పౌణ్ కీ బాణీ ఇహు మను రాతా మాయియా ||
ఖసమ్ కీ నదరి దిలహి పసిందే జినీ కరి ఏకు ధియాయియా || 3 ||
తీహ్ కరి రఖే పంజి కరి సాథీ నావు సైతాను మతు కటి జాయీ ||
నానకు ఆఖై రాహి పై చలణా
మాలు ధను కితకూ సంజిఆహీ || 4 || 27 ||
సిరీ రాగు

57. ఏకా సురతి జేతే హై జీయ || సురతి విహూణా కోయి స కీయ ||
జేహీ సురతి తేహా తిస రాహు || లేఖా ఇకో ఆవహు జాహు || 1 ||
కాహే జీయ కరహి చతురాయీ ||
లేవై దేవై ఢిల్ న పాయీ || 1 || రహాఉ ||
తేర్ జీయ జీయా కా తోహి || కిత కౌ సాహిబ్ ఆవహి రోహి ||
జేతు సాహిబ్ ఆవహి రోహి || తూ ఓనా కా తేరే ఓహి || 2 ||
అసీ బోల్ బిగాడ్ విగాడహ్ బోల్ || తూ నదరీ అందరి తోలహి తోల్ ||
జహ కరణీ తహ పూరీ మతి || కరణీ బాఝహు ఘటే ఘటి || 3 ||
ప్రణవతి నానకు గియానీ కైసా హోయి ||
ఆపు పఛాణై బూఝై సోయి ||
గుర్ పర్ సాది కరె బీచారు ||
సో గియానీ దర్ గహ్ పర్ వాణు || 4 || 30 ||
సిరీ రాగు

56. కర్మ అనే భూమిలో శబ్దమనే బీజము నాటు. సత్యమనే నీటితో నిత్యము తడుపు. కర్షకుడవై ధర్మాన్ని పండించు. ఓ మూర్ఖుడా ! అప్పుడే నీకు స్వర్గనరకాల తీరు తెలుస్తుంది. మాటలతో పరమార్థం బోధపడుతుందని భావించకు. ధనగర్వంతో, సౌందర్య లాలసతో జీవితమంతా వ్యర్థమయిపోయింది. కశ్మల శరీరం అనే బురదలో మనస్సు అనే కప్ప నివసిస్తూ ఉంటుంది. కమలం కూడా బురదలోనే వికసిస్తుంది. కాని దాని సంగతి కప్పకు ఏమీ తెలియదు. గురువు అనే భ్రమరం ఆ సంగతి నిత్యమూ నిర్వచిస్తూ ఉంటుంది. కాని భాష తెలియకపోతే అది ఎలా బోధపడుతుంది ? పాడు మనస్సు మాయలో పడి వుంటుంది. పావన నామ సంకీర్తన చెయ్యాలి. పావన గానం వినాలి. ప్రభువును ధ్యానించే వారికి స్వామి అనుగ్రహం లభిస్తుంది. వారు స్వామికి ఆత్మీయులవుతారు. ముప్పయి రోజుల ఉపవాసం, రోజుకు అయిదుసార్లు నమాజు చేసినా క్షణంలో మాయలాడి దాన్ని మాయం చేస్తుంది. కాబట్టి నానక్ చెప్పేది ఏమంటే నీవు నీ దోవన వెళ్ళు. ధనధాన్యాల సేకరణలో మునిగిపోకు. (23-24)

57. జీవకోటిలో ప్రతి జీవికీ ఏదో ఒక ఆసక్తి ఉంటుంది. ఆసక్తి లేని జీవిని ఆ ప్రభువు సృష్టించనే లేదు. ఆసక్తిని బట్టే మార్గం. ఆవాగమనమే దానికి ఫలితం. జీవి మాపగల చాతుర్యం ఏమీ లేదు. లావాదేవీలలో సడలింపు ఏమీ లేదు. సర్వజీవులు నీవే. నీవు ఆ జీవుల తాలూకు వాడివే. వాటిపై నీకు కోపం ఎందుకు వస్తుంటుంది. స్వామీ ! ఒకవేళ కోపం వచ్చినప్పటికీ ఆ జీవులు నీవే. నువ్వు వాళ్ళ వాడివేనూ. మాకు మాట్లాడే తీరే తెలియదు. మాట్లాడితే పొట్లాట వస్తుంది. కాని నీవు కృపాదృష్టితో మా మాటలను పరీక్షిస్తూ వుంటావు. చేతలలోనే చైతన్యం నిండి వుంటుంది. కర్మరహితమైన జీవితం అపూర్ణం. జ్ఞాని అంటే ఎలాంటి వాడు ? తన్ను తాను తెలుసుకోగలిగిన వాడే ప్రభువును తెలుసుకోగలుగుతాడు. అతడే జ్ఞాని. గురువు అనుగ్రహం వల్ల సదా మననం చేస్తూ వుండే వాడే జ్ఞాని. అలాంటి వానికే ప్రభు చరణ సన్నిధి లభిస్తుంది. (24-25)

58. అఛల్ ఛలాయీ నహ ఛలై నహ ఘావు కటారా కరి సకై ॥
జివు సాహిబు రాఖై తివు రహై
ఇసు లోభీ కా జీవు టల్ పలే ॥ 1 ॥
బిను తేల్ దీవా కివు జలై ॥ 1 ॥ రహాఉ ॥
పోథీ పురాణ్ కమాయీయై ॥ భవు వటీ ఇతు తని పాయీయై ॥
సచు బూఝణు ఆణి జలాయీయై ॥ 2 ॥
ఇహు తేలు దీవా హవు జలై ॥ కరి చానణు సాహిబు తౌ మిలై ॥ 1 ॥ రహాఉ ॥
ఇతు తని లాగై బాణీయా ॥ సుఖు హోవై సేవ్ కమాణీయా ॥
సభ దునీయా ఆవణ్ జాణీయా ॥ 3 ॥
విచి దునీయా సేవ్ కమాయియై ॥
తా దర్‌గహ్ వైసణు పాయీయై ॥
కహు నానక్ బాహ్ లుడాయీయై ॥ 5 ॥ 33 ॥

— సిరీ రాగు

59. రామ నామి మను బేధియా అవరు కి కరీ వీచారు ॥
సబద్ సురతి సుఖు ఊపజై ప్రభు రాతౌ సుఖ్ సారు ॥
జివు భావై తివు రాఖు తూ (మై హరినాము అధారు ॥ 1 ॥
మన్ రే సాచీ ఖసమ్ రజాహ్ ॥
జిని తను మను సాజి సీగారియా
తిసు సేతీ లివ్ లాయి ॥ రహాఉ ॥
తను బైసంతరి హోమీయై ఇక్ రతీ తోలి కటాయి ॥
తను మను సమధా జే కరీ అనదిను అగని జలాయి
హరినామై తులి న పుజయీ జే లఖ్ కోటీ కరమ్ కమాయి ॥ 2 ॥
అరధ్ సరీరు కటాయీయై సిరి కరవతు ధరాయి ॥
తను హైమంచలి గాలీయై భీ మన్ తే రోగు న జాయి ॥
హరినామై తులి న పుజయీ సబ్ డిఠీ ఠోకి వజాయి ॥ 3 ॥
కంచన్ కే కోట్ దతు కరీ బహు హైవర్ గైవర్ దాను
భూమి దాను గవూఆ ఘణీ భీ అంతరి గరబు గుమాను ॥
రామ నామి మను బేధియా గురి దీయా సచు దాను ॥ 4 ॥
మన్ హఠ బుధీ కేతీయా కేతే బేద్ బీచార్ ॥
కేతే బంధన్ జీయ కే గురముఖి మోఖదుఆరు ॥
సచహు ఓరై సభుకో ఉపరి సచు ఆచారు ॥ 5 ॥

58. మాయ వంచనలకు లొంగదు. దానిని వంచించగల వాడు ఎవడు ? మాయను గాయపరచటం ఎవరికి సాధ్యం ? దేనిని స్వామి రక్షిస్తాడో, అదే నిలబడుతుంది. ఈ లోభి మనస్సు ఎప్పుడూ బాధపడుతూ వుంటుంది. నూనె లేని దీపం ఎలా వెలుగుతుంది ? చదివిన శాస్త్ర పురాణ సారాన్ని ఆచరణలో నింపుకోవాలి. దైవ భీతి అనే వత్తిని తన తనువులో కూర్చుకోవాలి. సత్యజ్ఞానముతో తనలోని జ్యోతిని వెలిగించుకోవాలి. అప్పుడే ఈ నూనె దీపం వెలుగుతుంది. ప్రకాశము ప్రసరించినప్పుడే స్వామి సన్నిధి లభిస్తుంది. ఈ తనువులో బాణం గుచ్చుకున్నప్పుడే సేవ చేయగలుగుతాడు. సుఖం లభిస్తుంది. సంసరణం సంసార లక్షణం. ప్రపంచంలో సేవ చేసినపుడే ప్రభువు చరణముల చెంత చేరి కూర్చోగలుగుతాడు. అప్పుడే చేతులాడిస్తూ నీవు ఆడుతూ పాడుతూ ప్రభువు చరణముల చెంత చేరుకుంటావంటాడు నానక్. (25-26)

59. రామ నామము మనస్సునంతా ఆక్రమించుకుంది. మరో ఆలోచనకు తావు లేదు. శబ్ద సంస్కరణ వల్ల సుఖం కలుగుతుంది. ప్రభువు ప్రేమలోనే ఉత్తమమైన సుఖం వున్నది. నువ్వు ఏ విధంగా తలుచుకుంటే ఆ విధంగానే నన్ను రక్షించు. నాకు వున్న ఒక్క ఆధారం ప్రభువు నామమే. ఓ మనసా ! స్వామి సత్యసంకల్పుడు. ఎవడు తనువు, మనస్సు సృజించి సింగారించాడో వానిపైనే మనస్సు లగ్నమయింది. ముక్కలు ముక్కలుగా తనువును కోసి అగ్నిలో హోమము చెయ్యి. తనువు, మనస్సులను సమిధలుగా చేసి ప్రతి దినము అగ్నికి ఆహుతి చెయ్యి. ఇలాంటి కర్మలు లక్షలు చేసినా హరి నామానికి తుల్యము కావు. శిరస్సును అంపపు కోతకు గురి చేసినా, శరీరాన్ని రెండు ముక్కలుగా కోసి వేసినా, హిమాచలంలో తపస్సు చేసినా, మనస్సులోని రోగం పోదు. నేను తూచి తూచి చూచాను. ఈ కర్మలేవి కూడ హరి నామంతో తుల్యమైనవి కావని తెలుసుకున్నాను.- కాంచన దుర్గాన్ని దానం చేస్తాను. శ్రేష్ఠమైన గుఱ్ఱాలను, ఏనుగులను దానం చేస్తాను. భూదానము, గోదానము, ధన దానము చేసినా మనస్సులోని అభిమానము తొలగిపోదు. రామ నామము మనస్సునంతా ఆక్రమించుకున్నది. గురువు సత్యదానము చేశాడు. హఠయోగం లాంటి బౌద్ధిక సాధనలు ఎన్నో ఉన్నాయి. వేద వాక్కులు ఎన్నో ఉన్నాయి. ఆత్మకు అన్నీ బంధనాలు. మోక్ష ద్వారము గురుద్వారానే లభిస్తుంది. సత్యము సర్వోన్నతమైనది. ఉచ్చతరము సత్యాచరణ. అంతా ఉచ్చమైనదే. నీచమైనది ఏదీ లెక్కగా కనబడదు. వాడే అన్ని పాత్రలను చేసినవాడు. ముల్లోకములలోను విస్తరించి వున్నది ఒకే ప్రకాశము. వాని కృప వల్లనే సత్యము ప్రాప్తిస్తుంది. ఈ మూల కృపను తొలగించగలవాడు ఎవ్వడూ లేడు. సాధువులు సాధుజనులనే కలుసుకుంటూ వుంటారు.

సభు కో ఊచా ఆఖీయై నీచు న దీసై కోయి ||
ఇకనై భాడే సాజీయై ఇకు చావణు తిహ లోయి ||
కరమి మిలై సచు పాయీయై ధురి బఖస్ న మేటే కోయి || 6 ||
సాధు మిలై సాధు జనై సంతోఖు వసే గుర్ భాయి ||
అకథ్ కథా వీచారీయై జే సతిగుర్ మాహి సమాయి ||
పీ అంమృతు సంతోఖియా దర్గహి పైధా జాయి || 7 ||
ఘటి ఘటి వాజై కింగురీ అనదిను సబది సుభాయి ||
విరలే కౌ సోఝీ పయీ గురముఖి మను సమఝాయి ||
నానక్ నాము న వీసరై ఛూటై సబదు కమాయి || 8 || 14 ||

— సిరీ రాగు అసటపదీయా

60. మిహర్ మసీతి సిదకు ముసలా హకు హలాలు కురాణు ||
షరమ్ సునతి సిలు రోజా హోహు ముసలమాణు ||
కరణీ కాబా సచు పీరు కల్మా కరమ్ నివాజ్ ||
తసబీ సాతి సుభావసీ నానక్ రఖై లాజ్ || 1 ||
హకు పరాయియా నానకా ఉసు సూవర్ ఉసు గాయి ||
గురు పీరు హామా తా భరే జా ముర్దారు న ఖాయి ||
గలీ భిసతి న జాయీయై ఛుటై సచు కమాయి ||
మారణ్ పాహి హరామ్ మహి హోయి హలాలు న జాయి ||
నానక్ గలీ కూడీయీ కూడో పలై పాయి || 2 ||
పంజి నివాజా వఖత్ పంజ్ పంజా పంజే నావు ||
పహిలా సచు హలాల్ దుయి తీజా ఖైర్ ఖుదాయి ||
చౌథీ నీయతి రాసి మను పంజవీ సిఫతి సనాయి ||
కరణీ కలమా ఆఖి కై తా ముసలమాణు సదాయి ||
నానక్ జేతే కూడియార్ కూడై కూడీ పాయి || 3 ||

— వార్ మాఝ్, పౌడీ 1, సలోక్ 1, 2, 3

గురుభావమున మనస్సుకు సంతోషము కలుగుతుంది. సద్గురునిలో లీనమైనప్పుడే అకథనీయమైన కథను గురించి విచారించడానికి వీలవుతుంది. అమృతపానం వల్ల ఆనందం కలిగింది. ప్రభువు చరణముల చెంత అప్పుడే సన్మానం లభించింది. అనుదినము శబ్దములో లీనమై ఆనందించగలిగినపుడే ఘటఘటమున వాని వాణి ధ్వనిస్తుంది. ఈ జ్ఞానము అతి అరుదుగా కొందరికే లభిస్తుంది. గురువు ద్వారానే మనస్సుకు అర్థం అవుతుంది. నానక్ చెప్పేదేమంటే నామాన్ని విస్మరించవద్దు. శబ్ద సాధన ద్వారా ముక్తి లభిస్తుంది. (62)

60. అనుగ్రహమే ఆలయం (మసీదు), నిర్మలమైన అంతఃకరణమే ఆసనం, న్యాయార్జితమే కురాను (పవిత్ర గ్రంథం), సౌజన్యమే సంప్రదాయం, సౌశీల్యమే ఉపవాసం అని భావించినవాడే నిజమైన ముసల్మాను. సదాచారమే ప్రాకారం. సత్యమే గురుమంత్రం, ఆచరణే నమాజు. శాంత చిత్తమే జపమాల. అప్పుడే ప్రభువు అనుగ్రహిస్తాడు. పర ధనాసక్తి, గోమాంస భక్షణం (హిందువులకు), సూకరమాంస భక్షణం (ముసల్మానులకు) లాగా విసర్జనీయం. అన్యాయార్జితాన్ని ఆశించనప్పుడే స్వామి సహకారం లభిస్తుంది. ఒట్టి మాటలతో స్వర్గం చేరుకోవటం సాధ్యం కాదు. సత్యాన్ని సాధిస్తేనే ముక్తి లభిస్తుంది. అమేధ్యం మీద ఎంత మసాలా చల్లినా అది సేవ్యం కాబోదు. అసత్యం అసత్య పరిణామాలకే దారి తీస్తుంది. అయిదు వేళల ఆచరించవలసిన అయిదు రకాల నమాజులకు అయిదే అయిదు పేర్లు. మొదటిది సత్యం. రెండవది న్యాయార్జన. మూడవది దైవచింతన. సత్ప్రవర్తన నాల్గవది. సద్గుణమనే కవచం చివరిది, అయిదవది. ఆచరణ పారాయణం చేస్తే నిజమైన ముసల్మాను వనిపించుకుంటావు. అసత్య మార్గాన్ని అవలంబించిన వాళ్ళకందరికీ అసత్పదార్థమే లభిస్తుంది. (140-41)

61. ముసలమాణు కహావణు ముసకలు జా
హోయి తా ముసలమాణు కహావై ॥
అవలి ఔలి దీను కరి మిఠా మస్కల్ మానా మాలు ముసావై ॥
హోయి ముసలిము దీన్ ముహాణై మరణ్ జీవణ్
కా భరము చుకావై ॥
రబ్ కీ రజాయి మంనే సిర్ ఉపరి కర్తా
మంనే ఆపు గవావై ॥
తౌ నానక్ సరబ్ జీయా మిహరంమత్తి హోయి త
ముసలమాణు కహావై ॥ 1 ॥
వార్ మాఝ్, సలోక్ 1, పౌడీ 8

62. కియా ఖాధై కియా పైధై హోయి ॥ జా మని నాహీ సచా సోయి ॥
కియా మేవా కియా ఘివు గుడ్ మిఠా కియా మైదా
కియా మాసు ॥
కియా కపడు కియా సేజ్ సుఖాలీ కీజహి భోగ్ విలాస్ ॥
కియా లస్కర్ కియా నేవ్ ఖవాసీ ఆవై మహలీ వాసు ॥
నానక్ సచై నామ్ విణు సభే టోల్ వినాసు ॥ 2 ॥
— వార్ మాఝ్, పౌడీ 10, సలోక్ 2

63. ఖిమా గహీ బ్రతు సీల్ సంతోఖం ॥ రోగ్ న బిఆపై నా జమ దోఖం ॥
ముకత భయే ప్రభ రూప న రేఖం ॥
జోగీ కౌ కైసా డరు హోయి ॥
రూఖి బిరఖి గృహ బాహరి సోయి ॥ 1 ॥ రహా ఉ ॥
నిర్భౌ జోగీ నిరంజను ధియావై ॥ అన్దిను జాగై సచ్ లివ్ లావై ॥
సో జోగీ మేరే మని భావే ॥ 2 ॥
కాలు జాలు బ్రహమ్ అగనీ జారే ॥ జరా మరణ గతు గరబు నివారే ॥
ఆపి తరె పితరీ నిస్తారే ॥ 3 ॥
సతిగురు సేవే సో జోగీ హోయి ॥ భై రచి రహై సు నిర్భవు హోయి ॥
జైసా సేవై తైసో హోయి ॥ 4 ॥
నర్ నిహకేవల్ నిర్భవు నావు ॥ అనాథహ నాథ్ కరే బలి జావు ॥
పునరపి జనము నాహీ గుణ్ గావు ॥ 5 ॥
అంతరి బాహరి ఏకో జాణై ॥ గుర్ కై సచ్దే ఆపు పఛాణై ॥
సాచై సబది దరి నీసాణై ॥ 6 ॥

61. తాను ముసల్మానని చెప్పుకోవటం కష్టం. అయితే కదా చెప్పుకోడానికి. భగవదీయులు బోధించిన ధర్మాన్ని నమ్మి ప్రేమించాలి. అహంకారమనే తుప్పును మనసులో నుంచి తొలగించుకోవాలి, తన సర్వస్వాన్ని పరిత్యజించాలి. ధర్మనిరతి యందు పరిపూర్ణమైన విశ్వాసము ఉండాలి. జీవించడానికి, మరణించడానికి మధ్యగల అంతరాన్ని తొలగించుకోవాలి. భగవంతుని యొక్క ఆదేశాన్ని శిరసావహించాలి. పరమపితను నమ్మి అహంకారం పరిత్యజించాలి. నానక్ చెప్పేది ఏమిటంటే సర్వజీవులపై కనికరము చూపించేవాడేసిసలయిన ముసల్మాన్ అనిపించుకుంటాడు. (141)

62. సత్య దైవం మనస్సులో లేనప్పుడు ఏమి తిన్నా, ఏమి కట్టుకున్నా, ఏమి ప్రయోజనం ? పప్పు, బెల్లం, నెయ్యి మిఠాయి దేనికి ? మైదా, మాంసము దేనికి ? వేషభాషలు, సుఖమైన శయ్యలు, భోగవిలాసములు దేనికి ? నౌకర్లు, చాకర్లు దేనికి ? మహలులో నివాసం వల్ల కలిగే లాభమేమిటి ? సత్యనామము లేక సర్వాడంబరములు క్షణంలో నశించిపోతాయి. (142)

63. క్షమను గ్రహించి, సచ్ఛీలమును, సంతోషమును వ్రతముగా స్వీకరించిన వారికి రోగమూ అంటదు, యమ దండనా తగలదు. వర్ణ రతి ప్రమోదాలకు అతీతులయిన వారే ముక్తులు కాగలరు. చెట్టులో, చేమలో, ఇంటా, బయటా అంతటా ప్రభువును దర్శించే యోగికి భయం దేనికి ? భయరహితుడయిన యోగి నిరంజనుని ధ్యానిస్తూ, అనుదినము జాగరూకుడై సత్యమందే లీనమై ఉంటాడు. అలాంటి యోగి నాకు చాలా ఇష్టుడు. బ్రహ్మజ్వాలతో కాల పాశములన్నింటినీ భస్మీకృతం చేస్తాడు. జరామరణములు గతించి పోతాయి. గర్వం అణగిపోతుంది. తాను తరించి, తన పితరులను కూడా తరింపచేస్తాడు. సద్గురుని సేవించేవాడే యోగి. ప్రభువుకు భయపడేవాడు నిర్భయుడవుతాడు. ఎవరిని సేవిస్తాడో వానివలెనే అవుతాడు. అట్టి నిర్లిప్త పురుషునికి నా జోహార్లు. అనాథ నాథుడే నిర్భయుడు. వాని గుణగానము వల్ల పునర్జన్మ ఉండదు. లోపల బయట ఉండేది ఒకటే అని తెలుసుకున్నవాడు గురు శబ్దాన్ని ఆత్మలో గుర్తించుకుంటాడు. సత్య శబ్దం ద్వారా ప్రభువు ద్వారాన్ని చేరుకుంటాడు. శబ్దము అణిగిపోయినప్పుడు తన తావును తాను తెలుసుకుంటాడు. ఆశలను అధిగమించి, జనన మరణముల నుంచి ముక్తుడవుతాడు. గురు శబ్దమున కమలము వికసిస్తుంది. ఎక్కడ చూసినా కనబడేవి ఆశ, నిరాశ, కామము, క్రోధము, విషము, ఆకలి, దప్పి. ఉదాసీనులై ఉండేవారు అతి అరుదు. (223-24)

సబది మరై తిసు నిజ్ ఘరి బాసా ॥ ఆవైన జావై చూకై ఆసా ॥
గుర్ కై సబది కమలు పర్‌గాసా ॥ 7 ॥
జో దీసై సో ఆస్ నిరాసా ॥
కామ క్రోధ్ బిఖు భూఖ్ పియాసా ॥
నానక్ విరలే మిలహి ఉదాసా ॥ 8 ॥ 7 ॥

— గౌడీ అసటపదీయా

64. ఐసో దాసు మిలై సుఖు హోయీ ॥ దుఖు విసరై పావై సచు సోయీ ॥ 1 ॥
దరసను దేఖి భయీ మతి పూరీ ॥
అదసిఠి మజను చర్‌నహ్ ధూరీ ॥ 1 ॥ రహాఉ ॥
నేత్ర సంతోఖే ఏక్ లివ్ తారా ॥ జిహ్వా సూచీ హరిరస్ సారా ॥ 2 ॥
సచు కరణీ అభఅంతరి సేవా ॥ మను త్రిప్‌తాసియా అలఖ్ అభేదా ॥ 3 ॥
జహ జహ దే ఖవు తహ తహ సాచా ॥
బిను బూఝే ఝుగరత్ జగు కాచా ॥ 4 ॥
గురు సమ్‌ఝావై సోఝీ హోయీ ॥
గురముఖి బిరలా బూఝై కోయీ ॥ 5 ॥
కరి కిర్‌పా రాఖహు రఖ్‌వాలే ॥
బిను బూఝై పసూ భయే బేతాలే ॥ 6 ॥
గురి కహియా అవరు నహీ దూజా ॥
కిసు కహు దేఖి కరవు అన్ పూజా ॥ 7 ॥
సంత్ హేతి ప్రభి త్రిభవణ్ ధారే ॥
ఆతము చీనై సు తతు బీచారే ॥ 8 ॥
సాచు రిదై సచు ప్రేమ్ నివాస్ ॥
ప్రణవతి నానక్ హమ్ తా కే దాస్ ॥ 9 ॥ 8 ॥

— గౌడీ అసటపదీయా

64. అలాంటి దాసు దొరికితే సుఖం కలుగుతుంది. దుఃఖము తొలగుతుంది. సత్యం లభిస్తుంది. అట్టివాని దర్శనముతో మతి పరిపూర్ణమవుతుంది. వాని చరణ ధూళి అష్టోత్తర షష్ఠి పుణ్యతీర్థ స్నానములతో తుల్యమైనది. నేత్రములలో తృప్తిని కూర్చుకొని ఒక్కని యందే దృష్టిని లగ్నము చేసి, శుచియైన జిహ్వతో హరి రస సారమును గ్రోలువాని ఆచరణలో, అంతరంగంలో సేవాభావం ఉంటుంది. అవ్యక్త మూర్తిని, భేదరహితుని సందర్శించినప్పుడే ఈ మనస్సు తృప్తి చెందుతుంది. వానిని తెలుసుకోలేక జగత్తు కలహాలతో నిండిపోతున్నది. గురూపదేశముననే ఆ ప్రభువును తెలుసుకోగలుగుతావు. వానిని తెలుసుకున్న గురుముఖుడు అరుదు. రక్షకా ! నన్ను కనికరించి రక్షించు. జ్ఞాన హీనులము మేము. పశువులము. భేతాళులము. గురువు చెప్పినదేమనగా ప్రభువు తప్ప వేరెవ్వరూ లేరు. కాబట్టి ఇతరులను పూజించే ప్రశ్నే లేదు. వేరెవ్వరిని ఎలా దర్శించను ? సాధువుల కోసం ప్రభువు త్రిభువనధారి అయ్యాడు. ఆత్మను గుర్తించి, తత్వ విచారం చేసేవాడే సాధువు. సత్య హృదయంలో సత్యప్రేమ నెలకొని ఉంటుంది. నానక్ అలాంటి వానికి ప్రణతులు చేసి తాను వానికి దాసుడనంటాడు. (224)

65) గుర్ కా సబదు మనై మహి ముంద్రా
ఖింధా ఖిమా హఢావవు ॥
జో కిఛు కరై భలా కరి మానవు సహజ
జోగ్ నిధి పావవు ॥ 1 ॥
బాబా జాగ్తా జీవు జగహ జాగ్ జోగీ
పరమ తంత్ మహి జోగం ॥
అంమృతు నాము నిరంజన్ పాయియా
గియాన్ కాయియా రస్ భోగం ॥ 1 ॥ రహాఉ ॥
సివ్ నగరీ మహి ఆసణి బైసౌ
కలప తియాగీ బాదం ॥
సింఙీ సబదు సదా ధుని సోహై
అహినిసి పూరై నాదం ॥ 2 ॥
పతు వీచారు గియాన్ మతి డండా వరతమాన్ విభూతం ॥
హరి కీరతి రహరాసి హమారీ గురముఖి పంథు అతీతం ॥ 3 ॥
సగలీ జోతి హమారీ సంమియా నానా వరన్ అనేకం ॥
కహు నానక్ సుణి భర్థరి జోగీ
పరబ్రహ్మ లివ ఏకం ॥ 4 ॥ 3 ॥ 37 ॥ — రాగ్ ఆసా

66. గుడు కరి గియాను ధియాను కరి ధావై కరి కరణీ కసు పాయీాయై ॥
భాఠీ భవను ప్రేమ్ కా పోచా ఇతు రసి అమియు చువాయీాయై ॥ 1 ॥
బాబా మను మత్వారో నామ రసు పీవై సహజ్ రంగ్ రచి రహియా ॥
అహినిసి బనీ ప్రేమ్ లివ్ లాగీ
సబదు అనాహద్ గహియా ॥ 1 ॥ రహాఉ ॥
పూరా సాచు పియాలా సహజే తిసహి
పీయాయే జా కౌ నదరి కరే ॥
అంమృత్ కా వాపారీ హోవై కియా మది
ఛూఛై భావు ధరే ॥ 2 ॥
గుర్ కీ సాఖీ అంమృత్ వాణీ పీవత్ హీ
పర్వాణు భయియా ॥
దర్ దర్సన్ కా ప్రీతము హోవై ముకతి
బైకుంఠే కరై కియా ॥ 3 ॥
సిఫతీ రతా సద్ బైరాగీ జూాయై
జనము న హారై ॥
కహు నానక్ సుణి భర్థరి జోగీ
ఖీవా అంమృత్ ధారై ॥ 4 ॥ 4 ॥ 38 ॥ — రాగ్ ఆసా

65. మనస్సులో గురు శబ్దమే ముద్ర. క్షమను కాషాయ వస్త్రంగా ధరించు. వాడు ఏమి చేస్తే అదే మేలుగా భావించి స్వీకరించు. అనాయాసంగా యోగ విధిని పొందు. బాబా, పరమ తత్త్వంతో సంయోగం పొందినప్పుడే యుగయుగాల వరకు యోగిగా విరాజిల్లుతాడు. నిరంజన నామామృతాన్ని సంపాదించుకున్న వాడవుతాడు. వాని కాయము జ్ఞాన రసానుభూతిని పొందుతుంది. శివనగరిలో ఆసీనుడవు కా. నానావిధాల ఊహాపోహలను, వాద వివాదాలనూ పరిహరించు. శృంగ నాదము సదా సుందరమైన ధ్వని. అహర్నిశలు ఆ నాదముతో నిండిపోతాయి. ఆలోచన కమండలం. జ్ఞానమతి యోగదండము. ప్రవర్తన విభూతి. హరి కీర్తనము జీవ చర్య. ఇదే గురుముఖుని పురాతన పంథా. నానా వర్ణములలో వ్యాపించి ఉన్న జ్యోతి ఏదో అదే యోగికి ఆధారమైనది. నానక్ చెప్పేది విను భర్తృహరీ. పరబ్రహ్మలో లీనమై ధ్యానించువాడే యోగి. (359-60)

66. జ్ఞానమనే బెల్లమును ధ్యానముతో శుద్ధి చేసి, కర్మ అనే తుమ్మ బెరడు చేర్చి భవనమనే కొలిమిలో కాల్చి, ప్రేమ అనే పూత పూసి అమృతరసము తయారుచేసి, ఆ రసపానంతో బాబా తన్మయత్వం చెందుతాడు. ప్రేమ సుధాపానంతో సహజవర్ణంలో మనస్సు లీనమయి పోతుంది. అహర్నిశలు ప్రేమలో మగ్నత చెందటం వల్ల అనాహత నాదం గ్రహించాను. సహజమనే పాత్ర సత్యముతో నిండిపోయింది. ఎవరిపై కృపా దృష్టి ప్రసరిస్తుందో, వానికి లభిస్తుంది. అమృత వ్యాపారికి క్షుద్రమైన మద్యము రుచించదు. అమృత వాణికి గురువే సాక్ష్యము. దానిని సేవించినంతనే నేను స్వీకార యోగ్యుడనయ్యాను. ద్వార దర్శనమును వలచిన వానికి వైకుంఠమున ముక్తితో పనిలేదు. బైరాగి సదా ప్రభుని స్తుతిలో లీనమై యుంటారు. వాడు జీవనమనే జూదములో ఎప్పుడూ ఓడిపోడు. నానక్ చెప్పునది విను భర్తృహరీ ! యోగి అమృత పానము చేసి మత్తుడై ఉంటాడు. (360)

తృతీయ భాగము

# లక్ష్య ప్రాప్తికి సాధనములు

## సద్గురువు

గురా ఇక్ దేహి బుఝాయీ ।
సభ్ నా జీవా కా ఇకు దాతా సోమై విసర న జాయీ ॥
— జపు, పౌడీ 6

1. సద్గురూ, నాకు సకల జీవ ప్రదాత అయిన ఒకనిని గురించి వివరించి చెప్పు. నాకు మరి మరపు రాకుండా చెప్పు. (2)

67. బిను సతిగుర్ కినైన పాయియో
బిను సతిగుర్ కినై న పాయియా ||
సతిగుర్ విచి ఆపు రఖియోను
కరి పర్గటు ఆఖి సుణాయియా ||
సతిగుర్ మిలియై సదా ముకతు హై
జిని విచహు మోహు చుకాయియా ||
ఉతము ఏహు వీచారు హై
జిని సచే సిఉ చితు లాయియా ||
జగ్ జీవను దాతా పాయియా || 6 ||
— వార్ ఆసా, పౌడీ 6

68. జే తూ ( తారూ పాణి తాహూ పుఛు తిడన్న కల్ ||
తాహూ ఖరే సుజాణ్ వంఞా ఏనీ కపరీ || 3 ||
— సలోక్ వారా ( తే వధీక్

69. సో గురు కరఉ జి సాచు ద్రిడావై ||
అకథు కథావై సబది మిలావై ||
హరి కే లోగ్ అవర్ నహీ ( కారా ||
సా చౌ ఠాకరు సాచు పియారా || 2 ||
తన్ మహి మనూఆ మన్ మహి సాచా ||
సో సాచా మిలి సాచే రాచా ||
సేవకు ప్రభ కై లాగై పాయి ||
సతిగురు పూరా మిలై మిలాయి || 3 ||
— ధనాసరీ, అసటపదీయా

## గురువెందుకు ?

67. సద్గురువు లేక ఎవ్వడూ వానిని ఎన్నడూ పొందలేదు. ఎవ్వడూ, ఎన్నడూ పొందలేదు. సద్గురువునందు వాడు స్వయముగా వెలసి ఉన్నాడు. గురువే వానిని ప్రకటించినాడు. వానిని గురించి పరిపరివిధాల అందరికీ వివరించి చెప్పాడు. సద్గురువు దొరికినచో ముక్తి తప్పక లభిస్తుంది. గురువు మనలోని మోహమును పొగొడుతాడు. సత్యమునందు తన చిత్తమును లగ్నము చేసిన వారికే జగజ్జీవన దాత సాక్షాత్కరిస్తాడు. (466)

68. నీకు ఈత చేతకావచ్చు. కాని యీ సుడిగుండాలను దాటి దరిచేరిన ఆరితేరిన యీతగాళ్ళ దగ్గిర ఈత నేర్చుకోవటం మేలు. (1410)

## గురు గుణములు

69. సత్యమునందు మనస్సు దృఢముగా నిలుపగలిగిన వానినే, అకథనీయమైన కథ చెప్పగలిగిన వానినే, సత్యమును చూపగలిగినవానినే, గురువుగా స్వీకరించి శిష్యుడవు కా. హరిభక్తునకు వేరేమీ పనిలేదు. సత్య ప్రభువునందు సత్యమునందు వానికి ప్రేమ ఉంటుంది. తనువులో మనసులో ప్రభువు నిక్కముగా నెలకొని ఉంటాడు. సత్యమును దర్శించి తానే సత్యస్వరూపుడైన వాడు సత్యమైన వాడు. సేవకుడు ప్రభువు చరణములను ఆశ్రయించినచో సద్గురువు తప్పక లభిస్తాడు. అట్టివాడే ప్రభు దర్శనము చేయించగల మేటి. (686)

70. ఏక్ మహి సరబ్ సరబ్ మహి ఏకా
ఏహ సతిగురి దేఖి దిఖాయీ || 5 ||
జిని కియే ఖండ్ మండల్ బ్రహ్మండా
సో ప్రభు లఖను న జాయీ || 6 ||
దీపకు తే దీపకు పర్గాసియా త్రిభవణ్ జోతి దిఖాయీ || 7 ||
సచై తఖతి సచ్ మహలీ బైఠే నిర్భవు తాడీ లాయీ || 8 ||
మోహి గయియా బైరాగీ జోగీ ఘటి ఘటి కింగురీ వాయీ || 9 ||
నానక్ సరణి ప్రభు కీ ఛూటే
సతిగుర్ సచు సఖాయీ || 10 ||
— రామకలీ దఖణీ

71. పూరే గుర్ తే నాము పాయియా జాయి ||
జోగ్ జుగతి సచి రహై సమాయి ||
బారహ్ మహి జోగీ భర్మాయె సనియాసీ ఛివ చారి ||
గుర్ కై సబది జో మరి జీవై సో పాయే మోఖ్ దువారు ||
బిను సబదై సభి దూజై లాగే దేఖహు రిదై బీచారి ||
నానక్ వడే సే వడ్భాగీ జినీ సచు రఖియా ఉర్ధారి || 34 ||
— రామకలీ సిధ్ గోసటి

70. ఒక్కదాని యందే సర్వము, సర్వము నందు ఒక్కటే. సద్గురువు. తాను దర్శించి, ఇతరులకు దర్శింపచేస్తాడు. ఈ ఖండములను, మండలములను, బ్రహ్మాండములను రచించినవాడే ప్రభువు. ఆ ప్రభువు కంటికి కనిపించడు. గురువు ఒక దీపముతో మరో దీపము వెలిగించి త్రిభువనములలో జ్యోతిని వెలయించాడు. సత్య ప్రాసాదమున సత్యసింహాసనముపై నిర్భయముగా ఆసీనుడైన గురువు ఆ జ్యోతిలో మనస్సును లయింప చేశాడు. మోహము నశించింది. జోగి బైరాగి అయినాడు. ఘటఘటమున వాని వాద్యము యొక్క ధ్వని వినిపిస్తుంది. నానక్ ప్రభువుకు శరణాగతుడు. సత్యసఖుడయిన సద్గురువు సాయముతో ముక్తి లభిస్తుంది. (907)

71. పరిపూర్ణుడయిన గురువు వలన నామము లభిస్తుంది. సత్యములో లీనమవటమే యోగం. యోగి పన్నెండు మార్గాలలో తిరుగాడుతూ ఉంటాడు. సన్యాసి ఆరు, నాలుగులందు సంచరిస్తూ ఉంటాడు. గురూప దేశమున ఎవరు ముక్తులై జీవిస్తారో వారికే మోక్ష ద్వారము లభిస్తుంది. శబ్దము లేక సర్వము ద్వైత భావంలో మగ్నమై ఉంటుంది. హృదయములో విచారించి చూడు. సత్యమును సంపాదించి ఉరములో దాచుకున్న వాడే అదృష్టవంతుడని అంటాడు నానక్. (941-42)

72. గుణవంతీ గుణ వీథరె జాగుణవంతీ ఝూరి ||
జే లోడహి పరు కామణే నహ మిలీయై పిర్ కూరి ||
నా బేడీ నా తుల్‌హడా నా పాయీయై పిరు దూరి || 1 ||
మేరే ఠాకుర్ పూరై తఖతి అడోలు ||
గురముఖి పూరా జే కరే పాయీయై సాచు అతోలు || 1 || రహాఉ ||
ప్రభు హరిమందరు సోహణా తిసు మహి మాణక్ లాల్ ||
మోతీ హీరా నిర్‌మలా కంచన్ కోట్ రీసాల్ ||
బిను పౌడీ గడి కివు చడవు గుర్ హరి
ధియాన్ నిహాల్ || 2 ||
గురు పౌడీ బేడీ గురూ గురు తుల్‌హా హరినావు ||
గురు సరు సాగరు బోహిథో గురు తీరథ్ దరీయావు ||
జే తిసు భావై ఊజలీ సత్‌సరి నావణ జావు || 3 ||
పూరో పూరో ఆఖీయై పూరై తఖతి నివాస్
పూరై థాని సుహావణై పూరై ఆస్ నిరాస్
నానక్ పూరా జే మిలై కివు ఘాటై గుణ్ తాస్ || 4 || 9 ||
— సిరీ రాగు

73. అంమ్రితు నీరు గియాని మన్ మజను
అఠసఠి తీరథ సంగి గహే ||
గుర్ ఉపదేసి జవాహర్ మాణక్
సేవే సిఖు సో ఖోజి లహై ||
గుర్ సమాని తీరథ్ నహి కోయి ||
సరు సంతోఖు తాసు గురు హోయి || 1 || రహాఉ ||
గురు దరీయావు సదా జలు నిర్‌మలు
మిలియా దురమతి మైలు హరై ||
సతిగురి పాయీయై పూరా నావణు పసూ పరేతహు
దేవ్ కరై || 2 ||
రతా సచి నామి తల హీయలు సో గురు పరమలు కహీయై ||
జాకీ వాసు బనాస్‌పతి సౌరై తాసు చరణ లివ్ రహీయై || 3 ||
గురుముఖి జీయ ప్రాన్ ఉపజహి గురముఖి సివ ఘరి జాయియై ||
గురముఖి నానక్ సచి సమాయీయై గురముఖి నిజ పదు పాయీయై || 4 || 6 ||
- ప్రభాతీ

72. గుణవతి తన ప్రియుని గుణగణాలను బహుగుణంగా మెచ్చుకుంటుంది. అవగుణవతి నుంచి దూరంగా తొలగిపోతుంది. కామినీ ! నీకు ప్రియుని పొందు కావాలంటే నీవు దానిని అన్నృతము ద్వారా సాధించజాలవు. ప్రియుడు దూరాన ఉన్నాడు. సులువుగా దాటించగల నావ ఏదీ అందుబాటులో లేదు. అతని చెంతకు ఎలా చేరుకోగలుగుతావు ? నా ప్రభువు తన అచల సింహాసనముపై కూర్చుని ఉన్నాడు. గురుముఖుడెవరైనా నన్ను పరిపూర్ణుని చేసినట్లయితే అతుల్య సత్యం నాకు లభిస్తుంది. ప్రభువు సుందర హరి మందిరము లాంటివాడు. దానిలో మాణిక్యములు, ముత్యములూ ఉన్నాయి. ప్రభువు, ముత్యములు, వజ్రములు నిర్మలమైన కాంచనముతో నిర్మించిన దుర్గరసాలయం. మెట్లు లేకుండా ఆ దుర్గాన్ని ఎలా చేరుకోగలను ? గురువు హరి ధ్యానమున ప్రసన్నుడవుతాడు. వాని సాయమున నీవు దుర్గమును అధిరోహించగలవు. గురువు నిచ్చెన. గురువు నావ. గురువు హరి నామముతో తులదూగే తక్కెడ. గురువు ఈ మహాసాగరమును దాటించే నౌక. గురువు ఈ నదీ తీరంలోని తీర్థము. వాని కృప కలిగినచో సత్య సరితలో స్నానమాచరించి ఉజ్జ్వలుడవు కాగలవు. పూర్ణాతి పూర్ణుడని ఎవరిని స్తుతిస్తారో వాడు పూర్ణ సింహాసనమున వేంచేసి యున్నాడు. ఆ స్థానము పరిపూర్ణము, పరమ రమణీయము. అక్కడ నిరాశాపరులు సైతము ఆశా పరిపూర్ణులవుతారు. నానక్ చెప్పునదేమనగా, ఆ పూర్ణము దొరికితే గుణ గణాల ఖజానాలో కొరత ఉండదు. (17)

73. జ్ఞానామృతమనే జలంలో మనస్సు స్నానమాచరిస్తుంది. ఈ జలములోనే అరవై ఎనిమిది తీర్థముల సంగమము ఉన్నది. గురూపదేశమే రత్న మాణిక్యరాశి. శిష్యుడై సేవించిన వారికే అది లభిస్తుంది. గురువుతో సమానమైన తీర్థము వేరేదీ లేదు. గురువు సంతోష సరోవరము. గురువు సదా నిర్మల జలపూరితమైన నది. దర్శన మాత్రం చేత మనో మాలిన్యం క్షాళితమై పోతుంది. సద్గురుని సందర్శనమే సంపూర్ణ స్నానము. ఆయన పశువులను, పిశాచములను సైతము దేవతలుగా మార్చి వేస్తాడు. గహన గంభీరమైన మనస్సుతో గురువు, నామములో లీనమై ఉంటాడు. గురువును పరిమళం అంటారు. ఆ పరిమళంతో తరుతతి గుబాళించి పోతుంది. ఆ శ్రీచరణ ధ్యానంలో మగ్నుడవు కా. గురువు ద్వారా జీవులకు తిరిగి ప్రాణం వస్తుంది. గురువు ద్వారా శివగృహము చేరుకుంటావు. నానక్ చెప్పునదేమనగా గురువు ద్వారా సత్యములో సమాలీనం కాగలవు - గురుకృపతో ఆత్మపదం లభిస్తుంది. (1328 - 29)

74. గృహు బను సమసరి సహజి సుభాయీ ॥
దురమతి గతు భయీ కీరతి ఠాయి ॥
సచ పౌడీ సాచవు ముఖి నావు ॥
సతిగురు సేవి పాయే నిజ్ థావు ॥ 1 ॥
మన్ చూరే ఖటు దర్సన్ జాణు ॥
సరబ్ జోతి పూరన్ భగవాను ॥ 1 ॥ రహా ఉ ॥
అధిక్ తియాస్ భేఖ్ బహు కరె ॥
దుఖు బిఖియా సుఖు తని పర్హరె ॥
కాము క్రోధు అంతరి ధన్ హిరె ॥
దువిధా ఛాడి నామి నిస్తరే ॥ 2 ॥
సిఫతి సలాహణు సహజ్ అనంద్ ॥
సఖా సైను ప్రేము గోబింద్ ॥
ఆపే కరే ఆపే బఖసిందు ॥
తను మను హరి పహి ఆగె జిందు ॥ 3 ॥
ఝూఠ్ వికార్ మహా దుఖు దేహ ॥
భేఖ్ వరన్ దీసహి సమి ఖేహ ॥
జో ఉపజై సో ఆవై జాయి ॥
నానక్ అసథిరు నాము రజాయి ॥ 4 ॥ 11 ॥

– ఆసా

75. నానక్ గురు సంతోఖు రుఖు ధరము ఫులు ఫల గియాను ॥
రసి భరియా హరియా సదా పకై కరమి ధియాని ॥
పతి కే సాద్ ఖాదా లహై దానా కై సిరి దాను ॥ 1 ॥ మం 1 ॥
సుయినే కా బిరఖు పత్ పర్వాలా ఫుల్ జవేహర్ లాల్ ॥
తితు ఫల్ రతన్ లగహి ముఖి భాఖిత్ హిర్దై రిదై నిహాలు ॥
నానక్ కరము హోవై ముఖి మసతకి లిఖియా హోవై లేఖు ॥
అఠసఠి తీరథ గుర్ కీ చరణీ పూజై సదా విసేఖు ॥
హంసు హేతు లోభు కోపు చారే నదీయా అగి ॥
పవహి దఝహి నానకా తరీయై కరమీ లగి ॥ 2 ॥

– వార్ మాఝ్ పౌడీ 20, సలోక్ 1, 2

## గురు శరణాగతి ఫలితం

74. గృహము, వనము, వానికి సహజముగానే సమానము. దుర్మతి విగతమయితే ప్రభు సంకీర్తనలో మనస్సు లగ్నమవుతుంది. సత్యనామ సంస్మరణమే సత్యానికి సోపానం. సద్గురుని సంసేవనమున స్వస్థానం లభిస్తుంది. మనస్సు స్వాధీనం కావటమే షడ్దర్శన జ్ఞానము. సర్వజ్యోతి పరిపూర్ణుడు భగవంతుడు. బహు వేషములను ధరించుట వలన తృష్ణ పెరుగుతుంది. విషయముల వలన దుఃఖము కలుగుతుంది. సుఖము తనువును త్యజింప చేస్తుంది. కామ క్రోధములు ఆంతరిక సంపదను హరిస్తాయి. సంశయము వీడితే నామము తరింప చేస్తుంది. ప్రభువు గుణగానము వలన సహజానందము లభిస్తుంది. ప్రభువు నందలి ప్రేమ, సఖుడు, బంధువు ఎవడు మనకు జన్మదాతో వాడే కృప జూపుతాడు. తనువును, మనస్సును, హరికే అర్పించు. వాని యెదుట ప్రాణముల నుంచు. అసత్యము, విషయాసక్తి, దేహమునకు బహు దుఃఖ కారకములు. వేషము, వర్ణము నిరర్థకములు. ఉత్పన్నమైనదేదో అదే నశిస్తుంది. నానక్ చెప్పేదేమనగా నామానురక్తుడైన వాడే స్థిరంగా ఉంటాడు. (351 - 52)

75. నానక్ చెప్పేదేంటంటే గురువు సంతోషమనే వృక్షము. ధర్మము పువ్వు. జ్ఞానము ఫలము. అది ఎప్పుడూ పచ్చగా రసభరితమై ఉంటుంది. కర్మ వలన, ధ్యానము వలన, ఆ ఫలము పరిపక్వమవుతుంది. దానిని ఆస్వాదించిన వారు పతి సంయోగ సుఖానుభూతిని పొందుతారు. గురువు చేయు దానము సర్వోత్తమమైన దానము. గురువు బంగారు చెట్టు ఆకులు ప్రవాళములు. పూలు వజ్ర వైడూర్యములు. వాటి నుండి లభించు ఫలములు రత్నాలు. గురువు హృదయము నుంచి వెలువడు వాణి హృదయమున హరిని ప్రసన్నము చేస్తుంది. నానక్ చెప్పునదేమనగా వాని కృప కలిగినచో, శిరస్సున ఉత్తమ భాగ్యరేఖ కలిగియున్నచో గురు చరణములలోనే అరవై ఎనిమిది తీర్థములూ లభిస్తాయి. ఈ విశేషం తెలిసిన వ్యక్తి వాటిని పూజిస్తాడు. హింస, మోహము, లోభము, క్రోధము, ఈ నాలుగూ అగ్ని నదులు. నానక్ చెప్పునదేమనగా ఇందులో మునిగిన వారు దగ్ధమై పోతారు. గురువు అనుగ్రహిస్తే తరించి అవ్వలి ఒడ్డుకు చేరుకో గలుగుతారు. (147)

76. సతిగుర్ విటహు వారియా జితు మిలీయై ఖసము సమాలియా ॥
జిని కరి ఉపదేసు గియాన్ అంజను దీయా ఇన్హీ నేత్రీ జగతు నిహాలియా ॥
ఖసము ఛోడి దూజై లగే డుబే సే వణ్జారియా ॥
సతిగురు హై బోహిథా విరలై కినై వీచారియా ॥
కరి కిర్పా పారి ఉతారియా ॥ 13 ॥

– వార్ ఆసా పౌడీ 13

77. సచా సతిగురు సేవి సచు సంహాలియా ॥
అంతి ఖలోవా ఆయి జి సతిగుర్ అగై ఘాలియా ॥
పోహి న సకై జమకాలు సచా రఖ్వాలియా ॥
గుర్ సాఖీ జోతి జగాయి దీవా బాలియా ॥
మనముఖి విణు నావై కూడియార్ ఫిరహి బేతాలియా ॥
పసూ మాణస్ చంమి పలేటే అందరహు కాలియా ॥
సభో వరతై సచు సచై సబది నిహాలియా ॥
నానక్ నాము నిధాను హై పూరై గురి దేఖాలియా ॥ 14 ॥

– వార్ మలార్, పౌడీ, 14

78. గురముఖి నాదం గురముఖి వేదం గురముఖి రహియా సమాయీ ॥
గురు ఈసరు గురు గోరఖు బర్మా గురు పార్బతీ మాంయీ ॥
జే హౌ జాణా ఆఖా నాహీ కహణా కథను న జాయీ ॥
గురా ఇక్ దేహి బుఝాయీ ॥
సభణా జీయా కా ఇకు దాతా సో మై విసరి న జాయీ ॥ 5 ॥

– జపు పౌడీ 5

76. సద్గురువుకు జోహారులు ఆయన దర్శనము వల్లనే నాకు స్వామి సంస్మరణ కలిగింది. ఆయనే నాకు ఉపదేశాలిచ్చి జ్ఞానాంజన మిచ్చినవాడు. అది కళ్ళకు రాసుకుని నేను ఈ ప్రపంచాన్ని చూశాను. స్వామిని మరచి ఇతరమును ప్రేమించు వాడు తప్పక మునిగిపోతాడు. నిజంగా వాడు వింత సార్థవాహుడు. సద్గురువు నౌక. వాని ఆలోచనలు తెలుసుకోగలిగిన వారు అతి అరుదు. ఆయన తన కృపతో ఆవలి ఒడ్డుకు చేర్చుతాడు. (470)

77. సద్గురు సంసేవనం వల్ల సత్యం బోధపడింది. సద్గురు సాన్నిధ్యంలో నేను చేసిన కృషి చివరకు నాకు తోడ్పడింది. సత్యమే నాకు రక్ష. నన్నిక యమధర్మరాజు ఏమీ చేయలేడు. గురూపదేశమున నేను జ్యోతిని ప్రజ్వలింప చేశాను. దీపాన్ని వెలిగించాను. మనోముఖుడు అసత్యవాది. నామ విహీనుడు. దారీ తెన్నూ లేకుండా కొట్టుకుంటాడు. మానవ శరీరధారి అయిన పశువు వాడు. లోపల అంతా మాలిన్యమే. సత్యము సర్వత్ర వ్యాపించి ఉంటుంది. శబ్దము ద్వారా నేను దీనిని తెలుసుకున్నాను. నానక్ చెప్పునదేమనగా నామమే నిధి. పూర్ణ గురుడు నాకు దీనిని అనుగ్రహించాడు. (1284)

## శబ్దం ద్వారా గురువు శిష్యుణ్ణి ఉద్ధరిస్తాడు

78. గురుశబ్దమే నాదము. గురుశబ్దమే వేదము. గురుశబ్దంలోనే గురువు కూడి వున్నాడు. గురువే శివుడు, విష్ణువు, బ్రహ్మ కూడాను. గురువే పార్వతీమాత. ఆయనను తెలుసుకున్నప్పటికీ నేను చెప్పలేను. వానిని వర్ణించడం వాక్కుకు సాధ్యం కాదు. ఓ గురూ ! నాకు ఆ సర్వ జీవులకు దాతయైన ఆ ఒక్కని గురించిన జ్ఞానం అనుగ్రహించు. నేను వానిని ఎప్పుడూ విస్మరించకుందును గాక. (2)

79. సతిగుర్ సబదీ పాధరు జాణి ॥
గుర్ కై తకీయై సాచై తాణి ॥
నాము సమ్హాలసి రూఢీ బాణి ॥
థై॥ భావై దరు లహసి పిరాణి ॥ 2 ॥
ఊడాం వైసా ఏక్ లివ్‌తార్ ॥
గుర్ కై సబది నామ్ ఆధార్ ॥
నా జలు డూంగరు న ఊచీ ధార్ ॥
నిజ ఘరి వాసా తహ మగు న చాలణ్‌హార్ ॥ 3 ॥
జితు ఘరి బసహి తూహై బిధి జాణహి బీజవు మహలు న జాపై ॥
సతిగుర్ బాఝహు సమర్థ్ న హోవీ సభు జగు దబియా ఛాపై ॥
కరణ్ పలావ్ కరై బిలలావై బిను గుర్ నాము న జాపై ॥
పల పంకజ్ మహి నాము ఛడాయే జే గుర్ సబదు సిఞ్ఞాపై ॥ 4 ॥
ఇకి మూరఖ్ అంధే ముగధ్ గవార్ ॥
ఇకి సతిగుర్ కై భై నామ్ ఆధార్ ॥
సాచీ బాణి మీఠీ అంమ్రుత్ ధార్ ॥
జిని పీతి తిసు మోఖదువార్ ॥ 5 ॥
నాము భై భాయి రిదై బసాహి గుర్ కరణీ సచు బాణీ ॥
ఇందు బర్సై ధరతి సుహావీ ఘటి ఘటి జోతి సమాణీ ॥
కాలరి బీజసి దురమతి ఐసీ నిగురే కీ నిసాణీ ॥
సతిగుర్ బాఝహు ఘోర్ అంధారా డూబి ముయే బిను పాణీ ॥ 6 ॥

– మలార్ అసటపదీయా

80. సబదు గుర్ పీరా గహిర్ గంభీరా బిను సబదై జగు బౌరానం ॥
పూరా బైరాగీ సహజి సుభాగీ సచు నానక్ మను మానం ॥ 8 ॥ 1 ॥

– సోరఠ్ అసటపదీయాం

81. భనతి నానకు కరే వీచారు ॥
సాచీ బాణి సివు ధరే పియారు ॥
తా కో పావై మోఖ్ దువారు ॥
జపు తపు సభు ఇహు సబదు హై సారు ॥ 5 ॥ 2 ॥ 4 ॥

– ధనాసరీ

79. సద్గురుని శబ్దముతో మార్గము తెలుసుకో. గురువును అనుసరిస్తే సత్యశక్తి లభిస్తుంది. సుందరమైన వాణితో నామస్మరణ చెయ్యి. నీ సంకల్ప మాత్రం చేత ప్రాణికి ద్వారం తెలుస్తుంది. ఒక్కనినే స్మరిస్తూ కూర్చునే ఆకాశంలో విహరిస్తాను. గురూపదిష్టమైన నామమే ఆధారము. నిజ గృహ నివాసికి మరే మార్గంలో పయనించవలసిన అవసరం లేదు. ఆటంకం ఏమీ ఉండదు. వాగులూ, వరదలూ, కొండలూ, కోనలూ ఏమీ బాధించవు. నీవు నివసించే యింటి పరిస్థితి నీకే తెలుసు. నీవు తప్ప వేరే ఆశ్రయమేమీ కనబడదు. సద్గురువు లేక ఏమీ అర్థం కాదు. రః సర్వ జగత్తును తన గుప్పిటిలో దాచి ఉంచాడు. ఎంత ఆక్రందించినా, ఎంత విలపించినా గురువు లేక నాకు జ్ఞానము కలుగదు. గురుశబ్దంలోని రహస్యం తెలిసినప్పుడే, నిముషంలో, నామము, ముక్తిని లభింపచేస్తుంది. కొందరు అంధులు. మూర్ఖులు, తెలివిలేనివారు. కొందరు సద్గురువు పట్ల భయభక్తులతో ఉంటారు. వారికి నామమే ఆధారము. సత్యవాణి మధురమైన అమృతధార. ఎవరు దీనిని సేవిస్తారో వారికి మోక్షద్వారము తెరుచుకుంటుంది. ఎవరు నామము నందు భయభక్తులు కలిగి ఉంటారో, వారి హృదయసీమలో గురువు చేతులు, పలుకులు, నెలకొని ఉంటాయి. ఇంద్రుడు వాన కురిపిస్తే, పృథ్వి సస్య శ్యామలవుతుంది. ఘట ఘటమున వాని జ్యోతి సమాలీనమై ఉంటుంది. బంజరు భూమిలో దుర్మతి బీజావాపనం చేస్తే గురువు లేని సాధన వలె అది నిష్ఫలమయిపోతుంది. సద్గురువు లేకుంటే అంతా ఘోరాంధకారం. నీరు లేకుండానే లోకులు ఇక్కడ మునిగిపోతారు. (1275)

## శబ్దమే గురువు

80. శబ్దమే గురువు. శబ్దమే ఆరాధ్యదైవం. అది గహనం, గంభీరం. శబ్దము లేక జగత్తు విక్షిప్తమయిపోతుంది. మనస్సు స్వాధీనం చేసుకున్న వాడే పూర్ణ విరాగి. సహజ సౌభాగ్యశాలి అంటాడు నానక్. (635)

81. నానక్ చెప్పునదేమనగా సత్యవాణిని ప్రేమించు. దానిని గురించి ఆలోచించు. అప్పుడే మోక్షద్వారము లభిస్తుంది. శబ్దమే జపతపముల సారము. (661)

82. గగన్ మై థాలు రవి చందు దీపక్ బనే తారికా మండల్ జనక్ మోతీ ||
ధూపు మలయానలో పవణు చవరో కరే సగల్ బనరాయి ఫూలంత్ జోతీ || 1 ||
కైసీ ఆరతీ హోయి భవ ఖండనా తేరీ ఆరతీ ||
అనహతా సబద్ వాజంత్ భేరీ || 1 || రహా ఉ ||
సహస తవ నైన్ నన నైన్ హై తోహి కౌ సహస మూరతి ననా ఏక్ తోహి ||
సహస పద విమల నన ఏక్ పద్ గంధ్ బిను సహస తవ గంధ్ ఇవ చలత మోహి || 2 ||
సభ మహి జోతి జోతి హై సోయి ||
తిస్ కై చానణి సభ మహి చానణు హోయి ||
గుర్ సాఖీ జోతి పరగటు హోయి ||
జో తిసు భావై సు ఆరతీ హోయి || 3 ||
హరి చరణ కమల మకరంద్ లోభిత్ మనో అనదినో మోహి ఆహీ పియాసా ||
కృపా జలు దేహి నానక్ సారింగ్ కౌ హోయి
జా తే తేరై నామి వాసా || 4 || 1 || 7 || 9 ||
- ధనాసరీ

83. ధను జోబను అరు ఫుల్డా నాఠీయడే దిన్ చారి ||
పవణి కేరే పత జివ్ ఢలి ఢులి జుంమణ్హార్ || 1 ||
రంగు మాణి లె పియారియా జా జోబను నౌ హలా ||
దిన్ థోడడే థకే భయియా పురాణా చోలా || 1 || రహా ఉ ||
సజణ్ మేరే రంగులే జాయి సుతే జీరాణి ||
హంభీ వంఞ్ఞా డుంమణీ రోవా ఝీణీ బాణి || 2 ||
కీ న సుణేహీ గోరీయే ఆపణ్ కంనీ సోయి ||
లగీ ఆవహి సాహురై నిత్ న పేయీయా హోయి || 3 ||
నానక్ సుతీ పేయీయై జాణు విరతీ సంని ||
గుణా గవాయీ గంఠడీ అవగణ్ చలీ బంని || 4 || 24 ||
- సిరీ రాగు

## హారతి

82. ఆకాశమే పళ్ళెరము. రవి చంద్రులే దీపములు. తారికలే ముత్యాలు. ధూపము మలయానిలము. వాయువే వింజామరము. సకల వృక్ష జాతుల పుష్పములే జ్యోతి. ఓ భవఖండనా ! నీకు ఎంత మంచి హారతి సమకూడిందయ్యా ! అనాహత శబ్దమే జాగంట అనుకో. సహస్రములు నీ కన్నులు. నీదంటూ ఒక్క కన్ను కూడా లేదు. సహస్రములు నీ మూర్తులు. నీకు ఒక్క ఆకారమైనా లేదు. సహస్ర నిర్మల పదములు నీవి. నీదంటూ ఒక్క పదమైనా లేదు. గంధహీనుడవు నీవు. సహస్రములు నీ గంధములు. నీ యీ లీల నా మనస్సును మరిపించింది. అన్నింటిలో వెలిగేది ఒకే జ్యోతి. అదే ఆ జ్యోతి. ఆ వెలుగును ఆధారం చేసుకునే అన్నీ వెలుగుతున్నాయి. గురూపదేశమున జ్యోతి ప్రకటితమవుతుంది. వానికి నచ్చినదే అసలైన హారతి. హరి చరణ కమల మకరందముపై నా మనస్సు లుబ్ధమయింది. అనుదినము నాకు వాడి తృష్ణే. నానక్ అనే చాతకానికి కృపాజలము అనుగ్రహించు. దానివలన నీ నామములో నాకు నివాసము కలుగుగాక ! (663)

## ప్రాపంచిక పదార్థాలు శాశ్వతములు కావు

83. ధనము, యౌవనము, పూవుల వంటివి. నాలుగు దినములలో నశించిపోతాయి. నీరు ఎండిపోగానే చతుష్పత్రపు ఆకులు వాడిపోతాయి. అలాగే యౌవనం కూడాను. యౌవన మున్నంత వరకే ఆనందానికి అవకాశం. కనుక, మిత్రుడా ! ఆనందాన్ని ఆస్వాదించు. కొలది దినాలలోనే యౌవనం వాడిపోతుంది. అప్పుడు అంతా పాతపురాణమే అయిపోతుంది. నా ప్రియమిత్రులందరూ కాటికి కదలిపోయారు. ఏదో ఒక రోజున నేనూ వెళ్ళిపోతాను. వెక్కి వెక్కి ఏడుస్తాను. పసిడి వన్నెల పడుచుదానా ! నీకు తెలియదా ఏదో ఒక రోజు అత్త వారింటికి వెళ్ళి తీరాలని. ఈ వార్త నీ చెవిని పడలేదా ? ఎల్లప్పుడూ పుట్టింటిలో ఉండడానికి వీలు లేదు. నానక్ చెప్పేదేమంటే పుట్టింటిలో హాయిగా నిద్రపోతూ ఉంటే ఇంటికి కన్నం పడుతుంది. నీ గుణగణాల మూటలన్నీ దొంగలు దోచుకుని పోతారు. అవగుణాలను పోగుచేసుకుని వెళ్ళవలసి ఉంటుంది. (23)

84. దర్ ఘర్ మహలా సోహణే పకే కోట్ హజార్ ॥
హస్తీ ఘోడ పాఖరే లస్కర్ లఖ్ అపార్ ॥
కి సహీ నాలి న చలియా ఖపి ఖపి ముయే అసార్ ॥ 3 ॥
సుయినా రూపా సంచీయై మాలు జాలు జంజాలు ॥
సభ జగ మహి దోహీ ఫేరీయై బిను నావై సిరి కాలు ॥
పిండు పడై జీవు ఖేలసీ బద్ ఫైలీ కియా హాలు ॥ 4 ॥
పుతా దేఖి విగసీయై నారీ సేజ్ భతార్ ॥
చోవా చందను లాయీయై కాపడు రూపు సిగారు ॥
ఖేహూ ఖేహ రలాయీయై ఛోడి చలై ఘర్ బారు ॥ 5 ॥
మహర్ మలూక్ కహాయీయై రాజా రావు కి ఖాను ॥
చౌధరీ రావు సదాయీయై జలి బలీయై అభిమాన్ ॥
మనముఖి నాము విసారియా జివు డవి దధా కాను ॥ 6 ॥
హౌయై కరి కరి జాయిసీ జో ఆయియా జగ్ మాహి ॥
సభు జగు కాజల్ కోఠడీ తను మను దేహ సువాహి ॥
గురి రాఖే సే నిర్మలే సబది నివారీ భాహి ॥ 7 ॥
నానక్ తరీయై సచి నామి సిరి సాహా పాతిసాహు ॥
మై ( హరినాము న వీసరై హరినాము రతను వేసాహు ॥
మనముఖి భవుజలి పచి ముయే గురముఖి తరే అథాహు ॥ 8 ॥ 16 ॥
- సిరీ రాగు అసటపదీయా

85. మాయియా మాయియా కరి ముయే మాయియా కిసై న సాథి ॥
హంసు చలై ఉఠి డుమణో మాయియా భూలీ ఆథి ॥
మను ఝూఠా జమి జోహియా అవగుణ్ చలహి నాలి ॥
మన్ మహి మను ఉల్టో మరై జే గుణ్ హోవహి నాలి ॥
మేరీ మేరీ కరి ముయే విణు నావై దుఖు భాలి ॥
గడ్ మందర్ మహలా కహా జివు బాజీ దీబాణు ॥
నానక్ సచే నామ విణు ఝూఠా ఆవణ్ జాణు
ఆపే చతుర్ సరూపు హై ఆపే జాణు సుజాణు ॥ 42 ॥
రామకలీ దఖణీ ఓంకార్

84. ఇళ్ళూ, వాకిళ్ళూ, అందమైన మేడలూ, వేలకొలది కోటలూ, గజతురగ బలం, కడవలలో కూడిన లక్షలకొలది అక్షౌహిణులు - ఇందులో ఏవీ ఎవరి వెంటా రాలేదు. అందరూ కాలవాహినిలో కలిసి పోయిన వాళ్ళే. అంతా సారహీనమే. బంగారు, వెండి, ధన ధాన్యాలు, సర్వమూ జంజాలము. సర్వ ప్రపంచాన్ని స్వాధీనం చేసుకోవచ్చు. కాని నామము లేని వాని శిరస్సుపై కాలం కాపురముంటుంది. పిండము పడిపోతుంది. జీవము తొలగిపోతుంది. దుష్కర్మలను ఆచరించిన దుష్టుని గతి ఏమిటి ? పుత్రుని చూచినప్పుడు మనస్సు ప్రసన్నమవుతుంది. పత్నిని శయ్యపై చూసినప్పుడు పతికి ఆనందము కలుగుతుంది. చందనము పూసుకుని, మంచి మంచి దుస్తులు వేసుకుని సింగారించుకుంటారు. చివరకు మట్టి అయి మట్టిలో కలిసి పోవలసిందే. ఇల్లు వాకిలి వదలి పోవలసిందే. సర్దారు అనిపించుకుంటూ ఉంటాడు. బాదుషా, రాజా, రావు, ఖాన్ అని పిలిపించుకుంటూ అభిమాన పడిపోతుంటారు. మనోముఖుడు నామమును విస్మరించాడు. దావాగ్ని అడివిని తగల బెట్టినట్లయింది. జగత్తులోకి వచ్చిన వారు అహంకారముతో విర్రవీగి ఆఖరుకు వెళ్ళిపోతారు. ప్రపంచమంతా చీకటి గది. తనువు, మనసు భస్మ భూయిష్ఠమై ఉన్నాయి. గురువు రక్ష కలవాడే నిర్మలుడు. శబ్దము ద్వారా అగ్ని నివారణం అవుతుంది. నానక్ చెప్పేదేమంటే సత్యంతోనే భావసాగరమును తరించగలం నామమే రాజాధిరాజు, పాదుషా. నేను హరినామమును విస్మరించుకుందును గాక ! హరినామము రత్నము. నేను కొనవలసినది దీనినే. నానక్ చెప్పునదేమనగా మనోముఖుడు సంసార జాలంలో దగ్ధమయిపోతాడు. భవజలముతో పడి మరణిస్తాడు. గురుముఖుడు సాగరమును సైతము తరించి పోతాడు. (63 - 64)

## మాయా జాలాన్ని తప్పించుకునేది ఎలా ?

85. డబ్బో ! డబో !! అంటూ మరణిస్తారు. కాని మాయలాడి డబ్బు ఎప్పుడూ ఎవరి వెంటా పోలేదు. హంస లేచిపోయింది దిగులు పడుతూ. కాని మాయ మాత్రం ఇక్కడే ఉండిపోయింది. దుర్మతి కోసం యముడు ఎదురుచూస్తూ ఉంటాడు. అవగుణములన్నీ వాని వెంటే వెళ్తాయి. సద్గుణము వెంట ఉంటే వ్యామోహం పోయి మనస్సు మనస్సులో ఉంటుంది. నాది నాది అంటూనే మరణించాడు. నామము వదలి దుఃఖాన్ని అన్వేషిస్తూ వచ్చాడు. కోటలు, ఆలయాలు, లోగిళ్ళు, దివాణం - ఇవన్నీ ఏమై పోయినట్లు ? అవి ఇంద్రజాలికుని ప్రదర్శనం వంటివి. నానక్ చెప్పేదేమంటే సత్యనామము లేకుండా ఆవాగమనం తప్పదు. సత్యం తెలిసినవాడు ఎంతో చతురుడు. వాడే సుజ్ఞాని, సర్వము తెలిసినవాడు. (935 - 36)

86. సరము ధరము దుయి నానకా జే ధను పలై పాయి ॥
సో ధను మిత్రు న కాంఢీయై జితు సిరి చోటాం ఖాయి ॥
జిన్ కై పలై ధును బసై తిన్ కో నావు ఫకీర్ ॥
జిన్హ కై హిర్దై తూ బసహి తే నర్ గుణీ గహీర్ ॥ 1 ॥ మ 1 ॥
దుఖీ దునీ సహేడీయై జాయి త లగహి దుఖ్ ॥
నానక్ సచే నామ బిను కిసై న లథీ భుఖ్ ॥
రూపీ భుఖ్ న ఉతరై జాం దేఖాం తాం భుఖ్ ॥
జేతే రస్ సరీర్ కే తేతే లగహి దుఖ్ ॥ ॥ మ ॥
అంధీ కంమీ అంధు మను మని అంధై తను అంధు ॥
చికడి లాయియై కియా థీయై జాం తుటై పథర్ బంధు ॥
బంధు తుటా బేడీ నహీ నా తుల్హా నా హాద్ ॥
నానక్ సచే నామ్ విణు కేతే డూబే సాధ్ ॥ 3 ॥ మ 1 ॥
లఖ్ మణ్ సుయినా లఖ్ మణ్ రూపా లఖ్ సాహా సిరి సాహ ॥
లఖ్ లస్కర్ లఖ్ వాజే నేజే లఖీ ఘోడీ పాతిసాహ ॥
జిథై సాయిరు లంఘణా అగని పాణీ అసగాహ ॥
కంధీ దిసి న ఆవయీ ధాహీ పవై కహాహ ॥
నానక్ ఓథై జాణీయహి సాహ కేయీ పాతిసాహ ॥ 4 ॥

- వార్ మలార్ పౌడీ 21, సలోక్ 1, 2, 3, 4

87. సాచా సాహిబు సాచు నాయి భాఖియా భావు అపారు ॥
ఆఖహి మంగహి దేహి దేహి దాతి కరే దాతారు ॥
ఫేరి కి అగై రఖీయై జితు దిసై దర్బారు ॥
ముహౌ కి బోలణు జితు సుణి ధరే పియారు ॥
అంమృత్ వేలా సచు నావూ వడియాయీ వీచారు ॥
కర్మీ ఆవై కపడా నదరీ మోఖు దువారు ॥
నానక్ ఏవై జాణీయై సభు ఆపే సచియారు ॥ 4 ॥

- జపు పౌడీ 4

86. నానక్ చెప్పేదేమంటే డబ్బు కోసం సిగ్గునీ, ధర్మాన్నీ రెండింటినీ త్యజిస్తారు. తలను బద్దలు చేసే ధనాన్ని మిత్రుడుగా భావించరాదు. ఎవడు పుణ్య ధనుడో వాని పేరు ఫకీరు. ఎవరి హృదయంలో నీవు నివసించి ఉంటావో, ఆ నరుడే గంభీరుడూ, గుణవంతుడూనూ. ధనాన్ని సేకరించడంలో దుఃఖం ఉంది. ధనం పోయినప్పుడు కూడా దుఃఖం కలుగుతుంది. నానక్ చెప్పేదేమంటే సత్యనామము లేకుండా ఆకలి తీరదు. కేవలం రూపం వల్ల ఆకలి తీరదు. రూపం చూసినంతనే ఆకలి మరింత హెచ్చుతుంది. దేహంలో ఎన్ని రసాలున్నాయో అన్నీ దుఃఖ భూయిష్ఠములే. కామాంధకారంలో మనస్సు కూడా అంధకార బంధురమై పోతుంది. మనస్సు గుడ్డిదైనప్పుడు తనువు కూడా అంధమై పోతుంది. రాళ్ళతో కట్టిన ఆనకట్ట తెగిపోయినప్పుడు బురద పూస్తే ఏమవుతుంది గనుక ! కట్ట తెగిపోయింది. పడవ లేదు. తాడు లేదు. తెన్ను లేదు. నానక్ చెప్పేదేమంటే సత్య నామము లేక ఎంతమంది కట్ట కట్టుకుని మునిగిపోయారో ? లక్షలాది మణుగల బంగారం, లక్షలాది మణుగల వెండి, లక్షలాది రాజులూ, మహారాజులూ, సర్వోత్తములైన సామ్రాట్టులు, లక్షలాది నౌకర్లు, లక్షలాది బాజాలు, ఏనుగులు, గుర్రాలూ నీటిపాలయి పోయాయి. సముద్రము అగాధమైనది. అందులోనూ అగ్నిజలంతో నిండి ఉంది. ఎటు చూచినా ఎక్కడ గట్టు కనిపించడం లేదు. హాహాకారంలో ఆక్రందనలు వినబడుతున్నాయి. నానక్ చెప్పేదేమంటే అక్కడికి వెళ్ళవలసి వస్తే వెళ్ళే నాధుడెవడు? ధీరుడెవడు? (1287)

## నామం

87. స్వామి నిత్యుడు. వాని న్యాయము సైతము నిత్యమైనదే. వాని భాష అనంతప్రేమ. దేహి దేహి అంటూ అడుక్కుంటూ ఉంటారు. దానమిస్తూ ఉంటాడు ఆ దాత. ఆయనకు ఏమి కానుక ఇస్తే ఆయన దర్బారులోకి ప్రవేశం దొరుకుతుంది ? దర్శనం లభిస్తుంది ? నోటివెంట ఏమి పలకను ? అది విని నన్ను ప్రేమించడానికి అమృత వేళ సత్యనామముతో వాని దొడ్డ తనాన్ని స్మరించు. సత్కర్మ వలన వస్త్రములాంటి శరీరము లభిస్తుంది. స్వామి కృప వలన ముక్తి లభిస్తుంది. నానక్ చెప్పేదేమంటే సమస్త ప్రపంచమూ ఆయన రూపమే.

(2)

88. మోతీ త ముందర్ ఊసరహి రతనీ త హెూహి జడావు ॥
కస్తూరి కుంగు అగరి చందని లీపి ఆపై చావు ॥
మతు దేఖి భూలా వీసరై తేరా చితి న ఆవై నావు ॥ 1 ॥
హరి బిను జీవు జలి బలి జావు ॥
మా॰ ఆపణా గురు పూఛి దేఖియా అవరు నాహీ ధావు ॥ 1 ॥ రహా ఉ ॥
ధరతీ త హీరే లాల్ జడ్తీ పలఘి లాల్ జడావు ॥
మోహణీ ముఖి మణీ సోహై కరే రంగి పసావు ॥
మతు దేఖి భూలా వీసరై తేరా చితి న ఆవై నావు ॥ 2 ॥
సిధు హెూవా సిధి లాయీ రిధి ఆఖా ఆవు
గుపతు పరగటు హెూయి వైసా లోకు రాఖై భావు ॥
మతు దేఖి భూలా వీసరై తేరా చితి న ఆవై నావు ॥ 3 ॥
సుల్తాను హెూవా మేలి లస్కర్ తఖతి రాఖా పావు ॥
హుకము హాసలు కరీ బైఠా నానకా సభ వావు ॥
మతు దేఖి భూలా వీసరై తేరా చితి న ఆవై నావు ॥ 4 ॥ 1 ॥

– సిరీ రాగు

89. భరీయై హథు పైరు తను దేహ ॥
పాణీ ధోతై ఉతరసు ఖేహ ॥
మూత పలీతీ కపడు హెూయి ॥
దే సాబూణు లయీఐ ఓహు ధోయి ॥
భరీయై మతి పాపాకై సంగి ॥
ఓహు ధోపై నావై కై రంగి ॥
పుంనీ పాపీ ఆఖణు నాహి ॥
కరి కరి కరణా లిఖి లై జాహు ॥
ఆపే బీజి ఆపే హీ ఖాహు ॥
నానక్ హుక్మీ ఆవహు జాహు ॥ 20 ॥

– జపు పౌడీ 20

88. ముత్యాల మందిరంలో రత్నాలు తాపడం చేశారనుకో కస్తూరి, కుంకుమ, అగరు, చందనం కలిపి అలదారనుకో. చూడగానే మనస్సు మురిసిపోతుంది. వీటిని చూచి నేను ఎప్పుడూ భ్రమలో పడకుండును గాక. ఎప్పుడూ నీ నామాన్ని విస్మరించకుండును గాక. హరి లేకుండా జీవుడు దహించుకుని బూడిదై పోతాడు. నేను మా గురువును అడిగి చూచాను. ప్రభువు తప్ప ఈ భూమిపై మరో శరణం లేదు. భూమి వజ్రాలతో, మణులతో నిండి ఉంది. రత్నాలు తాపడం చేసిన శయ్య సమకూడి ఉంది. మణులు ధరించిన ముఖంతో వెలిగిపోతూన్న మోహిని ఎదురుగా హావ భావ విలాసాలు ప్రదర్శిస్తూ ఉంది. కాని వాటిని చూచి నేను భ్రమపడకుండును గాక. నీ నామాన్ని ఎప్పుడూ విస్మరించకుండును గాక. సిద్ధుడనై సిద్ధి పొందెదను గాక. బుద్ధి పిలిస్తే పలుకుతుంది. ఒకప్పుడు గుప్పుడనై పోతాను. కావలెననుకున్నప్పుడు ప్రత్యక్షమవుతూంటాను. లోకులకు నాపై శ్రద్ధ ఉన్నప్పటికీ నేను ఎప్పుడూ భ్రమలో పడకుండును గాక. సుల్తానునైనప్పటికీ, సైనికులను చేర్చుకున్నప్పటికీ, సింహాసనం పై నా పాదాలు ఆన్చినప్పటికీ, నాకు రాజ్యాధికారం వచ్చినప్పటికీ, నానక్ చెప్పేదేమంటే అదంతా వాయు ఝుంకారమేనని. అయినప్పటికీ నేను ఎప్పుడూ భ్రమంలో పడకుండును గాక. నీ నామమును ఎన్నడూ విస్మరించకుండును గాక. (14)

89. కాళ్ళకూ, చేతులకూ ఒంటినిండా బురద అలుముకున్నా, నీటితో కడుక్కుంటే మట్టి అంతా పోతుంది. వస్త్రమునకు మలమూత్రములు సోకి అపవిత్రమై పోయినప్పుడు సబ్బుతో ఉతికితే అది పరిశుభ్ర పడుతుంది. కాని బుద్ధి పాప పంకిలమై మలినమైనప్పుడు, అది నామముతో రంజితమైనప్పుడే శుభ్రపడుతుంది. పుణ్యము, పాపము కేవలం మాటలతో ఏర్పడేవికావు. మనం ఏం చేసినా అది అంతా లెక్కలోకి వస్తుంది. తానే విత్తులు చల్లుతాడు. తానే అనుభవిస్తాడు. నానక్ చెప్పేదేమంటే మనము అందరము ఆదేశానుసారమే వస్తాము. ఆదేశానుసారమే పోతాము. (4)

90. కోటి కోటి మేరీ ఆర్జా పవణు పీయణు అపియాణు ॥
చందు సూరజా దుయి న దేఖా సుపనై సౌణ్ న థావు ॥
భీ తేరీ కీమతి నా పవై హౌ కేవడు ఆఖా నావు ॥ 1 ॥
సాచా నిరంకారు నిజ్ థాయి ॥
సుణి సుణి ఆఖణు ఆఖణా జే భావై కరే తమాయి ॥ 1 ॥ రహౌ ఉ ॥
కుసా కటీయా వార్ వార్ పీసణి పీసా పాయి ॥

అగీ సేతీ జాలీయా భసమ్ సేతీ రలి జావు ॥
భీ తేరీ కీమతి నా పవై హౌ కేవడు ఆఖా నావు ॥ 2 ॥
పంఖీ హోయి కై జే భవా సై అస్మానీ జావు ॥
నదరీ కిసై న ఆవవూ నా కిఛు పీయా న ఖావు ॥
భీ తేరీ కీమతి నా పవై హౌ కేవడు ఆఖా నావు ॥ 3 ॥
నానక్ కాగద్ లఖ్ మణా పడి పడి కీచై భావు ॥
మసూ తోటి న ఆవయీ లేఖణి పవుణు చలావు ॥
భీ తేరీ కీమతి నా పవై హౌ కేవడ్ ఆఖా నావు ॥ 4 ॥ 2 ॥

- సిరీ రాగు

సో జీవియా జిసు మని వసియా సోయి ॥
నానక్ అవరు న జీవై కోయి ॥
జే జీవై పతి లథీ జాయి ॥
సభు హరాము జేతా కిఛు ఖాయి ॥
రాజి రంగు మాలి రంగి రంగు రతా నచై నంగు ॥
నానక్ ఠగియా ముఠా జాయి ॥
విణు నావై పతి గయియా గవాయి ॥ 1 ॥ మ 1 ॥
కియా ఖాధై కియా పైధై హోయి ॥
జా మని నాహి సచా సోయి ॥
కియా మేవా కియా ఘివు గుడ్ మిఠా కియా మైదా కిసా మాసు ॥
కియా కపడు కియా సేజ్ సుఖాలీ కిజహి భోగ్ విలాస్ ॥
కియా లస్కర్ కియా నేబ్ ఖవాసీ ఆవై మహలీ వాసు ॥
నానక్ సచే నామ్ విణు సభే టోల్ వినాసు ॥ 2 ॥

- వార్ మాఝ్ పౌడీ 10, సలోక్ 1, 2

90. నా వయస్సు కోటి వర్షములైనప్పటికీ, అపేయ వాయువును ఆఘ్రాణించినప్పటికీ, గుహలో కూర్చుని ఉన్నప్పటికీ, చంద్ర సూర్యులను చూడకుండా ఉన్నప్పటికీ, నిద్రించడానికి స్వప్నంలోనైనా అవకాశం లభించినప్పటికీ నీ విలువ గణించలేను. ఏమి చెప్పను ? నీ నామమెంత గొప్పదో ! నిజమైన నిరంకార నిజస్థానము నీది. విని విని వానిని వర్ణిస్తూంటారు. అయినా వానికి నచ్చినప్పుడే కృప కలుగుతుంది. మాటి మాటికీ ముక్కలు ముక్కలుగా ఖండింపబడినప్పటికీ, తిరగలిలో పడేసి విసిరేసినప్పటికీ, నిప్పులో పడవేసి మంటపెట్టినప్పటికీ, తగులబడి భస్మమై పోయినప్పటికీ, నేను నీ విలువను గణింపజాలను. ఏమి చెప్పను, నీ నామమెంత గొప్పదో ! పక్షినైనప్పటికీ, ఎగిరినప్పటికీ, వందల కొలది ఆకాశాలను దాటిపోయినప్పటికీ, ఎవరికీ కనబడకుండా పోయినప్పటికీ, ఏమీ తినక పోయినప్పటికీ, తాగకపోయినప్పటికీ, నీ విలువ ఎంతో లెక్కకట్టలేను. ఏమని చెప్పను ? నీ నామమెంత గొప్పదో ! నానక్ చెప్పేదేమంటే లక్షలాది మణుగుల కాగితాలను పఠించినప్పటికీ, వాటిలోని భావాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నప్పటికీ, లెక్క లేనంత సిరా వాడినప్పటికీ, వాయువేగంతో కాలాన్ని నడిపించినప్పటికీ, నేను నీ విలువ ఎంతో లెక్క కట్టలేను. ఏమని చెప్పను ? నీ నామమెంత గొప్పదో ! (14 - 15)

91. ఎవని మనస్సులో వాడు నివసిస్తూ వుంటాడో, వానిదే జీవితం. నానక్ చెప్పేది ఏమంటే వేరెవ్వనిది జీవితం కాదు. జీవితమంటే ఇదే. ఒకవేళ బ్రతికినా పరువు ప్రతిష్ఠలు లేకుండా మరణిస్తాడు. వాడు తినేదంతా అన్యాయపు కూడు. రాజ్యలోభం, ధనలోభం గలవాడు ఎల్లప్పుడూ నగ్ననృత్యాలను చూచి తన్మయుడై పోతాడు. నానక్ చెప్పేదేమంటే అట్టివాని సర్వస్వం దోపిడి పాలవుతుంది. నామ రహితుడు గౌరవం పోగొట్టుకుంటాడు. ఏమి ధరిస్తే ఏమిటి. ఏమి తింటే ఏమిటి, మనస్సులో సత్య ప్రభువు లేనప్పుడు తీపి పదార్థాలు, పిండి వంటలు, తిరుగమోతలు, మైదా, మాంసము, మరెన్ని రకాలో భోగ విలాసాలు, నౌకర్లు, చాకర్లు, దాస దాసిలతో ఏమవుతుంది ? మేడల్లో నివసించినంత మాత్రాన లాభమేమిటి ? నానక్ చెప్పేదేమిటంటే సత్యనామము లేక పట్టి ఆడంబరాలు భోగం మెరుపులు. (142)

92. పహిరా అగని హివై ఘురు బాధా భోజను సారు కరాయీ ॥
పగలే దూఖ్ పాణే కరి పీవా ధరతీ హాక్ చలాయీ ॥
ధరి తారాజీ అంబరు తోలీ పిఛై టంకు చడాయీ ॥
ఏవడు వధా మావా నాహి సభసె నథి చలాయీ ॥
ఏతా తాణు హోవై మన్ అందరి కరీ భి ఆఖి కరాయీ ॥
జేవడు సాహిబు తేవడ్ దాతీ దే దే కరే రజాయీ ॥
నానక్ నదరి కరే జిసు ఉపరి సచినామి వడియాయీ ॥ 1 ॥ మ 2 ॥

93. దుయీ దీవే చౌదహ హట్ నాలే ॥ జేతే జీయ తేతే వణ్జారే ॥
ఖుల్హే హట్ హోవా వాపారు ॥ జో పహుచై సో చలణ్హారు ॥
ధరము దలాలు పాయే నీ సాణు ॥
నానక్ నాము లాహా పర్వాణు ॥
ఘరి ఆయే వజీ వాధాయీ ॥
సచ్ నామ్ కీ మిలీ వడియాయీ ॥ 1 ॥ మం 1 ॥

– వార్ సూహి, పౌడి 13, సలోక్ 1

## అకాల్ పురుఖ్ ది ఏకతా

94. జినీ న పాయియో ప్రేమ్ రసు కంత్న పాయియో సావు ॥
సుంఞేఘర్ కా పాహుణా జివు ఆయియా తివు జావు ॥ 1 ॥ మం 1 ॥
సౌ ఓలామ్హే దినై కే రాతీ మిలని సహంస్ ॥
సిఫతి సలాహణు ఛడికై కరంగీ లగా హంసు ॥
ఫిటు ఇవేహా జీవియా జితు ఖాయి వధాయియా పేటు ॥
నానక్ సచే నామ్ విణు సభో దుస్మను హేతు ॥ 2 ॥

– వార్ సుహి 16 సలోక్ 1, 2

95. తీరథి నావణ్ జావు తీరథ్ నాము హై ॥
తీరథ్ సబద్ బీచారు అంతరి గియాను హై ॥
గుర్ గియాను సాచా థాను తీరథ్ దస్ పురబ్ సదా దసాహరా ॥
హౌ నాము హరికా సదా జాచౌ దేహు ప్రభ ధరణీధరా ॥
సంసారు రోగీ నాము దారూ మైలు లాగై సచ్ బినా ॥
గురువాకు నిర్మల్ సదా చానణు నిత్ సాచు తీరథు మజనా ॥ 1 ॥

ధనాసరీ ఛంత్

92. అగ్నిని ధరించవచ్చు, మంచు ఇంటిలో వుండవచ్చు, ఇనుమును భుజించవచ్చు, సకల దుఃఖాలను మంచి నీటివలె గుక్కిట పట్టవచ్చు, ధరిత్రిని హుంకరించి నడిపించవచ్చు, త్రాసులో ఒక వైపు ఆకాశాన్ని వేసి, రెండవ శిబ్బిలో ఒక లంకం వేసి తూచవచ్చు. ఎవరికీ సాటిలేనంతగా గొప్పవాడనయిపోవచ్చు. అందరి ముక్కుల్లోను ముక్కుతాడు పోయవచ్చు. ఏమంటే అది జరుగుతుంది. అనేంత మనోబలాన్ని సాధించవచ్చు. దాత గొప్ప దనాన్ని బట్టే దానము గొప్పగా వుంటుంది. ఇచ్చేవాడు తన ఇచ్ఛానుసారమే ఇస్తాడు. నానక్ చెప్పేదేమంటే ఎవరి మీద వాడి కృప ప్రసరిస్తుందో వాడికే సత్యనామ సంకీర్తన భాగ్యం లభ్యుతుంది. (147)

93. రెండు దీపాలు, పధ్నాలుగు విపణి వీధులు. ఎందరు జీవులో, అందరు వ్యాపారులు. అంగళ్ళు బట్టబయళ్ళు ఇష్టానుసారం వ్యాపారం సాగింది. ఇక్కడికి చేరేవారందరూ వెళ్ళిపోవలసిన వారే. ధర్మమే దళారి. సరుకుపై ముద్ర వేస్తాడు. నానక్ చెప్పేదేమంటే నామ లాభమే విజయానికి చిహ్నం. ఇంటికి రాగానే వినిపిస్తాయి. జయజయ ధ్వనాలు వానికే సత్యనామము యొక్క గౌరవం లభిస్తుంది. (790)

## అకాల పురుష సమైక్యం

94. ఎవరికి ప్రేమరసము లభించదో వానికి కాంతుని ఆదరణ అందదు. వాడు శూన్యగృహంలో అతిథిలా వుంటాడు. ఎలా వచ్చాడో అలాగే వట్టి చేతులతో వెళ్ళిపోతాడు. పగలు నూరు, రాత్రి వెయ్యి దెప్పరపు మాటలు వినకతప్పదు. నామ సంకీర్తనం వదలిన హంస పంజరంలో పరితపించిపోతుంది. తెగతిన్నాడు పొట్ట పెద్దదయి పోయేటట్లుగా ఛి ! అదేం బ్రతుకు ? నానక్ చెప్పేదేమంటే నామము లేని జీవితంలో మోజులన్నీ జీవిత శత్రువులే. (790)

95. తీర్థస్థానమునకు పోదునా ? నామమే తీర్థము. శబ్దవిచారము, అంతర్జ్ఞానమే తీర్థము. గురు జ్ఞానమే నిజమైన తీర్థస్థానము. ఇది పది పర్వముల పెట్టు అదే నిత్య దశమి. నేను ఎల్లప్పుడూ హరినామమునే యాచిస్తూ ఉంటాను. హే ప్రభూ ! ధరణీధరా ! నాకు ఇదే దానంగా అనుగ్రహించు. సంసారమే రోగం, నామమే ఔషధము. సత్యము లేకుంటే మలము అంటుతుంది. గురువు వాక్కు నిర్మలము, నిత్యాలోకము. ఈ సత్య తీర్థమందే స్నానమాడు. (687)

96. చంచలు చేతున రహాయీ రాయి ॥
చోరీ మిరగు అంగూరీ ఖాయి ॥
చరన్ కమల్ ఉర్ధారే చీత్ ॥
చిరు జీవను చేతను నిత్ నీత్ ॥
చింతత్ హి దీసె సభు కోయి ॥
చేతహి ఏకు తహి సుఖు హోయి ॥
చితి వసె రాచై హరి నాయి ॥
ముకతి భయియా పతి సివు ఘరి జాయి ॥ 23 ॥
- రామకలీ దఖణీ ఓంకార్

97. ఇహు ధను సరబ్ రహియా భర్పూరి ॥
మనముఖి ఫిరహి సి జాణహి దూరి ॥ 1 ॥
సో ధను వఖరు నాము రిదై హమారై ॥
జిసు తూ దేహి తిసై నిస్తారై ॥ 1 ॥ రహా ఉ ॥
న ఇహు ధను జలైన తస్కరు లై జాయి ॥
న ఇహు ధను డూబైన ఇసు ధన్ కౌమిలై సజాయి ॥ 2 ॥
ఇసు ధన్ కీ దేఖహు వడియాయీ ॥
సహజే మాతే అనదిను జాయీ ॥ 3 ॥
ఇక్ బాత్ అనూప్ సునహు నర్ భాయీ ॥
ఇసు ధన్ బిను కహహు కినై పరమ గతి పాయీ ॥ 4 ॥
భణతి నానకు అకథ్ కీ కథా సునాయే ॥
సతిగురు మిలైత ఇహు ధను పాయే ॥ 5 ॥ 8 ॥
- మారూ

96. చంచల చిత్తము నిలకడగా ఉండదు. జింక చాటు చాటుగా ద్రాక్షపండ్లను తినేస్తుంది. చిత్తములో చరణకమలములు నెలకొని వుంటే చిర జీవనం, నిత్య చేతనం లభిస్తాయి. అందరూ చింతనపరులుగానే కనపడతారు. కాని చైతన్యవంతులకే సుఖం లభిస్తుంది. ఎవరి చిత్తములో హరినామం ఉంటుందో వారు ముక్తులవుతారు. సగౌరవంగా సదనం చేరుకుంటారు. (962)

97. ఈ ధనము అన్ని చోట్లా వ్యాప్తమై యున్నది. ఇది తనకు దూరమని మనోముఖుడు భావిస్తాడు. అందుకనే తిరుగుతూ ఉంటాడు. ఈ ధనము నామధనం. మన హృదయంలో ఉంటుంది. ఈ ధనం ఇచ్చిన వాడు తరిస్తాడు. ఈ ధనమును అగ్ని దహించలేదు. చోరులు హరింపలేరు. ఈ ధనము మునగదు. దీనికి దండన ఉండదు. ఈ ధనము యొక్క గొప్పతనము చూడండి. ఇది అనాయాసంగా అనుదినమూ పెరుగుతూంది. ఒక విలక్షణమైన విషయం ఏమిటంటే ఈ ధనము లేక పరమగతి ఎవరికీ లభించదు. సద్గురువు లభించినప్పుడే ఈ ధనము ప్రాప్తిస్తుంది. (991)

98. హౌ గుర్ పూఛవు అపణే గుర్ పూచి కార్ కమావు ॥
సబది సలాహి మని బసె హౌమై దుఖు జలి జావు ॥
సహజే హెూయి మిలావ్డా సాచే సాచి మిలావు ॥ 5 ॥
సబది రతే సే నిర్మలే తజి కామ్ క్రోధు అహంకారు ॥
నాము సలాహని సద్ సదా హరి రాఖహి ఉర్ధారి ॥
సో కివు మనహు విసారీయై సభ జీయా కా ఆధారు ॥ 6 ॥
సబది మరె సో మరి రహై ఫిరి మరై న దూజీ వార్ ॥
సబదై హీత్ పాయీయై హరినామే లగె పియారు ॥
బిను సబదై జగు భూలా ఫిరై మరి జనమై వారో వార్ ॥ 7 ॥
సభ్ సాలాహై ఆప్ కా వడహు వడేరీ హెూయి ॥
గుర్ బిను ఆపున చీనీయై కహే సుణే కియా హెూయి ॥
నానక్ సబది పఛాణీయై హౌమై కరైన కోయి ॥ 8 ॥ 8 ॥

– సిరీ రాగు అసటపదీయా

99. బారహి మహి రావల్ ఖపి జావహి చహు ఛివ మహి సంనియాసీ ॥
జోగీ కాపడీయా సిర్ ఖూథే బిను సబదై గలి ఫాసీ ॥ 1 ॥
సబది రతే పూరే బెరాగీ ॥
ఔహరి హసత మహి భీఖియా జాచీ ఏక్ భాయీ లివ్ లాగీ ॥ 1 ॥
బ్రహ్మణ్ వాదు పడహి కరి కిరియా కరణీ కరము కరాయే ॥
బిను బూఝై కిఛు సూఝై నాహి
మనముఖు విఛుడి దుఖు పాయే ॥ 2 ॥
సబది మిలేసే సూచాచారీ సాచీ దర్గహి మానే ॥
అనదిను నామి రతని లివ్ లాగే జుగి జుగి సాచి సమానే ॥ 3 ॥
సగలే కరమ్ ధరమ్ సుచి సంజమ్ జప్ తప్ తీరథ్ సబది వసే ॥
నానక్ సతిగుర్ మిలైం మిలాయియా దూఖ్ పరాఛత్ కాల్ నసే ॥ 4 ॥ 16 ॥

– పర్భాతీ

98. నేను నా గురువును అడుగుతాను. అడిగిన తర్వాతనే కర్మరతుణ్ణి అవుతాను. శబ్దమును స్తుతిస్తాను. స్వామి మనస్సులో వసించినట్లయితే అహంకారమనే ఆపద దహించుకుపోతుంది. సహజముగానే సమాగమం సిద్ధిస్తుంది. సత్యము ద్వారా సత్యములో కలిసిపోతాను. శబ్దలోలుడు నిర్మలంగా ఉంటాడు. కామక్రోధాలను, అహంకారాన్ని పరిత్యజిస్తాడు. నిత్యమూ నామ సంకీర్తనం చేస్తాడు. సదా హృదయంలో హరిని ప్రతిష్ఠించుకుంటాడు. సకల జీవులకు ఆధారమైన వాణ్ణి మనస్సులో ఎందుకు మరచి పోతావు ? శబ్దము ద్వారా అహమును చంపగలిగిన వాళ్ళు ఒకసారి మరణిస్తే మళ్ళీ మరణించవలసిన అవసరం వుండదు. శబ్దము ద్వారానే ప్రభువు లభిస్తాడు. శబ్దము ద్వారా హరినామమందు ప్రేమ ఏర్పడుతుంది. శబ్దము లేక సమస్త జగత్తు తప్పుదారి పడుతుంది. మాటిమాటికీ మరణిస్తారు. జన్మిస్తూ, మరణిస్తూ వుంటారు. అందరూ ఆత్మ ప్రశంసారతులే. ప్రతివాడు అనుకుంటూ వుంటాడు.– తను అందరికంటే గొప్పవాడని, గురువు లేక ఆత్మ ఎరుక పడదు. ఎంత చెప్పినా, ఎన్ని విన్నా ఏమి ప్రయోజనం ? నానక్ చెప్పేదేమంటే శబ్దము ద్వారానే ఎరుక లభిస్తుంది. శబ్దము లభించిననాడు అహంకారము వుండదు. (58)

99. పన్నెండు పంథాలలో రావల్ సంచరిస్తాడు. సన్యాసి, ఆరులోనో, నాలుగులోనో వుంటాడు. కాషాయి బట్టలు జోగికి కాని, జైనికి కాని. శబ్దజ్ఞానం లేకుంటే గుడికొయ్య తప్పదు. శబ్ద వేత్తయే పూర్ణ విరాగి. అపహతి కరపాత్రతో భిక్షాటనము చేస్తూ ఏకైక విభుని ప్రేమించి, వానియందే నిమగ్నుడై వుంటాడు. బ్రాహ్మణుడు వేదమంత్రాలను చదువుతాడు. కర్మను తాను ఆచరించి, ఇతరుల చేత ఆచరింపచేస్తాడు. కాని ఆలోచన లేకుండా ఏదీ అర్థం కాదు. మనోముఖుడు విరహార్తితో సదా దుఃఖము పొందుతాడు. శబ్దము దొరికిన వాని ఆచరణ పవిత్రంగా ఉంటుంది. అనుదినము నామ రత్నరతితో యుగయుగముల పర్యంతము వారు సత్య సమాశీనులవుతారు. సకల కర్మలు, ధర్మము, శుచి, సంయమము, జపతపాలు, తీర్థయాత్రలు అన్నీ శబ్దములోనే వుంటాయి. నానక్ చెప్పేదేమంటే సద్గురువు దొరికితే ప్రభువు కూడా దొరుకుతాడు. దుఃఖము, పాపము, కాలము నశించిపోతాయి. (332)

100. వాణజు కరహు వణజారిహో వఖరు లేహు సమాలి ॥
జెసీ వసతు విసాహీయై జెసీ నిబహై నాలి ॥
అగె సాహు సుజాణు హై లెసీ వసతు సమాలి ॥ 1 ॥
భాయీ రే రాము కహహు చిత్ లాయి ॥
హరిజసు వఖరు లె చలహు సహు దేఖై పతియాయి ॥ 1 ॥ రహా ఉ ॥
జినా రాసి న సచు హై కివు తినా సుఖు హెూయి ॥
ఖోటై వణజి వణంజియై మను తను ఖోటా హోయి ॥
ఫాహి ఫాథే మిరగ్ జివు దూఖు ఘణో నిత్ రోయి ॥ 2 ॥
ఖోటే పోతెన పవహి తిన్ హరిగుర్ దరసు న హెూయి ॥
ఖోటే జాతి న పతిహై ఖోటి న సీఝసి కోయీ
ఖోటే ఖోటు కమావణా ఆయి గయియా పతి ఖోయి ॥ 3 ॥
నానక్ మను సమ్ఝాయీయై గుర్ కై సబది సాలాహ ॥
రామనామ రంగి రతియా భారు న భరము తినాహ ॥
హరి జపి లాహా అగలా నిర్భవు హరి మన్ మాహ ॥ 4 ॥
– సిరీ రాగు

101. తూ సుల్తాను కహా హౌ మీయా తేరీ కవన్ బడాయీ ॥
జా తూ దేహిసు కహా సువామీ మై మూరఖ్ కహణు న జాయీ ॥ 1 ॥
తేరే గుణ్ గావా దేహి బుఝాయీ ॥
జెసే సచ్ మహి రహవు రజాయీ ॥ 1 ॥ రహా ఉ ॥
జో కిచు హెూవా సభు కిచు తుఝ్ తే తేరీ సభ్ అసనాయీ ॥
తేరా అంతున జాణా మేరే సాహిబ్ మై అంధులే కియా చతురాయీ ॥ 2 ॥
కియా హా కథీ కథే కథి దేఖామై అకథ్ న కథనా జాయీ ॥
జో తుధు భావై సోయీ ఆఖా తిలు తేరీ వడియాయీ ॥ 3 ॥
ఏతే కూకర్ హౌ బేగానా భౌకా ఇసు తన్ తాయీ ॥
భగతి హీణు నానకు జే హెూయిగా తా ఖసమై నావు న జాయీ ॥ 4 ॥ 1 ॥
– బిలావలు

102. ఊత్తము సంగతి ఉత్తము హెవై ॥
గుణ్ కౌ ధావై అవగుణ్ ధోవై ॥
బిను గుర్ సేవే సహజ న హెూవై ॥ 7 ॥
– ఆసా, అసటపదీయా

100. ఓ వ్యాపారీ ! వ్యాపారం సాగించు బేరం సావధానంగా చేయి. నీతో వెంట ఉండే వస్తువులనే కొను. పరలోకంలో సుజ్ఞాని అయిన షావుకారు వున్నాడు. ఆయన తరచి తరచి పరీక్షించి మరీ తీసుకుంటాడు వస్తువుని. ఏకాగ్రచిత్తతో నోరూరా 'రామా' అను. హరియశస్సు వంటి వస్తువులను కొని వెంట తీసుకు వెళ్ళు. చూడగానే వాటి సంగతి షావుకారుకు తెలుస్తుంది. సత్యమనే మూలధనం లేనివారికి సుఖం ఎక్కడ నుంచి వస్తుంది ? దొంగ వ్యాపారం చేస్తే మనస్సు, తనువు రెండూ కూడ కలుషితమై పోతాయి. ఉచ్చులో చిక్కుకున్న మృగం వలె వాళ్ళు ఘోర దుఃఖంలో చిక్కుకుపోతారు. నిత్యము రోదిస్తూ వుంటారు. వెల్లని నాణాలను ఖజానాలో పుచ్చుకోరు. అలాంటి వాళ్ళకు హరిదర్శనము, గురుదర్శనము లభించదు. దొంగలకి జాతి లేదు. వాళ్ళకి గౌరవం లేదు. పూటా సంపాదనతో కృతకృత్యులైన వాళ్ళు ఎవళ్ళు ? మోసగాని సంపాదనంతా మోసమే. అవమానితుడై వస్తాడు. అలాగే పోతాడు. నానక్ చెప్పేదేమంటే గురూపదేశాన్ని మనస్సుకు విశద పరచు. ప్రభువు గుణగానం చేయి. రామనామము రుచి మరిగిన వాళ్ళకి భారం లేదు, భ్రాంతి లేదు. హరినామం జపించడం వలన వచ్చేది లాభమే లాభం. హరిని మనస్సులో ప్రతిష్ఠించుకుని నిర్భయుడవు కా. (22 - 23)

101. నీవు సుల్తానువి. నేను నిన్ను 'మియా' అంటే అందులో నీకు ఒరిగేది ఏముంది ? నువ్వు ఏది అనిపిస్తే అది నేను అంటాను. నేను మూర్ఖుణ్ణి. నాకు చెప్పడానికి ఏమీ రాదు. నీ గుణగానం ఎలా చేయాలో నీవే చెప్పాలి. సత్యమార్గంలో నేను ఎలా వుండగలనో చెప్పు. జరిగినదంతా నీ లీల. అంతా నీ మహిమే. నేను నీ దరికి చేరుకోలేదు. స్వామీ ! నేను అందుణ్ణి తెలివితేటలు లేనివాణ్ణి. నేను ఏం చెప్పను ? ఎంతో చెప్పిన తరువాతనే నాకు తెలిసివచ్చింది - చెప్పలేని దాని గురించి నేను చెప్పలేనని, నీకు నచ్చినట్లు నేను చెప్తాను, నువ్వు గింజంత నీ ప్రశంస ఇక్కడ చాలా కుక్కలున్నాయి. వాటిలో నేను హీనుణ్ణి. ఈ దేహం కోసం ఏదో మొరుగుతూ వుంటాను. నానక్ చెప్పేదేమంటే నేను భక్తి హీనుణ్ణి అయినంత మాత్రాన స్వామి మహిమకు ఏమి కొఱవ కలుగుతుంది? (795)

## సజ్జన సాంగత్యం – సాధు స్వభావం – గురుముఖత

102. ఉత్తముల సాంగత్యంలో మనం ఉత్తములము అవుతాము. గుణ సంపాదనకై ఉద్యమించి నప్పుడు అవగుణాలు సైతం అణిగిపోతాయి. గురు సేవ లేక నైజం లభించదు. (414)

103. కలర్ కేరీ ఛపడీ కవూవా మలి మలి నాయి ॥
మను తను మైలా అవగుణీ చింజా భరీ గంఢీయాయి ॥
పరవరు హంస్ న జాణియా కాగ్ కుపంఖీ సంగి ॥
సాకత్ సిఉ ఐసీ ప్రీతి హై దూరుహు గియానీ రంగి ॥
సంత్ సభా జైకారు కరి గురముఖి కరమ్ కమావు ॥
నిరమలు నావణు నానకా గురు తీరథు దరీయావు ॥ 10 ॥
- సలోక వారాం తే వధీక్

104. బోలహి సాచు మిథియా నహీం రాయీ ॥
చాలహి గురుముఖి హుకమి రజాయీ ॥
రహహి అతీత్ సచే సరణాయీ ॥ 1 ॥
సచ్ ఘరి బైసై కాలు న జోహై ॥
మనముఖ్ కౌ ఆవత్ జావత్ దుఖు మోహై ॥ 1 ॥ రహా ఉ ॥
అపిఉ పీఅఉ అకథు కథి రహీయై ॥
నిజఘరి బైసి సహజ ఘర్ లహీయై ॥
హరి రసి మాతే ఇహు సుఖు కహీయై ॥ 2 ॥
గురుమతి చాల్ నిహచలు నహీ డోలై ॥
గురమతి సాచి సహజి హరి బోలై ॥
పీవై అంమ్రితు తతు విరోలై ॥ 3 ॥
సతిగురు దేఖియా దీఖియా లీనీ ॥
మను తను అరపియో అంతరగతి కీనీ ॥
గతి మితి పాయీ ఆతము చీనీ ॥ 4 ॥
భోజను నాము నిరంజన సారు ॥
పరమ హంస సచు జోతి అపార్ ॥
జహ దేఖఉ తహ ఏకంకారు ॥ 5 ॥
రహై నిరాలను ఏకా సచు కరణీ ॥
పరమ పదు పాయియా సేవా గుర్ చరణీ ॥
మన్ తేమన్ మానియా చూకీ అహం భ్రమణీ ॥ 6 ॥
ఇన విధి కౌణు కౌణు నహీం తారియా ॥
హరి జసి సంత్ భగత్ నిస్తారియా ॥
ప్రభ పాయే హమ్ అవరు న భారియా ॥ 7 ॥
సాచ్ మహలి గురి అలఖు లఖాయియా ॥

103. ఊసర క్షేత్రంలో పైరు వలె, కాకి పదే పదే స్నానం చేస్తూ వుంటుంది. అవగుణాల వలన మనస్సు మలినమయిపోతుంది. తనువు మైలపడిపోతుంది. మాలిన్యంతో నిండిపోయినపుడు దుర్గంధము వ్యాపిస్తుంది. కాకి వంటి కుప్రష్టుల సాంగత్యంలో పడి హంసకు మానస సరోవరం గురించి తెలియలేదు. జ్ఞానీ ! తెలుసుకో పాపులను ప్రేమిస్తే ఫలితం ఇంతే అని. సాధువుల సభలో జయ జయ ధ్వానాలు చేయి. గురుముఖులకు అనుకూలమైన కర్మను ఆచరించు. నానక్ చెప్పేదేమంటే గురువే తీర్థజలం. అదే నిర్మల స్నానం. (1411)

104. సత్యవాదులు ఆవగింజంత కూడా అబద్ధం చెప్పరు. గురు ముఖుల ఆదేశానుసారమే నడుచుకుంటారు. వాళ్ళు సత్యాన్ని ఆశ్రయించి అన్నింటికీ అతీతులుగా ఉంటారు. సత్య గృహంలో వుంటున్న వాళ్ళపై కాలప్రభావం ఏమీ వుండదు. మనోముఖుడు వస్తూ పోతూ ఉంటాడు, మోహ దుఃఖ పీడితుడై గురుముఖుడు అమృతాన్ని ఆస్వాదిస్తూ వుంటాడు, చెప్పజాలని దానిని గురించి చెబుతూ వుంటాడు, నిజగృహంలో వుంటున్నా, సహజ గృహాన్ని చూస్తూ వుంటాడు. హరిరసమత్తుడైన వాడికి సుఖం లభిస్తుంది. గురుమతి గమనము నిశ్చలమైనది. తడబాటు లేనిది. గురూపదేశమున వారు సత్యంలో నిమగ్నులై వుంటారు. సహజ హరి భక్తులుగా ఉంటారు. తత్వాన్ని మథించి వారు అమృతాన్ని ఆస్వాదిస్తూ వుంటారు. సద్గురుని దర్శించి, దీక్షను పొంది, మనస్సును అర్పించి, ప్రభువును మనస్సులో నిలుపుకుంటారు. తన్ను తాను తెలుసుకుంటారు. గతిమితి తెలుసుకుంటారు. వాని భోజనము సర్వశ్రేష్ఠమైన నిరంజన నామము. వారే పరమహంసలు. అపార సత్యజ్యోతి. ఎక్కడ చూచినా వాళ్ళకి ఒక్క ఓంకారమే కనపడుతుంది. వారు చేసేదంతా సత్యము యొక్క పరిచర్య. వారు నిర్లిప్తంగా వుంటారు. గురుచరణ సంసేవనం వల్ల పరమపదం పొందుతారు. అహంకారం నశించింది. భ్రమ తొలగిపోయింది. మనస్సుతో మనస్సు సమాధాన పడ్డది. ఈ విధంగా ఎందరెందరో తరించారు. హరి యశస్సు అనేక మంది సాధువులను ఉద్ధరించింది. ప్రభువు దొరకినంతనే అన్యమైన అన్వేషణ అంతా అణగిపోయింది. సత్యమందిరంలోని సౌందర్యాన్ని గురువు చూపించాడు. ఆ మందిరం నిశ్చలమైనది. అందులో మాయ ఛాయ కూండా లేదు. సత్యము ద్వారా సంతుష్టి కలిగింది. భ్రమ తొలగిపోయింది. ఎవరి మనస్సులో సత్యము నసించిందో వాని సాంగత్యములో గురుముఖుడు అవుతాడు. నానక్ చెప్పేదేమంటే సత్య నామము ద్వారా మాలిన్యం తొలగిపోతుంది. (227- 28)

నిహచల్ మహలు నహీఁ ఛాయియా మాయియా ॥
సాచి సంతోఖే భరము చుకాయియా ॥ 8 ॥
జిన్ కె మని బసియా సచు సోయీ ॥
తిన్ కీ సంగతి గురముఖి హోయీ ॥
నానక్ సాచి నామి మలు ఖోయీ ॥ 9 ॥ 15 ॥

– గౌడీ, అసటపదీయా

105. గురముఖి సాచే కా భౌ పావై ॥ గురముఖి వాణీ అఘడు ఘడావై ॥
గురముఖి నిరమల్ మరి గుణ్ గావై ॥
గురముఖి పవిత్రు పరము పదు పావై ॥
గురముఖి రోమి రోమి హరి ధియావై
నానక్ గురముఖి సాచి సమావై ॥ 27 ॥
గురముఖి ధరతీ సాచే సాజీ ॥
తిస మహి ఓపతి ఖపతి సు బాజీ ॥
గుర్ కె సబది రపై రంగు లాయి ॥
సాచి రతా పతి సియు ఘరి జాయి ॥
సాచ్ సబద్ బిను పతి నహీఁ పావై ॥
నానక్ బిను నావై కియు సాచి సమావై ॥ 30 ॥

– రామకలీ సిధ్ గోసటి

106. గురముఖి నాము దాను ఇస్‌దాను ॥
గురముఖి లాగె సహజి ధియాను ॥
గురముఖి పావై దర్‌గహ్ మాను ॥
గురముఖి భౌ భంజను పర్‌ధాను ॥
గురముఖి కరణీ కార్ కరాయే ॥
నానక్ గురముఖి మేలి మిలాయే ॥ 36 ॥
గురముఖి సాస్త్ర సిమృతి బేద్ ॥
గురముఖి పావై ఘట్ ఘట్ భేద్ ॥
గురముఖి వైర్ విరోధ్ గవావై ॥
గురముఖి సగలీ గణత మిటావై ॥
గురముఖి రామ్ నామ్ రంగి రాతా ॥
నానక్ గురముఖి ఖసము పఛాతా ॥ 37 ॥

– రామకలీ సిధ్ గోసటి

105. గురుముఖుడు మనస్సులో ఎప్పుడూ సత్య భయాన్ని నిలుపుకుంటాడు. గురుముఖుని మాట ద్వారా మనస్సులోని సమస్యలన్నీ పరిష్కారమవుతాయి. గురుముఖుడు నిర్మలుడు. హరి గుణగానము చేస్తూ వుంటాడు. గురుముఖుడు పవిత్రుడు పరమ పదాన్ని పొందుతాడు. గురుముఖుడు రోమరోమంలోనూ హరినే ధ్యానిస్తూ వుంటాడు. నానక్ చెప్పేదేమంటే గురుముఖుడు సత్య సమాలీనుడై వుంటాడు. గురుముఖుని కోసమే ప్రభువు ఈ ధరిత్రిని సృష్టించాడు. ఉత్పత్తి, వినాశము, వాని లీలలే. గురూపదేశమున ఎవడు ఆనందము పొందుతాడో, వాడు సత్యలీనుడై, సన్మానితుడై, గృహం చేరుకుంటాడు. సత్య శబ్దము లేక మాన్యతలేదు. నానక్ చెప్పేదేమంటే నామము లేక ఎవరికి మాత్రము సత్యము దొరుకుతుంది ? (105)

106. గురముఖ లక్షణాలు నామం, దానం, స్నానం గురుముఖుని సహజ స్వభావము ధ్యానం. గురుముఖుని సమాగమం వలన ప్రభుచరణ సన్నిధిని గౌరవము లభిస్తుంది. గురువు భవభంజనుడు ప్రధాని. గురుముఖుడు కరణీయములైన కార్యములను చేయిస్తాడు. నానక్ చెప్పేదేమంటే గురుముఖుని ద్వారా ప్రభు సందర్శనము లభిస్తుంది. గురుముఖుడు శాస్త్రములను, స్మృతులను, వేదములను సహజముగా తెలుసుకొన్నవాడు. గురుముఖుడు అన్ని రకాలైన లెక్కలని భేదభావాలను తొలగిస్తాడు. గురుముఖుడు రామనామానురాగి, నానక్ చెప్పేదేమంటే గురుముఖుడు స్వామిని గుర్తిస్తాడు. (942)

107. గురముఖి ఆసటిసిధీ సభి బుధీ ॥
గురముఖి భవజలు తరీయై సచ్ సుధీ ॥
గురముఖి సర్ అపసర్ బిధి జాణై ॥
గురముఖి పరవిరతి నరవిరతి పఛానై ॥
గురముఖి తారే పారి ఉతారే ॥
నానక్ గురముఖి సబది నిస్తారే ॥

– రామకలీ సిధ్‌గోసటి

108. జపు తపు సంజము సాధీయై తీరథి కీచై వాసు ॥
పుంన్ దాన్ చంగియాయీయా బిను సాచే కియా తాసు ॥
జేహా రాధే తేహా లుణై బిను గుణ్ జనము వినాసు ॥ 1 ॥
ముంధే గుణ్ దాసీ సుఖు హోయి ॥
అవగణ్ తియాగి సమాయీయై గురమతి పూరా సోయీ ॥ 1 ॥ రహా ఉ ॥
విణు రాసీ వాపారీయా తకేకుండా చారి
మూలు న బూఝై ఆపణా వసతు రహీ ఘర్‌బారి ॥
విణు వఖర్ దుఖు అగలా కూడి ముఠీ కూడియారి ॥ 2 ॥

– సిరీ రాగు, అసటపదీయా

109. సిదకు సబూరీ సాదికా సబరు తోసా మలాయికాం ॥
దీదారు పూరే పాయిసా థావు నాహీ ఖాయికా ॥ 2 ॥

– వార్ సిరీ రాగు పౌడీ 2, సలోక్ 2

110. గలీం అసీ చంగీయా ఆచారీ బురీయాహ్ ॥
మనహు కుసుధా కాలీయా బాహరి చిట్‌వీయాహ్ ॥
రీసా కరహి తినాడీయా జో సేవహి దరు ఖడీయాహ్ ॥
నాలి ఖసమై రతీయా మాణహి సుఖి రలీయాహ్ ॥
హోదె తాణి నితాణీయా రహహి నిమానణీయాహ్ ॥
నానక్ జనము సకారథా జే తిన్ కై సంగి మిలాహ్ ॥ 2 ॥

– వార్ సిరీ రాగు పౌడీ 7, సలోక్ 2

107. గురుముఖునకు అష్టసిద్ధులు ప్రాప్తిస్తాయి. దాని వలన సమగ్ర బుద్ధి ప్రాప్తిస్తుంది. సత్యము, శుచి అనే వాటిపైన ఆధారపడి, వాటి బలంతోనే భవసాగరాన్ని తరిస్తాడు. గురుముఖునకు అనుకూల సమయం తెలుసు. పద్ధతి తెలుసు. గురుముఖుడు ప్రవృత్తిని, నివృత్తిని గుర్తించగలుగుతాడు. గురుముఖుడు భవసాగరాన్ని దాటిస్తాడు. నానక్ చెప్పేదేమంటే గురుముఖుడు ఉపదేశము ద్వారా తరింపజేస్తాడు. (941)

## గుణ గ్రహణం

108. జపము, తపము, సంయమము పాటిస్తూ సాధన చెయ్యి. తీర్థస్నానం చేయి. పుణ్యము, దానము, శుభ కర్మములు చేయి. అయినా సత్యము లేకపోతే ఏమి లాభము ? ఏది విత్తితే అదే కోస్తాడు. గుణం లేనప్పుడు జన్మము వ్యర్థమే. గుణదాసుడు అయినపుడు సుఖము కలుగుతుంది. అవగుణములు త్యజించి గురుమతములో లీనమైన వాడే పూర్ణుడు. పెట్టుబడి లేని వ్యాపారి నాలుగు దిక్కులా తిరిగినా లాభం లేదు. తన ఇంట్లో వున్నా మూల వస్తువునే కానలేదు. ధనం లేకపోతే తనువు కృశిస్తుంది. మిథ్యా వాది మిధ్య వల్లనే మోసపోతాడు. (56)

109. సత్యం, సహనం సాధకులకు పాథేయంగా ఉపకరిస్తాయి. క్షమా లక్షణం దేవతలకు పాథేయం. అలాంటి వారికే పరిపూర్ణమైన ప్రభు దర్శనం లభిస్తుంది. మూర్ఖులకు అక్కడ అవకాశం లేదు. (83)

110. కబుర్లు చెప్పటంలో చాలా గొప్పవారము. కాని ఆచరించడంలో పనికిరాని వారము. మనస్సులో అంతా కుళ్ళే, నలుపే, కాని తనువు మాత్రము తెల్లగా, చక్కగా వుంటుంది. పోల్చుకో వాళ్ళతో, ద్వారం దగ్గఱ నిలబడి సేవించేవాళ్ళతో స్వామి అనురాగంలో మగ్నులై ఆనందంగా సుఖాన్ని అనుభవిస్తూ ఉంటారు. బలవంతులైనప్పటికీ బలప్రయోగం చేయకుండా సాత్త్వికులై నిరభిమానులై వుంటారు. నానక్ చెప్పేదేమంటే అట్టివారి సాంగత్యంలో వుండేవారి జన్మే జన్మ. (85)

111. గుణా కా హొవై వాసులా కఢి వాసు లయీజై ॥
జే గుణ్ హోవని సాజనా మిలి సాఝ్ కరీజై ॥
సాఝ్ కరీజై గుణహ్ కేరీ ఛోడి అవగణ్ కేరీ ఛోడి అవగణ్ చలీయై ॥
పహిరే పటంబర్ కరి అడంబర్ ఆపణా పిడు మలీయై ॥
జిథై జాయి బహీయై భలా కహీయై ఝోలి అమ్మ్రితు పీజై ॥
గుణాకా హొవై వాసులా కఢి వాసు లయీజై ॥ 3 ॥ 1 ॥ 4 ॥
– సూహీ ఛంత్

112. గురు సాగరో రతనాగరు తితు రతన్ ఘణేరే రామ్ ॥
కరి మజనో సపత సరే మన్ నిర్మల్ మేరే రామ్ ॥
నిర్మల్ జలి నాయే జా ప్రభ భాయే పంచ్ మిలే వీచారే ॥
కాము కరోధు కపటు బిఖియా తజి సచునాము ఉరి ధారే ॥
హౌమై లోభ్ లహరి లబ్ థాకే పాయే దీన్ దయియాలా ॥
నానక్ గుర్ సమాని తీరథు నహీ కోయీ సాచై గురు గోపాలా ॥ 3 ॥
– ఆసా ఛంత్

113. అవగుణ్ ఛోడి గుణా కౌ ధావహు కరి అవగుణ్ పఛుతాహి జీవు ॥ 1 ॥
సర్ అపసర్ కి సార్ న జాణహి ఫిరి ఫిరి కీచ్ బుడాహి జీవు ॥ 2 ॥ 22 ॥
అంతరి మైలు లోభ్ బహు ఝూఠే బాహరి నావహు కాహి జీవు ॥
నిరమల నాము జపహు సద గురుముఖి అంతర్ కి గతి తాహి జీవు ॥ 3 ॥
పరహరి లోభు నిందా కూడు తియాగహు సచు గుర్బచనీ ఫలు పాహి జీవు ॥
జివు భావై తివు రాఖహు హరి జీవు జన్ నాక్ సబది సలాహి జీవు ॥ 4 ॥ 9 ॥
– సోరఠి

111. నీ వద్ద గుణమంజూష అంటూ వుంటే ఆ పెట్టెను తెరచి సద్గుణ సుగంధాన్ని ఆఘ్రాణించు. మిత్రులు గుణవంతులు వుంటే వాళ్ళని కలుసుకో. వాళ్ళ మంచి గుణాలను స్వంతం చేసుకో. గుణవంతుడిని సేవిస్తూ అవగుణాలను ఇక్కడే వదలి పెట్టిపో. పట్టుబట్టలు కట్టుకుని, చక్కగా అలంకరించుకుని నీ తావున నువ్వు .వుండు. ఎక్కడికి వెళ్ళి కూర్చున్నా మనకు మంచిని తెచ్చిపెట్టే మాటలు విను. పాచిని పరిహరించి అమృతపానం చెయ్యి. మన దగ్గిఅ గుణమంజూష వున్నట్లయితే దానిని తెరచి దానిలోని సద్గుణ సుగంధాన్ని ఆఘ్రాణించు. (765-66)

## సదాచారం

112. గురువు సాగరము రత్నాకరము వాని వద్ద రత్నాలు ఎన్నో ఉన్నాయి. గురువే సప్త సరోవరాలు. దానిలో మునిగి, ఓ మనసా ! పరిశుద్ధము కా. ప్రభువుకి అంగీకారం అయినట్లయితే నిర్మల జలములో స్నానం చేసి జీవుడు పవిత్రుడవుతాడు. పెద్దలను కలుసుకుని ఆలోచించు. కామ క్రోధాది విషయములను పరిత్యజించి సత్యనామమును హృదయములో ప్రతిష్ఠించుకో. అహంభావ-లోభ తరంగాలు శాంతింపాయి. దీన దయాళుడైన ప్రభువు వెంత చేరాను. నానక్ చెప్పే దేమంటే గురువుతో సమానమైన తీర్థం మరొకటి లేదు. గురువు నిజమైన గోపాలుడు. (437)

113. అవగుణములను త్యజించి గుణముల వైపు పరుగెత్తు. అవగుణునికి చివరకు పశ్చాత్తాపము మిగులుతుంది. మంచి చెడ్డా తెలియని వాళ్ళు అస్తమానం కుళ్ళులో మునిగి వుంటారు. లోపల మాలిన్యం, లోభం, అసత్యం ఉన్నప్పుడు, పైకి ఎన్ని స్నానములు చేసినా ఏమి లాభం ? గురూపదేశం ద్వారా సదా నిర్మల నామాన్ని జపించు. అందరికి అప్పుడే అనంతమయిన జ్ఞానం కలుగుతుంది. లోభాన్ని, నిందని త్యజించు. అసత్యాన్ని విడనాడు. గురూపదేశము ద్వారా సత్య ఫలము లభిస్తుంది. నీకు ఎలా నచ్చితే నేను అలానే ఉంటాను. నానక్ చెప్పేదేమంటే నేను నీ దాసుణ్ణి. శబ్దం ద్వారా నీ గుణాన్ని కీర్తిస్తాను. (598)

114. గాఛహు పుత్రీ రాజకువారి ॥
నాము భణహు సచు దోతు సవారి ॥
ప్రివు సేవహు ప్రభ ప్రేమ అధారి ॥
గుర్ సబదీ బిఖు తియాస్ నివారి ॥ 7 ॥
మోహని మోహి లీయా మను మోహి ॥
గుర్ కె సబది పఛానా తోహి ॥
నానక్ ఠాఢే చాహహి ప్రభూ దువారి ॥
తేరే నామి సంతోఖే కిర్‌పా ధారి ॥ 8 ॥ 1 ॥

– బసంత్ అసటపదీయా

[సందర్భము : సింహళ ద్వీప రాజైన శివనాభుడు గురునానక్ దర్శనార్థమై తన భవనములో వేచియుండెను. ఆ సమయమున తన మనసులో ఇట్లు భావించెను. "నేను గురునానక్‌ను ఎట్లు గుర్తించెదను ?" అందుకై ఆయన తన వద్దకు రాదలచిన ప్రతి గురువు వద్దకు అందమైన వేశ్యలను పరీక్షార్థము పంపనారంభించెను. నిజమైన గురువు లేదా సద్గురువు వీరి వలలో పడడని ఆయన విశ్వాసము. అట్లు రాజు పనుపున తన వద్దకు వచ్చిన వేశ్యల నుద్దేశించి గురునానక్ చెప్పిన గీతమిది.]

114. ఓ పుత్రీ ! ఓ రాజకుమారీ ! వెళ్ళు. నామాన్ని జపించు. సత్యమనే శృంగారాన్ని అలంకరించుకో. ప్రియుని సేవించు. ప్రభు ప్రేమ నీకు ఆధారం. గురూపదేశము ద్వారా విషమ తృష్ణను వదులుకో. నా మనస్సు అంతా మోహింప చేసాడు మోహనుడు. గురూపదేశము ద్వారా నేను నిన్ను తెలుసుకున్నాను. ప్రభువు ద్వారము చెంత నానక్ వుండదలుచుకున్నాడు. కృపచూడు ప్రభూ ! నీ నామముతో సంతోషము కలిగేటట్లుగా. (1187)

# దైన్యం

నీచా అందరి నీచ జాతి నీచీహూ అతి నీచు
నానకు తినకై సంగిసాథి వడియా సివు కియా రీస్
జైథై నీచ్ సమాలియని తిథై న దరి తేర్ బక్షీస్
- సిరీ రాగు

నీచాతినీచులౌ నిమ్నజాతీయుల/వెంతనే నానకు
చిత్తముండు./శ్రేష్ఠ కులము వారి వెంతనేమున్నది ?
నీచ దీనుల రక్ష నీ వ్రతంబు.

115. హౌ ఢాఢీ వేకారు కారె లాయియా ॥
రాతి దిహై కె బార్ ధురహు పుర్మాయియా ॥
ఢాఢీ సచై మహలి ఖసమి బులాయియా ॥
సచీ సిఫతి సాలాహ కపడా పాయియా ॥
సచా అమృత నాము భోజను ఆయియా ॥
గుర్మతీ ఖాయియా రజి తిని సుఖు పాయియా ॥
ఢాఢీ కరే పసావు సబదు వజాయియా ॥
నానక్ సచు సాలాహి పూరా పాయియా ॥ 27 ॥

— వార్ మాఝ్ పౌడీ 27

116. సింమల్ రుఖు సరాయిరా అతి దీరఘ్ అతి ముచు ॥
ఓయి జి ఆవహి ఆస్ కరి జాహి నిరాసే కితు ॥
ఫల్ ఫికే ఫుల్ బక్‌బకే కమి న ఆవహి పత్ ॥
మిఠతు నీవీ నానకా గుణ్ చంగియాయియా తతు ॥
సభు కో నివై ఆప్ కౌ పరకౌ నివై న కోయి ॥
ధరి తారాజూ తోలీయై నివై సు గౌరా హోయి ॥
అపరాధీ దూణా నివై జో హంతా మిర్గాహి ॥
సీసి నివాయియై కియా థీయై జా రిదై కుసుధే జాహి ॥ 1 ॥

వార్ ఆసా పౌడీ 14, సలోక్

117. నా జాణా మూరఖు హై కోయీ నా జాణా సియాణా ॥
సదా సాహిబ్ కై రంగే రాతా అనదిను నాము వఖాణా ॥ 1 ॥
బాబా మూరఖు హా నావై బలి జావు
తూ కర్తా తూ దానా బీనా తేరై నామి తరావు ॥ 1 ॥ రహౌ ఉ ॥
మూరఖు సియాణా ఏకు హై ఏక్ జోతి దుయి నావు ॥
మూరఖా సిరి మూరఖు హై జి మంనే నాహీ నావు ॥ 2 ॥

— మారూ అసటపదీయా

115. నేను పనికి మాలిన పాలకాడిని ప్రభువే నాకు పని పురమాయించాడు. ఆయన దర్బారు నుంచి నాకు ఒక ఫర్మానా వచ్చింది. పగలూ రాత్రి నా యశోగానము చేయి అని స్వామి నన్ను సత్యమహలుకు పిలిపించాడు. సత్యగుణగానమనే మేలి దుస్తులు ధరింపచేసాడు. సత్యామృతమనే భోజనం దొరికింది. గురూపదేశము ద్వారా ఎవరైతే తనివిదీరా ఆస్వాదించారో వారికే సుఖం దక్కింది. ప్రభువు ప్రసాదాన్ని స్వీకరించి నేను శబ్దనాదంలో తన్మయుడిని అయిపోయాను. నానక్ చెప్పేదేమంటే ఎవరైతే సత్య గుణగానం చేస్తారో వారికే పూర్ణ ప్రభువు లభిస్తాడు. (150)

116. బూరుగు వృక్షము అతి తిన్నగా, ఎత్తుగా, దీర్ఘకాయంగా వుంటుంది. పక్షులు మనస్సులో ఎన్నో ఆశలు నింపుకుని చేరుకుంటాయి. అవి నిరాశ చెంది ఎక్కడికి పోతాయి ? పండ్లు చప్పగా వున్నాయి. పూలు వాసన లేనివి. బూరుగు ఆకులు ఎందుకూ పనికి రావు. మృదు భాషణము, నమ్రత రెండూ సద్గుణ, సత్కర్మలకు సారభూతమైన తత్వాలు. ప్రతివాడు అనుకుంటూ వుంటాడు – ఇతరులు తనపట్ల నమ్రులుగా వుండాలని. కాని ఇతరుల పట్ల నమ్రతగా వుండే వాళ్ళు ఎవరూ లేరు. త్రాసులో వుంచి వస్తువును తూచేటప్పుడు వంగిన వైపే ఎక్కువ బరువుగా ఉందని అనుకుంటూ వుంటారు. మృగహంతుకుని వలె అపరాధి రెట్టింపు వంగి వుంటాడు. తలవంచినంత మాత్రాన ఏమవుతుంది ? హృదయం కుళ్ళుతో నిండినపుడు ? (470)

117. నాకు తెలియదు ఎవడు మూర్ఖుడో. ఎవడు బుద్ధిమంతుడో కూడా నాకు తెలియదు. సదా స్వామి చింతనలో లీనమై అనుదినము నామస్మరణము చేస్తూ వుంటాను. బాబా ! నేను మూర్ఖుణ్ణే కావచ్చు. కాని నేను నామానికి అంకితమై పోయాను. కర్తవు నీవే. జ్ఞానివి నీవు. దూరదర్శివి నీవు. నీ నామము ద్వారానే నేను తరించాలి. నామమందు నమ్మకం లేనివాడు మూర్ఖాతి మూర్ఖుడు. (1015)

# లోకసేవ

సముకరణీ అబ్ అంతరి సేవా
మను తృపతాసియాఁ అలఖ్ అభేవా
- గోడీ అసలేపదియా

సత్కర్మలు చేతలలో సేవా భావము మదిలో మనసు తృప్తి చెందునపుడు స్వామి గోచరించునపుడు.

118. సేవ కీతి సంతోఖీయాఁ జిన్హీ సచో సచు ధియాయియా ॥
ఓన్హీ మందె పైరు న రఖియో కరి సుకృతు ధరము కమాయియా ॥
ఓన్హీ దునియా తాడే బంధనా అంను పాణీ థోడా ఖాయియా ॥
తూఁ బఖసీసీ అగలా నిత్ దేవహి చడహి సవాయియా ॥
వడియాయీ వడా పాయియా ॥ 7 ॥

- వార్ ఆసా, పౌడి 7

119. సేవా సురతి రహసి గుణ్ గావా గురముఖి గియాను బీచారా ॥
ఖోజీ ఉపజై బాదీ బినసై హౌ బలి బలి గుర్ కర్తారా ॥
హమ్ నీచ్ హోతే హీణ్ మతి ఝూఠే తూ సబది సవారణ్‌హారా ॥
ఆతమ్ చీని తహా తూ తారణ్ సచు తారే తారణ్‌హారా ॥ 3 ॥

- మలార్

120. ఇతు తని లాగై బాణీయా ॥
సుఖు హోవై సేవ కమాణీయా ॥ సభ్ దునీయా ఆవణ్ జానీయా ॥ 3 ॥
విచి దునీయా సేవ కమాయీయై ॥
తా దర్‌గహ్ బైసణు పాయీయై ॥
కహు నానక్ బాహ లుడాయీయై ॥ 4 ॥ 23 ॥

- సిరీ రాగు

121. హౌమై గరబు గవాయీ పాయీయై వీచారు
సాహిబ్ సివ్ మను మానియా దేసాచు అధారు ॥ 2 ॥
అహనిసి నామి సంతోఖీయా సేవా సంచు సాయీ ॥
తా కౌ విఘను న లాగయీ చాలై హుకమి రజాయీ ॥ 3 ॥

- ఆసా అసటపదీయా

122. బ్రహ్మా, బిసను రిఖీ మునీ సంకరూ ఇందు తపై భేఖారీ ॥
మానై హుకము సోహై దరి సాచై ఆకీ మరహి అఫారీ ॥
జంగమ్ జోధ్ జతీ సంనియాసీ గురి పూరే వీచారీ ॥
బిను సేవా ఫలు కబహు న పావసి సేవా కరణీ సారీ ॥ 2 ॥

- మారూ

118. సంతుష్టాంత రంగులూ సత్యాతి సత్యమును నిరంతరం ధ్యానించే వారు మాత్రమే సేవ చేయగలుగుతారు. వారెప్పుడూ చెడు త్రోవలు త్రొక్కరు. వారెప్పుడూ సుకృతములే చేస్తూ వుంటారు. ధర్మాన్ని పాలిస్తూ వుంటారు. ప్రపంచ బంధాలన్నిటినీ వారు త్రుంచి వేసుకుంటారు. వాళ్ళ అన్నపానాలు అణుమాత్రంగా ఉంటాయి. నీవు మహాదాతవు. నిత్యము దానము చేస్తూ వుంటావు. నీవు చేసే దానము నిత్యము వృద్ధి చెందుతూ వుంటుంది. గుణగానము ద్వారా మహాగుణివి అవుతావు. (466 - 67)

119. గురువు ద్వారా ఈ జ్ఞానము మనస్సులో కుదురుకుంది. సేవా దృష్టితో వాడి గుణగానము చేస్తూ వుండు. ఆనందప్రాప్తి కలుగుతుంది. అన్వేషణ ద్వారా జ్ఞానాభివృద్ధి కలుగుతుంది. వివాదము వలన నాశనము కలుగుతుంది. గురువైన సృష్టికర్తకు నా జోహారులు. మేము నీమలం మతిలేని వాళ్ళము. అసత్య వాదులం. శబ్దంతో మమ్మల్ని సంస్కరించావు. ఆత్మను అవగాహన చేసుకునేందుకు నీవే కర్ణధారివి. సత్యమే తారకము. అదే తరింప చేస్తుంది. (1255)

120. ఈ తనువును కోరికలనే బాణములు చీల్చి వేస్తున్నాయి. లోకసేవ ద్వారా ప్రభువు లభిస్తాడు. సకల ప్రపంచము వచ్చి పోయేదే. ప్రపంచంలో సేవ చేయడం ద్వారానే జీవి ప్రభువు పాదాల చెంతకు చేరుకోగలుగుతాడు. నానక్ చెప్పేదేమంటే నువ్వు చేతులూపుకుంటూ ప్రభువు చెంతకు చేరుకుంటావు. (25 - 26)

121. అహంకారము, గర్వము నశించినపుడు సద్విచారము సాధ్యమవుతుంది. ఒకవేళ మనస్సుకు సత్యమనే ఆధారం దొరికితే స్వామిపై మనస్సు లగ్నమవుతుంది. మనస్సు అహర్నిశలు నామమందు లీనమై సంతోషించినపుడే సత్యసేవ లభిస్తుంది. ప్రభువు ఆజ్ఞాధీనులై ఎవరు నడుచుకుంటారో వాళ్ళకి మార్గంలో ఆటంకాలేవీ వుండవు. (421)

122. బ్రహ్మ, విష్ణువు, ఋషులు, మునులు, శంకరుడు, ఇంద్రుడు, తపస్సు చేస్తున్నప్పటికీ, యాచకులే. ఎవరు ఆజ్ఞను పాటిస్తారో వారు ప్రభువు చరణముల చెంత శోభిస్తారు. అవజ్ఞాకారి, అహంకారి కొట్టిమిట్టు లాడుతూనే వుంటాడు. జంగము, యోద్ధ, యతి, సన్యాసి, అందరికి పూర్ణ గురువు ధ్యేయం. సేవ లేకుండ ఫలితమెప్పుడూ లభించదు. సేవే సర్వశ్రేష్ఠమైనది. (421)

123. జపు తపు ప్రేమ ఖేలణ్ కా చావు ॥
సిరు ధరి తలీ గలీ మేరీ ఆవు ॥
ఇతు మారగి పైరు ధరీజై ॥
సిరు దీజై కాణిన కీజై ॥ 20 ॥

– సలోక్ వారాఁ తే వధీక్

124. రే మన్ ఐసీ హరి సివు ప్రీతి కరి జైసీ జల్ కమలేహి ॥
లహరీ నాలి పఛాడీయై భీ వికసై అసనేహి ॥
జల మహి జీయ ఉపాయి కై బిను జల్ మరణు తినేహి ॥ 1 ॥
మన్ రే కివు ఛూటహి బిను పియార్ ॥
గురముఖి అంతరి రవి రహియా బఖసే భగతి భండార్ ॥ 1 ॥ రహా ఉ ॥
రే మన్ ఐసీ హరి సివు ప్రీతి కరి జైసీ మఛులీ నీర్ ॥
జివు అధికవు తివు సుఖు ఘణో మని తని సాంతి సరీర్ ॥
బిను జల్ ఘడీన జీవయీ ప్రభు జాణై అభ పీర్ ॥ 2 ॥
రే మన్ ఐసీ హరి సివు ప్రీతి కరి జైసీ చాత్రిక్ మేహ ॥
సర్ భరి థల్ హరీయావలే ఇక్ బూంద్ న పవయీ కేహ ॥
కరమి మిలై సో పాయీయై కిరతు పయియా సిరి దేహ ॥ 3 ॥
రే మన్ ఐసీ హరి సివు ప్రీతి కరి జైసీ జల్ దుధ్ హోయి ॥
ఆవటణు ఆపే ఖవై దుధ్ కా ఖపణి న దేయి ॥ 4 ॥
ఆపె మేలి విఛునియా సచివడియాయీ దేయి ॥
రే మన్ ఐసీ హరి సివు ప్రీతి కరి జైసీ చకవీ సూర్ ॥
ఖిను పలు నీద్ న సోవయీ జాణై దూరి హజూరి ॥
మనముఖి సోఝీ నా పవై గురముఖి సదా హజూరి ॥ 5 ॥

– సిరీ రాగు అసటపదీయా

125. నానక్ గాలీ కూడీయా బాఝు పరీతి కరేయీ ॥
తిచరు జాణై భలా కరి జిచరు లేవై దేయీ ॥ 2 ॥

– వార్ వడ్‌హంస్, పౌడీ 20, సలోక్

126. సూహా రంగు సుపనై నిసి బిను తాగే గలి హారు ॥
సచా రంగు మజీఠ్ కా గురముఖి బ్రహ్మ బీచారు ॥
నానక్ ప్రేమ్ మహా రసీ సభి బురియాయీయా ఛారు ॥ 2 ॥

– వార్ సూహి, పౌడీ 4, సలోక్

## పరమాత్మపై ప్రేమ

123. ఒకవేళ నీకు ప్రేమించాలనే కోరిక అంటూ వుంటే నీ తలను అరచేతిలో పెట్టుకో. మా వీధిలోకి రా. ఈ మార్గంలోకి రావాలనుకుంటే తల ఇవ్వడంలో ఏమి గుంజులాడకు. (1412)

124. ఓ మనసా ! హరిని ప్రేమించు - నీటిని కమలము ప్రేమించినట్లు అలలతో అల్లకల్లోలము అయినప్పటికీ వాటి వాటి స్నేహభావము వికసిస్తూనే వుంటుంది. నీటిలోనే అది పుట్టింది నీరు లేకపోతే అది చచ్చిపోతుంది. ఓ మనసా ! ప్రేమ లేకుండా ముక్తి ఎలా దొరుకుతుంది ? గురుకృప వల్ల ప్రభువు లోపల నెలకొన్నప్పుడు భక్తి భండారం దానం చేస్తాడు. ఓ మనసా ! హరిని ప్రేమించు-చేప నీటిని ప్రేమించినట్లుగా. నీరు ఎంత హెచ్చుగా వుంటే, మనస్సుకంత సుఖం. తనువుకంత శాంతి. నీరు లేక గడియసేపైనా బ్రతుకలేదు. ఆ లోపలి బాధ ప్రభువుకు బాగా తెలుసు.

ఓ మనసా ! హరిని ప్రేమించు-చాతక పక్షి మేఘాన్ని ప్రేమించినంతగా సరోవరం నిండిపోతుంది. మరుభూములు పచ్చగా మారిపోవచ్చు. అయినా దానికి ఒక్క చుక్కయినా దొరకదు. ఎందుకని ? నీ కృప వల్ల లభించిందే దానికి ప్రాప్తి అలాటి లిఖిత రేఖలు మాత్రమే ఫలితాన్ని ఇస్తాయి.

ఓ మనసా ! హరిని ప్రేమించు-నీరు పాలను ప్రేమించినట్లు. పాలు కాగేటప్పుడు నీరు ఇగిరిపోతుంది కాని పాలను పొంగనివ్వదు. ప్రభువు స్వయంగా విడిపోయిన వారిని కలుపుతాడు. సత్య గరిమను అనుగ్రహిస్తాడు.

ఓ మనసా ! హరిని ప్రేమించు-సూర్యుణ్ణి చక్రవాకం ప్రేమించినట్లు. ఒక్క క్షణమయినా దానికి నిద్రరాదు. ప్రియుడు చెంతనే ఉన్నప్పటికీ దూరంగా వున్నాడనుకుంటుంది. మనోముఖుడికి తెలియదు గురుముఖుడు ప్రభువుకు ఎప్పుడూ సన్నిహితుడుగా వుంటాడని. (59-60)

125. నానక్ చెప్పేదేమంటే ప్రేమ రహితమయినవన్నీ అసత్యమైనవే. ప్రభువు చాలా మంచివాడని మనం అనుకుంటూ వుంటాము – ఆయన వల్ల మనకు లాభం కలిగేంతవరకూ. (594)

126. రాత్రి వచ్చిన కల వలె వెలవెలపోయే రంగు. దారంలేని కంఠహారం వంటిది. స్వచ్ఛమైన మాంజిష్ఠం వంటిది. గురువు ద్వారా జరిగే బ్రహ్మవిచారము. నానక్ చెప్పేది ప్రేమ మహారసము దుష్కర్మలను, దుర్గుణములను భస్మీభూతం చేస్తుంది. (786)

127. మోరీ రుణ్‌ఝుణ్ లాయియా భైణే సావణు ఆయియా ॥
తేరే ముంధ్ కటారే జేవడా తిని లోభీ లోభ్ లోభాయియా ॥
తేరే దరసన్ విటహు ఖంనీయై వంఞ్ఞా తేరే నామ్ విటహు కుర్‌బాణో ॥
జా తూ తా మై మాణు కీయాహై తుధు బిను కేహా మేరా మాణో ॥
చూడా భంను పలంఘ్ సివు ముంధే సణు బాహీ సణు బాహా ॥
ఏతే వేస్ కరేదీయే ముంధే సహు రాతో అవరాహా ॥
నా మనీయారు నీ చూడీయా నా సే వంగుడీయాహా ॥
జో సహ కంఠి న లగీయా జలను సి బాహడీయాహా ॥
సభి సహీయా సహు రావణి గయీయా హౌ దాధీ కై దరి జావా ॥
అంమాలీ హౌ ఖరీ సుచజీ తై సహ ఏకి న భావా ॥
మాఠి గుందాయీ పటీయా భరీయై మాగ్ సంధూరే ॥
అగై గయీ న మంనీయా మరవు విసూరి విసూరే ॥
మై రోవందీ సభు జగు రునా రుంనడే వణహు పంఖేరూ ॥
ఇకు న రునా మేరే తన్ కా బిరహా జిని హౌ పిరహు బిఛోడీ ॥
సుపనై ఆయియా భీ గయియా మై జలు భరియా రోయి ॥
ఆయి న సకా తుఝ్ కని పియారే భేజి న సకా కోయి ॥
ఆవు సభాగీ నీ దడియే మతు సహు దేఖా సోయి ॥
తై సాహిబ్ కీ బాత్ జి ఆఖై కహు నానక్ కియా దీజై ॥
సీసు వఢే కరి బైసణు దీజై విణు సిర్ సేవ కరీజై ॥
కివు న మరీజై జీయడా న దీజై జా సహు భయియా విడాణా ॥ 3 ॥
– వడహంస్

128. జాఁ హౌ తేరా తా సభు కిఛు మేరా హౌ నాహీ తూ హోవహి ॥
ఆపే సక్‌తా ఆపే సుర్‌తా సక్‌తీ జగతు పరోవహి ॥
ఆపే భేజే ఆపే సదే రచనా రచి రచి వేఖై ॥
నానక్ సచా సచీ నాయీ సచు పవై ధురి లేఖై ॥ 2 ॥
– వార్ సారంగ్ పౌడీ 13 సలోక్

129. వైదు బులాయియా వైద్‌గీ పకడి ఢండోలే బాఁహ ॥
భోలా వైదున జాణయీ కరక్ కలేజే మాహి ॥ 1 ॥
వార్ మలార్ పౌడీ 13 సలోక్

127. సోదరీ ! శ్రావణం వచ్చింది. ముదితమైన మనస్సుతో నెమలి కుహూ కుహూ అంటోంది. ప్రియ కటాక్షము చురకత్తి. నేను ముగ్ధను. నన్ను కళ్ళతో లోబరుచుకున్నాడు. త్రాటితో కట్టి వేశాడు. నీ దర్శనం కోసం పరితపిస్తున్నాను. నీ నామం కోసం ఖండ ఖండాలై పోతాను. నీవు నా వాడివి. అందుకు కొలబద్ద నేనే. నీవు లేక నాకు గౌరవం ఎక్కడ ? ముద్దరాలా ! మంచానికేసి కొట్టుకొని గాజులు పగలగొట్టుకో. మంచం పట్టె విరిగేటట్లుగా చేతులు కొట్టుకో. ముద్దరాలు ఎంతో సింగారించుకుంది. కాని అన్యకాంతలందు అనురక్తుడు పతి. గాజులు తొడిగేవాళ్ళు లేరు, గాజులు లేవు, వంకీలూ లేవు. పతి కంఠాన్ని పెనవేసుకోలేని చేతులు కాలిపోతే మేలు. పతి ఆస్వాదన హేతువుగా చెలులందరూ వెళ్ళిపోయారు. మండిపోతున్న గుండెతో నేను ఎక్కడికి వెళ్ళను ? నేను అనుకున్నాను చతురనని. అందుకే నేను పతికి ఎంతమాత్రం నచ్చలేదు. కేశ విన్యాసం చేసుకున్నాను. పాపిట్లో సింధూరం అలదుకున్నాను. అయినా మాన్యను కాలేదు. కుమిలి కుంగిపోతున్నాను. నేను రోదించాను. సమస్త జగత్తు రోదించింది. వనంలో పక్షులన్నీ రోదించాయి. నా విరహవేదనను ఎవ్వరూ కనికరించలేదు. నా ప్రియుని నుండి నన్ను విడదీసిన వాడు కలలో వచ్చాడు. వెళ్ళిపోయాడు. కళ్ళల్లో నీళ్ళు నిండాయి. నేను ఏడ్చాను. ప్రియుడా ! నేను నీ వెంటకు రాలేను. ఎవ్వరినీ పంపలేను. నిద్రా సౌభాగ్యం తనంతట తానే రావాలి. అప్పుడే బహుశా నేను ప్రియుణ్ణి చూడగలుగుతాను. స్వామితో మాట్లాడేవారికి నానక్ ! నీవు హరికేమి ఇవ్వగలవు ? ఆసనమిచ్చి శిరస్సు ఖండించి ఇవ్వు. శిరస్సు లేకపోయినా స్వయంగా సేవించు. పతి పరాయి వాడయినప్పుడు ఎందుకు మరణించకూడదు. ఎందుకు ప్రాణమివ్వకూడదు ?

(557-58)

128. నేను నీ వాడినైనప్పుడు అంతా నాదే, నేను లేకపోయినా నీవు ఉంటావు. నీవు సర్వశక్తి శాలివి. నీవు సరజుడివి. నీ శక్తి ఈ జగత్తును నడిపిస్తోంది. నీ అంతట నీవే పిలిపిస్తావు. రచన రచిస్తూ ఉంటావు. దాన్ని చూస్తూ ఉంటావు. నానక్ చెప్పేది సత్యనామం. అదే సత్యం. ఆయన లెక్కల్లో సత్యానికి మాత్రమే విలువ ఉంది. (1242)

129. వైద్యుణ్ణి పిలిచారు రోగమేమిటో కనిపెట్టమని చేయిపట్టుకుని నాడి చూడడం మొదలు పెట్టాడు. వైద్యుడు అమాయకుడు. పిసరంత కూడా తెలియదు. ఉన్న దోషమంతా నా గుండెలో ఉంది. (1279)

130. సోచై సోచి న హోవయీ జే సోచీ లఖ్ వార్
చుపై చుపిన హోవయిప హోవయీ జే లాయి రహా లివ్‌తార్ ॥
భుఖియా భుఖ్ న ఉతరీ జే బంనా పురీయా భార్ ॥
సహస సియాణపా లఖ్ హోహి త ఇక్ న చలై నాలి ॥
కివ సచియారా హోయియాయై కివ కూడై తుటై పాలి ॥
హుకమి రజాయీ చలణా నానక్ లిఖియా నాలి ॥ 1 ॥
హుకమ్ హోవని ఆకార్ హెకము న కహియా జాయి ॥
హుకమీ హోవని జీయ హుకమి మిలై వడియాయీ ॥
హుకమీ ఉతము నీచు హుకమి లిఖి దుఖ్ సుఖ్ పాయీయహి ॥
ఇక్నా హుకమీ బఖసీస్ ఇకి హుకమీ సదా భవాయీయహి ॥
హుకమై అందరి సభు కో బాహరి హుకమ్ న కోయి ॥
నానక్ హుకమై జే బుఝై త హౌమై కహై న కోయి ॥ 2 ॥
- జపు పౌడీ 1, 2

131. హుకమే ఆయియా హుకమి సమాయియా ॥
హుకమే దీసై జగతు ఉపాయియా ॥
హుకమే సురగు మచు పయియాలా హుకమే కలా రహాయిదా ॥ 10 ॥
హుకమే ధరతీ ధవుల్ సిరి భారం ॥
హుకమే పఉణ్ పాణీ గైణారం ॥
హుకమే సివ సకతీ ఘరి వాసా హుకమే ఖేల్ ఖేలాయిదా ॥ 11 ॥
హుకమే ఆడాణే ఆగాసీ ॥
హుకమే జల్ థల్ త్రిభవణ్ వాసీ ॥
హుకమే సాస్ గిరాస్ సదా పుని హుకమే దేఖి దిఖాయిదా ॥ 12 ॥
హుకమి ఉపాయే దస్ అవుతారా ॥
దేవ్ దానవ్ అగణత్ అపారా ॥
మానై హుకము సు దర్‌గహ పైఝై సాచి మిలాయి సమాయిదా ॥ 13 ॥
హుకమే జుగ్ ఛతీహ గుదారే ॥
హుకమే సిధ్ సాధిక్ బీచారే ॥
ఆపి నాథు నాథీ సభ్ జా కీ బఖసే ముకతి కరాయిదా ॥ 14 ॥
- మారూ సొలహే

## ఆదేశం – అనుగ్రహం

130. ఎంత ఆలోచించినా ఆలోచనకు అందడంలేదు. దాన్ని గురించే ఆలోచిస్తాను లక్షసార్లు. మౌనంగా ఉందామనుకుంటాను. మౌనంగా ఉండలేకపోతున్నాను. నిరంతర సమాధి మగ్నుడనైనప్పటికీ, నగరాలు నా పరమయినా, సత్య బుభుక్ష తీరదు. వేలు, లక్షలు ఉన్నాయి, యుక్తులు, అయినా ఒక్కటి వెంటరాదు. సత్యరూపుణ్ణి ఎలా కాగలుగుతాను ? అసత్యపు అడ్డు గోడలు ఎలా తొలగుతాయి ? ఆదేశాన్ని పాటించు. దైవంలో నివసించు. దైవాదేశము వస్తుంది. నానక్ లిఖితానుసారము ఆదేశముననే ఆకారము. ఆదేశము చెప్పజాలరెవ్వరు. ఆదేశమునకే జీవము. ఆదేశముననే గౌరవము ఆదేశముననే ఉత్తములు, నీచులు. ఆదేశముననే కష్టసుఖాలు. ఆదేశముననే ముక్తి. ఆదేశముననే సదాభవయానము. ఆదేశముననే సకలసృష్టి. ఆదేశాధీనులే అందరూ. ఆదేశాతీతులు లేరెవ్వరు.ఆదేశము అర్థమయిన, అహంకారులు కారెవ్వరు. (1)

131. ఆదేశముననే జీవులరాక. ఆదేశములోనే లయం. ఈ సమస్త జగత్తు ఉదయిస్తుంది, ఆదేశమున. ఆదేశముననే స్వర్గ, మర్త్య, పాతాళములు. ఆదేశముననే ఈ నేల నిలబడుతుంది. ఆదేశముననే ధవళము ధరిత్రిని శిరస్సున మోస్తూన్నది. ఆదేశముననే పవనము, పానీయము, ఆకాశము. ఆదేశముననే శివుడు శక్తి గృహంలో మకాము పెట్టినాడు. ఆదేశము వల్లనే ఈ లీల అంతా జరుగుతున్నది. ।ఆదేశముననే ఆకాశము। నిరాధారముగా నిలచి యున్నది. ఆదేశముననే జలచరములు, స్థలచరములు, త్రిభువన జీవులు జీవిస్తున్నాయి. ఆదేశముననే శ్వాసము, గ్రాసము. ఆదేశముననే అన్నింటికి రూపురేఖలు ఏర్పడుతున్నాయి. ఆదేశముననే వెలిశాయి దశావతారాలు. అగణిత అపార దేవదానవ సమూహములు. ఆదేశమును పాటించిన వారే ప్రభు చరణ సన్నిధిని మాన్యులు. సత్య సంగమున సత్యరూపులే అవుతారు. ఆదేశముననే గడచిపోయాయి. ముప్పై ఆరు యుగాలు. ఆదేశముననే సిద్ధులు, సాధకులు విహారము చేస్తారు. తానే స్వయముగా నాథుడు. నాథుడై చేశాడు సకలసృష్టిని. తానే కృపతో స్వయంగా ముక్తిని అనుగ్రహిస్తాడు. (1037)

132. నానక్ బోలణు ఝఖణా దుఖ్ ఛడి మంగీయహి సుఖ్ ॥
సుఖు దుఖ్ దుయి దరి కపడే పహిరహి జాయి మనుఖ్ ॥
జిథై బోలణి హారీయై తిథై చంగీ చుప్ ॥ 2 ॥
– వార్ మాఝ్ పౌడి 24 సలోక్

133. పడి పడి గడీ లదీయహి పడి పడి భరీయహి సాథ్ ॥
పడి పడి బేడీ పాయీఁయై పడి పడి గడీయహి ఖాత్ ॥
పడీయహి జేతే బరస్ బరస్ పడీయహి జేతే మాస్ ॥
పడీయై జేతీ ఆరజా పడీయహి జేతే సాస్ ॥
నానక్ లేఖై ఇక్ గల్ హోరు హౌమై ఝఖణా ఝాఖ్ ॥ 1 ॥
– వార్ ఆసా పౌడి 9

134. ఈవడీ ఆది పురఖు హై దాతా ఆపే సచా సోయీ ॥
ఏనా అఖరా మహి జో గురముఖి బూఝై తిసు సిరి లేఖు న హోయీ ॥ 2 ॥
జంజే జీయాను బూఝై జే కోయీ ॥ పడియా పండితు సోయీ ॥
సరబ్ జీయా మహి ఏకో జాణై తా హౌమై కహై న కోయీ ॥ 4 ॥
– ఆసా పటీ

135. పాధా పడియా ఆఖీయై విదియా విచరై సహజి సుభాయి ॥
విదియా సోధై తతుఁ లహై రామ్ నామ్ లివ్ లాయి ॥
మన్ముఖ్ విదియా బిక్రదా బిఖు ఖటే బిఖు ఖాయి ॥
మూరఖు సబదు న చీనయీ సూఝ్ బూఝ్ నహ కాయి ॥ 53 ॥
పాధా గురముఖి ఆఖీయై చాటడియా మతి దేయి ॥
నాము సమాలహు నాము సంగరహు లాహా జగ్ మహి లేయి ॥
సచీ పటీ సచు మని పడీయై సబదు సు సారు ॥
నానక్ సో పడియా సో పండితు బీనా జిసు రామ్ నాము గలిహారు ॥ 54 ॥ 1 ॥
– రామకలేదఖణీ, ఓంకార్

132. దుఃఖము వీడి సుఖము కోరుకోనటం, మాట పోగొట్టుకోవటం అవుతుంది. సుఖము, దుఃఖము, రెండూ వాని వాకిట లభిస్తాయి. వాటిని ధరించే వచ్చారు మనుష్యులు. మాట్లాడటం వల్ల పరాజయం తప్పనప్పుడు మౌనమే ఉత్తమం. (149)

## పాండిత్యం – సదాచారం

133. పట్టి పట్టి బండి నిండుగా బరువు మోపారు. ఒంటెపై పట్టి పట్టి పట్టె మునుగు దాకా బరువు మోపారు. నావపై పట్టుకుంటూ ఉంటారు. ఏళ్ళ తరబడి నెలనెలా మొత్తం ఆయస్సు ఉచ్ఛ్వాస నిశ్వాసాలన్నింటినీ పఠనంలో గడిపేస్తారు. నానక్ చెప్పేది ఏమంటే లెక్కకు వచ్చేది ఒక్కటే అని. ఇది మినహా మిగతా అంతా అహంకారంలో ఉడిగిపోతుంది. (467)

134. ఆయనే ఆది పురుషుడు. ఆయనే స్వయంగా సత్యము. అందరికీ దాత. ఈ విధంగా గురుబోధను తెలుసుకొన్నవారికి లలాట లిఖితం ఉండదు. ఇలా తెలుసుకొన్నదే జ్ఞానం. తెలుసుకొన్న వాడే పండితుడు. సర్వజీవ జాతులలోనూ ఒక్కరినే చూడగలిగిన వాడే అహంకార ముక్తుడు. (432)

135. సహజ భావమున విద్య నేర్పువాడే విద్వాంసుడు. ఆచార్యుడు. విద్యా పరిశోధన చేస్తుంటాడు. తత్త్వ జ్ఞానం తెలుసుకుంటాడు. రామనామ ధ్యాన మగ్నుడై ఉంటాడు. మనోముఖుడు విద్యను అమ్ముకుంటాడు. విషము భుజించి డబ్బు సంపాదిస్తుంటాడు. వాడు మూర్ఖుడు. ఎప్పుడూ శబ్ద విచారం చేయడు. ఏ సంగతీ తెలుసుకోడు. అట్టివాణ్ణే గురుముఖుడనాలి - శిష్యులకు మతి తెలుపువాడు. నామస్మరణం చెయ్యి. నామాన్ని సంగ్రహించు. అదే జగత్తులో పుట్టినందుకు లాభం. సత్య సారాన్ని నిజమైన మనస్సుతో పఠించు. శబ్దమే సారము. నానక్ చెప్పేదేమంటే వాడే విద్వాంసుడు. వాడే పండితుడు. వాడే ప్రబుద్ధుడు. గళమునందు రామనామ హారమును ధరించినవాడు. (937 - 38)

136. మాహా రుతీ సభ తూ ఘడీ మూరత్ వీచారా ॥
తూ గణతె కినె న పాయియో సచే అలఖ్ అపారా ॥
పడియా మూరఖు ఆఖీయై జిసు లబు లోభ్ అహంకారా ॥
నావు పడీయై నావు బుఝీయై గురమతీ వీచారా ॥
గురమతీ నాము ధను ఖటియా భగతీ భరే భండారా ॥
నిరమలు నాము మం(నీయా దరి సచె సచియారా ॥
జిస్‌దా జీవు పరాణు హై అంతరి జోతి అపారా ॥
సచా సాహు ఇకు తూ హోరు జగతు వణ్‌జారా ॥ 6 ॥

- వార్ మాఝ్, పౌడీ 6

137. ఇకి కంద్ మూలు చుణి ఖాహి వణ్ ఖండి వాసా ॥
ఇకి భగ్‌వా వేసు కరి ఫిరహి జోగీ సంనియాసా ॥
అందరి త్రిస్‌నా బహుతు ఛాదన్ భోజన్ కీ ఆసా ॥
బిర్‌థా జనము గవాయి న గిరహీ న ఉదాసా ॥
జము కలు సిరహు న ఉతరై త్రివిధి మనసా ॥
గురమతీ కాలు న ఆవై నేడై జా హోవై దాస్ నిదాసా ॥
సచా సబదు సచు మని ఘర్ హీ మాహి ఉదాసా ॥
నానక్ సతిగురు సేవని ఆపణా సే ఆసా తే నిరాసా ॥ 5 ॥

- వార్‌మాఝ్ పౌడీ 5

136. మాసములు, ఋతువులు, ఘడియలు, అన్ని మూహూర్తములలో నేను ప్రభువును మననం చేసుకున్నాను. నీవే సత్య స్వరూపుడివి. అమూర్తివి. అపారుడవు. అగణితుడవు. నిన్ను లెక్క కట్టి తెలుసుకోలేము. మోహము, లోభము, అహంకారము ఉన్నవాడు, చదువుకున్నా మూర్ఖుడు. గురుమతి చెప్పేది ఇదే - నామమే పఠించు నామాన్నే తెలుసుకో. గురుమతి ద్వారా నామధనాన్ని సంపాదించుకోవచ్చు. భక్తితో భండారాన్ని నింపు. నామాన్ని అవలంబిస్తే నైర్మల్యం సిద్ధిస్తుంది. సత్యద్వారమున ఉంటారు, సత్య పరాయణులు. అందరూ నీ జీవులే. నీ ప్రాణులే. అందరిలో ఉన్నది నీ జ్యోతి. నీవు ఒక్కడివే నిజమైన సాహుకారువు. ప్రపంచమంతా నీ వాణిజ్యమే. (140)

## అంతః పరివర్తనం అన్నిటికంటె ప్రధానం

137. కొందరు కందమూలాలు భుజిస్తూ ఉంటారు. అరణ్య సీమల్లో నివసిస్తూ ఉంటారు. కొందరు కాషాయ వేషాన్ని ధరిస్తారు. యోగులు, సన్యాసులు నిరంతరం పరిభ్రమిస్తూ ఉంటారు. లోపల అంతులేని తృష్ణ. భోజన భాజనాల మీద ఆశ. జన్మ వృధాగా గడచిపోయింది. గృహస్థుకాడు. విరక్తుడూ కాడు. యముడు కాలుడు. నెత్తినుంచి తొలగడు. మనస్సు త్రిగుణాలలో చిక్కుకుని ఉంది. గురమతి లభిస్తే, ప్రభువుకు దాసానుదాసులయితే కాలుడు దగ్గరకు రాడు. సత్య నిష్ఠమైన మనస్సులో సత్యం నివసించి వుంటే అతనికి ఇంటిలోనే వైరాగ్యం కుదురుతుంది. నానక్ చెప్పేది ఏమంటే తన గురువును సేవించిన వారిని ఆశలు ఆశించవు.(140)

138. జగు పర్‌బోధహి మడీ వధావహి ॥
ఆసణు తియాగి కాహే సచు పావహి ॥
మమతా మోహు కామణి హిత్‌కారీ ॥
నా అవుధూతీ నా సంసారీ ॥ 1 ॥
జోగీ బైసి రహహు దుబిధా దుఖు భాగై ॥
ఘరి ఘరి మాగత్ లాజ్ న లాగై ॥ 1 ॥ రహా ఉ ॥
గావహి గీత్ న చీనహి ఆపు ॥ కివు లాగీ నివరై పర్‌తాపు ॥
గుర్ కై సబది రచై మన్ భాయి ॥
భిఖియా సహజ్ బీచారీ భాయి ॥ 2 ॥
భసమ్ చఢాయి కరహి పాఖండ్ ॥
మాయియా మోహి సహహి జమడండు ॥
ఫూటహి ఖాపరు భీఖ్ న భాయి ॥
బంధని బాధియా ఆవైజాయి ॥ 3 ॥
బిందు న రాఖహి జాతీ కహావహి ॥ మాయియా మాగత్ త్రై లోభావహి ॥
నిర్‌దయియా నహి జోతి ఉజాలా ॥
బూడత్ బూడే సరబ్ జంజాలా ॥ 4 ॥
భేక్ కరహి ఖింథా బహు థటూవా ॥
ఝూఠో ఖేలు ఖేలై బహు నటూవా ॥
అంతరి అగని చింతా బహు జారే ॥
విణు కర్‌మా కైసే ఉతరసి పారే ॥ 5 ॥
ముంద్రా ఫటక్ బనాయీ కాని ॥
ముకతి నహీ బిదియా బిగియాని ॥
జిహ్వా ఇంద్రీ సాది లోభానా ॥
పసూ భయే నహీ మిటై నిసానా ॥ 6 ॥
త్రివిధి లోగా త్రివిధి జోగా ॥
సబదు బీచారై చూకసి సోగా ॥
ఊజల్ సాచు సు సబదు హోయి ॥
జోగీ జుగతి వీచారే సోయి ॥ 7 ॥
తుఝ్ పహి నవునిధి తూ కరణై జోగు ॥
థాపి ఉదాపే కరే సు హోగు ॥
జతు సతు సంజము సచు సు చీతు ॥
నానక్ జోగీ త్రిభవణ్ మీతు ॥ 8 ॥ 2 ॥
– రామకలీ అసటపదీయా

138. మఠాతి పతియై ప్రపంచానికి ఉపదేశాలు ఇస్తూ ఉంటాడు. ఆసనాన్ని త్యజించినప్పుడు శాంతి ఎలా కుదురుతుంది ? మమతా మోహాలతో కామినులను కాంక్షించే వాడు అటు అవధూతా కాదు. ఇటు గృహస్థుకాదు. యోగీ, ఆసనం వేసుకుని కూర్చో. దుఃఖాలు పారిపోతాయి. ఇల్లిల్లూ ముష్టెత్తుకోవడానికి నీకు సిగ్గు లేదా ? గానం చేస్తుంటావు. నిన్ను నీవు తెలుసుకోలేవు. నీ పరితాపం ఎలా తొలగిపోతుంది ? మనస్సులో ప్రేమ నింపుకుని గురూపదేశంలో లీనమైపో. సహజముగానే నీకు వివేక భిక్ష లభిస్తుంది. భస్మం అందుకుంటాడు, పాషండుడు. మాయా మోహములో చిక్కి యమదండం పాలవుతాడు. పగిలిన భిక్షా పాత్రలో ప్రేమ భిక్ష నిలవదు. బంధనలతోనే పుడతాడు పోతాడు. యతినంటాడు కాని వీర్యాన్ని రక్షించుకోలేడు. తల్లీ అంటూ బిచ్చమెత్తుతాడు. ఆమెనే కవ్విస్తాడు. ఓ నిర్దయుడా ! నీ లోపల జ్యోతి లేదు. వెలుగు లేదు. ఆపాదమస్తకమూ ఝుంఝూటంలో మునిగి పోయ్యావు. చిరిగిన బట్టలతో సాధువులా వేషం వేసుకుంటావు. నటుని వలె ఎన్నెన్నో మాయలు చూపుతావు. చింతాగ్ని మనస్సును దహిస్తూ ఉంటుంది. సత్కర్మ లేకుండా ఎలా ఆవలి ఒడ్డు చేరుకోగలవు ? చెవులకు స్ఫటిక, మణి ముద్రాభరణాలు ధరిస్తావు. విద్యా విజ్ఞాన హీనుడికి ముక్తి ఎలా దొరుకుతుంది ? నాలుకనూ, ఇంద్రియాలనూ జయించలేని వాడు వాటి వ్యామోహంలో పడ్డవాడు వట్టి పశువు. మస్తకం నుంచి ఆ కళంకం ఎప్పుడూ తొలగదు. యోగులు, యోగేతరులూ, అందరూ త్రివిధ గుణాలకు వశులైన వారే. శబ్ద విచారమున శోకం తొలుగుతుంది. సుశబ్దమున ఉజ్జ్వలమైన వారికే శుచి లభిస్తుంది. యోగయుక్తులు అలాంటి యోగికే తెలుస్తాయి. నీ వద్ద నవ నిధులున్నాయి. సర్వము చేయగల సమర్థుడివి నీవు. నీవే నిలబెట్టే వాడివి. నీవే తొలగించే వాడివి. నీవేది తలచుకుంటే అదే అవుతుంది. చిత్తంలో సత్యం వుంటే జపము, తపము, సంయమము, అన్నీ సమకూరుతాయి. నానక్ చెప్పేది ఏమంటే యోగి త్రిభువనములకూ మిత్రుడని. (903)

139. ఇకి బన్ మాహి బైసహి డూఁగరి అసథాను ॥
నాము బిసారి పచహి అభిమాను ॥
నామ్ బినా కియా౦ గియాన్ ధియాను ॥
గురముఖి పావహి దరగహి మాను ॥ 3 ॥
హఉ అహంకారు కరై౦ నహీ౦ పావై ॥
పాఠ్ పడై లే లోక్ సుణావై ॥
తీరథి భరమసి బియాధి న జావై ॥
నామ్ బినా కైసే సుఖు పావై ॥ 4 ॥
జతన్ కరై బిందు కివైన రహాయీ ॥
మనూవా డోలై నరకై పాయీ ॥
జమపురి బాధో లహై సజాయీ ॥
బిను నావై జీవు జలి బలి జాయి ॥ 5 ॥
సిధ్ సాధిక్ కేతే ముని దేవా ॥
హఠి నిగ్రహి న తృప్తావహి భేవా ॥
సబదు బీచారి గహహి గుర్ సేవా ॥
మని తని నిర్మల్ అభిమాన్ అభేవా ॥ 6 ॥

కరమి మిలై పావై సచు నావు ॥ తుమ్ సరణాగతి రహావు సుభావు ॥
తుమ్ తే ఉపజియో భగతీ భావు ॥
జపు జాపవు గురముఖ్ హరి నాము ॥ 7 ॥
హౌమై గరబు జాయి మన్ భీనై ॥
ఝూఠి న పావసి పాఖండి కీనై ॥
బిను గుర్ సబద్ న నహీ౦ ఘర్‌బారు ॥
నానక్ గురముఖి తతు బీచారు ॥ 8 ॥ 6 ॥
– రామకలీ అసటపదీయా

139. నామాన్ని విస్మరించిన వాడు అరణ్యంలో ఉంటేనేం ? పర్వత శిఖరాల్లో ఉంటేనేం ? అభిమానంలో మండిపోతూ ఉంటాడు. నామము లేక జ్ఞానమెలా లభిస్తుంది ? ధ్యానమెలా కుదురుతుంది ? గురుముఖునకు ప్రభుచరణ సన్నిధిని సన్మానము లభిస్తుంది. హఠము వలన, అహంకారము వలన ప్రభువు లభించడు. గ్రంథము చక్కగా చదివినా చదివి అందరికీ వినిపించినా ప్రయోజనం లేదు. తీర్థాటనము వలన వ్యాధి తొలగదు. నామము లేక సుఖము లేదు. యత్నమున వీర్యము ఎలా నిలుస్తుంది ? చంచలమతి నరకానికి పోతాడు. యమపురమున వానికి నిశ్చయముగా దండనము తప్పదు. నామము లేక జీవుడు దహించుకుపోతాడు. ఎందరో సిద్ధులు, సాధకులు, మునులు, దేవతలు హఠ నిగ్రహమున తృప్తి పొందలేక పోయారు. శబ్ద విచారంతో గురుసేవలో మగ్నులైన వారి మనఃకాయాలు నిర్మలం అవుతాయి. అహంకారం తొలగిపోతుంది. కృపాపాత్రులైన వారికే సత్యనామము లభిస్తుంది. వారే ప్రేమ సహితులై శరణాగతులవుతారు. నీ వల్లనే భక్తి భావం ఉదయిస్తుంది. గురువు ద్వారా హరినామ జపం చేయగలుగుతారు. మనస్సు నామంలో మగ్నం చెయ్యి. అప్పుడే అహంకారం నశిస్తుంది. అహంకారం, అసత్యం, పాషండత వల్ల ఏమీ లభించదు. గురూపదేశం లేక తన గమ్యం చేరుకోలేదు. నానక్ చెప్పే గురుముఖుని విచార సారము ఇదే.

(905 - 6)

140. హిందూ కె ఘరి హిందూ ఆవె ॥
సూతు జనేవూ పడి గలి పావై ॥
సూతు పాయి కరే బురియాయీ ॥
నాతా ధోతా థాయి న పాయీ ॥
ముసలమాను కరే వడియాయీ ॥
విణు గుర్ పీరై కో థాయి న పాయీ ॥
రాహు దసాయి ఓథై కో జాయి ॥
కరణీ బాఝహు భిసతి న పాయి ॥
జోగీ కె ఘరి జాగతి దసాయీ ॥
తిత్ కారణి కని ముంద్రా పాయీ ॥
ముంద్రా పాయి ఫిరై సంసారి ॥
జిథై కిథై సిర్జణ్‌హారు ॥
జేతే జీయ తేతే వాటావూ ॥ చీరీ ఆయీ ఢిల్ న కావూ ॥
ఏథై జాణై సు జాయి సిఞ్ఞాణై ॥
హోరు ఫకడు హిందూ ముసలమాణై ॥
సభనా కా దరి లేఖా హోయి ॥
కరణీ బాఝహు తరై న కోయి ॥
సచో సచు వఖాణై కోయి ॥
నానక్ అగై పుఛ్ న హోయి ॥ 2 ॥ - వార్ రామకలీ పౌడీ ॥ సలోక్

141. కుబుధి డూమణీ కుదయియా కసాయిణి పర్ నిందా
ఘట్ చూహడీ ముఠీ క్రోధి చండాలి ॥
కారీ కఢీ కియా థీయై జాం చారే బైఠీయా నాలి ॥
సచు సంజము కరణీ కారాం నావణు నావు జపేహీ ॥
నానక్ అగై ఉత్తమ్ సేయీ జి పాపాం పంది న దేహీ ॥
- వార్ సిరీ రాగు పౌడీ 20 సలోక్

142. సూచే ఏహి న ఆఖీయహి బహిన్ జి పిండా ధోయి ॥
సూచే సేయీ నానకా జిన్ మని వసియా సోయి ॥ 2 ॥
- వార్ ఆసా పౌడీ 17

143. జే రతు లగై కపడై జామా హోయి పలీతు ॥
జో రతు పీవహి మాణసా తిన్ కివు నిర్మలు చీతు ॥
నానక్ నావు ఖుదాయి కా దిలి హఛై ముఖి లేహు ॥
అవరి దివాజే దునీ కే ఝూఠే అమల కరేహు ॥ 1 ॥
- వార్ మలార్ పౌడీ 24 సలోక్

140. హిందువుల ఇంటికి హిందువులు వెళ్ళినప్పుడు మంత్రాలు చదివి మెళ్ళో జందెం వేస్తారు. జందెం ధరించి కూడా దుష్కర్మలు చేస్తుంటారు. స్నానాదికాల వల్ల కొంచెం కూడా ప్రయోజనం లేదు. ముసల్మాను తన మతాన్ని పొగడుతూ వుంటాడు. గురుకటాక్షం లేకుండా ఏ స్థానమూ లభించదు. అయితే ఆయన చూపిన మార్గంలో ఎవరు నడుస్తున్నారు ? ఆచరణ లేకుండా స్వర్గానికి ఎలా పోగలరు ? యోగుల సంఘంలో చేరితే యోగయుక్తులు నేర్పుతారు. అందుకోసమే చెవులకు పోగులు తగిలిస్తారు. ఆ పోగులు ధరించి దేశాటనం చేస్తారు. అక్కడా, ఇక్కడా, అనేమిటి! ప్రతిచోటా వ్యాపించి ఉంటాడు కర్త. జీవులందరూ బాటసారులే. మృత్యువు నుండి పిలుపు వస్తే ఆగేందుకు వీలు లేదు. ఇహలోకంలో ప్రభువును తెలుసుకున్న వారు పరలోకంలో కూడా గుర్తించగలుగుతారు. అక్కడ హిందువు, ముస్లిమ్ అనే భేదం లేదు. వాని ద్వారం చెంత అందరి వివరాలూ ఉంటాయి. ఆచరణ (సుకృతం) లేకుండా ఎవరికీ ముక్తి లభించదు. కేవలం సత్యం, శుద్ధసత్యం కొందరు మాత్రమే అరుదుగా చెబుతూంటారు. నానక్ చెప్పేది అలాంటి సత్యభాషికి పరలోకంలో పరీక్ష ఉండదు, అని. (951 - 52)

141. దుర్బుద్ధి అనే డొమ్మరిది, నిర్దాక్షిణ్యమనే కసాయిది, పరనింద అనే పాకీది, క్రోధిని అనే చండాలిని కలిసి ఆత్మను వంచించారు. ఈ నలుగురూ నీతో చెట్టపట్టాలు వేసుకుని ఉన్నప్పుడు, శుద్ధరేఖలు గీసుకున్నంత మాత్రాన ఏమవుతుంది ? సత్యమే సంయమము. ఆచరణమే రేఖలు. నామస్మరణమే స్నానము. నానక్ చెప్పేది ఏమంటే ఇతరులను పాప పంకిలం లోనికి పడదోయకు. అప్పుడే పరలోకంలో ఉత్తముడవుగా పరిగణించబడతావు. (91)

142. శరీరాన్ని శుద్ధి చేసుకుని కూర్చున్న వారు స్వచ్ఛమైన వారు కారు. ఎవరి మనసులో ప్రభువు నివసిస్తూ వుంటాడో, వారే నిజంగా స్వచ్ఛమైన వారని అంటున్నాడు నానక్. (472)

143. మామూలు రక్తపు మరకలు అంటితే దుస్తులు మురికి పడిపోతాయి. మరి మానవ రక్తం తాగే వారి చిత్తం ఎలా నిర్మలంగా ఉంటుంది ? హృదయం స్వచ్ఛంగా ఉన్నప్పుడే భగవంతుని స్మరించు, అని అంటున్నాడు నానక్. లేకుంటే అది ఆడంబరం, మిథ్యాచరణ అవుతుంది. (140)

144. మను మైగులు సాకతు దేవానా ॥
బనఖండి మాయియా మోహి హైరానా ॥
ఇత ఉత జాహి కాల్ కే చాపే ॥
గురముఖి ఖోజి లహై ఘరు ఆపే ॥ 1 ॥
బిను గుర్ సబదె మను నహీం ఠౌరా ॥
సిమరహు రామ్ నాము అతి నిరమలు
అవర్ తియాగహు హౌమై కౌరా ॥ 1 ॥ రహా ఉ ॥
ఇహు మను ముగధు కహహు కివు రహసీ ॥
బిను సమ్ఝే జమ కా దుఖు సహసీ ॥
ఆపే బఖసే సతిగురు మేలె
కాలు కంటకు మారే సచు పేలె ॥ 2 ॥
ఇహు మను కర్మా ఇహు మను ధర్మా ॥
ఇహు మను పంచ్ తతు తే జన్మా ॥
సాకతు లోభీ ఇహు మను మూడా ॥
గురముఖి నాము జపై మను రూడా ॥ 3 ॥
గురముఖి మను అసథానే సోయీ ॥
గురముఖి త్రిభవణి సోఝీ హోయీ ॥
ఇహు మను జోగీ భోగీ తపు తాపై ॥
గురముఖి చీన్హై హరి ప్రభు ఆపై ॥ 4 ॥
మను బైరాగీ హౌమై తియాగీ ॥
ఘటి ఘటి మనసా దుబిధా లాగీ ॥
రామ్ రసాయిణు గురముఖి చాఖై ॥
దరి ఘరి మహలీ హరి పతి రాఖై ॥ 5 ॥
ఇహు మను రాజా సూర్ సంగ్రామి ॥
ఇహు మసు నిర్భవు గురముఖి నామి ॥
మారే పంచ్ అపునే వసికీయే ॥
హౌమై గ్రాసి ఇకతు థాయి కీయే ॥ 6 ॥
గురముఖి రాగ్ సువాద్ అన్ తియాగే ॥
గురముఖి ఇహు మను భగతీ జాగే ॥
అనహద్ సుణి మానియా సబదు వీచారీ ॥
ఆతము చీన్హి భయే నిరంకారీ ॥ 7 ॥

## మనస్సును జయిస్తే ప్రపంచాన్ని జయించినట్టే

144. మానవుని మనస్సు మదపుటేనుగు లాంటిది. సశక్తమయింది. మాయా మోహారణ్యాలలో చిరాకుగా తిరుగుతూ ఉంటుంది. కాలప్రభావం వల్ల అటూ ఇటూ సంచరిస్తూ ఉంటుంది. గురుముఖుడు స్వయంగా తన ఇంటిని వెతుక్కుంటాడు. గురూపదేశం లేక మనస్సుకు నిలకడ ఉండదు. అతి నిర్మలమైన రామనమాన్ని స్మరించు. దానికి భిన్నమైనదంతా కలుషితమైన అహంకారం. దాన్ని త్యజించు. ఈ మనస్సు ముగ్ధవంటిది. ఇది ఎలా నిలకడగా ఉంటుంది? జ్ఞానహీనుడికి మరణయాతన తప్పదు. ప్రభువు కృపవల్లనే సద్గురు సమాగమం కలుగుతుంది. అప్పుడు సత్య ప్రేరితుడై కాలకంటకాన్ని నాశనం చేస్తాడు. ఈ మనస్సే కర్మాన్నీ, ధర్మాన్నీ నడిపేది. ఈ మనస్సు పాంచభౌతికమైనది. ఈ మనస్సు శక్తిమంతమైనది. లోభం, మౌఢ్యం దీని గుణాలు. నామాన్ని జపించినప్పుడే మనస్సు రమణీయమవుతుంది. గురుముఖుని మనస్సు తన స్థానాన్ని తప్పక పొందుతుంది. గురుకృప వల్లనే త్రిభువన జ్ఞానం కలుగుతుంది. ఈ మనస్సు యోగి, భోగి, తపస్వి, గురువు ద్వారా ఇది ప్రభువును గురించీ, తనను గురించీ తెలుసుకో గలుగుతుంది. మనస్సులో విరక్తి ఏర్పడితే అహంకారం తొలగిపోతుంది. ఘట ఘటమున మనస్సు విచార మగ్నమై ఉంటుంది. గురుముఖుడు రామరసాయనాన్ని ఆస్వాదిస్తూ ఉంటాడు. ఇహలోకంలో, పరలోకంలో, వారి వాణ్ణి కాపాడుతూ ఉంటాడు. ఈ మనస్సు రాజు. సమర శూరుడు. నామము ద్వారానే మనస్సు నిర్భయమవుతుంది. గురుముఖమవుతుంది. పంచేంద్రియాలను జయించి తన వశంలో ఉంచుకుంటుంది. ఒకే కబళంలో అహాన్ని దిగమింగి అయిదింటిని రూపుమాపి ఏకం చేస్తుంది. గురుముఖుడు అన్యరతి ప్రమోదాలను త్యజిస్తాడు. గురుముఖుని మనస్సు భక్తిలో జాగరిత మవుతుంది. అనాహత శ్రవణం చేస్తూంటాడు. మననముతో, చింతనతో ఆత్మను అదుపులో పెట్టి స్వయంగా నిరంకారుడే అవుతాడు. ఆ నిర్మలమైన మనస్సులో అటూ, ఇటూ, ప్రతిచోటా వాణ్ణి ఒక్కణ్ణే దర్శిస్తూ ఉంటాడు. గురుముఖుని ధ్యానము భక్తి భావముతో నిండి ఉంటుంది. గురుకృప వలన అహర్నిశలు హరి యశోగానంలో లీనమై ఉంటాడు. హరి ఆది-యుగాది నుంచి అందరిలోనూ వ్యాపించి ఉన్నాడు. రామరసాయనంతో ఈ మనస్సు పూర్తిగా నిండిపోయింది. గురు కృప వలన సర్వ రసాయనాల సంగతీ తెలుసుకుంది. భక్తి కోసం గురుచరణ సన్నిధిని పడి ఉంటోంది. అట్టివాడే హరిజనుల దాసానుదాసుడని నానక్ చెబుతున్నాడు. (415 - 16)

ఇహు మను నిర్మలు దరి ఘరి సోయీ ॥
గురముఖి భగత్ భావు ధుని హెూయీ ॥
అహినిసి హరి జసు గుర్పర్సాది ॥
ఘటి ఘటి ప్రభు ఆడ జుగాది ॥ 8 ॥
రామ్ రసాయిణి ఇహు మను మాతా ॥
సరబ్ రసాయిణు గురముఖి జాతా ॥
భగతి హేతు గుర్ చరణ నివాసా ॥
నానక్ హరి జన్ కే దాసని దాసా ॥ 9 ॥ 8 ॥

– ఆసా అసటపదీయా

145. తరవరు కాయియా పంఖి మను తరవరి పంఖీ పంచ్ ॥
తతు చుగహి మిలి ఏక్ సే తిన్ కౌ ఫాస్ న రంచ్ ॥
ఉడహి త బేగులే తాకహి చోగ్ ఘణీ ॥
పంఖ్ తుటే ఫాహి పడీ అవగుణి భీడ్ బణీ ॥
బిను సాచే కివు ఛూటీయై హరి గుణ్ కరమి మణీ ॥
ఆపి ఛడాయే ఛూటీయై వడా ఆపి ధణీ ॥
గుర్పరసాదీ ఛూటీయై కిర్పా ఆపి కరేయి ॥
అపణై హథి వడాయీయా జై భావై తై దేహి ॥ 33 ॥

– రామకలీ దఖణీ, ఓంకార్

146. భూలీ భూలీ మైఁ ఫిరీ పాధరూ కహై న కోయీ ॥
పూఛహు జాయి సియాణియా దుఖు కాటై మేరా కోయీ ॥
సతిగురు సాచా మని వసై సాజను ఉత హీ ఠాయి ॥
నానక్ మను తృపతాసీయై సిఫతీ సాచే నాయి ॥ ౧ ॥

– వార్ మారూ పౌడీ 3, సలోక్

147. హుకమి రజాయీ సాఖతీ దరగహ సచు కబూలు ॥
సాహిబు లేఖా మంగసీ దునీయా దేఖి న భూలు ॥
దిల్ దర్వానీ జో కరే దర్వేసీ దిలు రాసి ॥
ఇసక్ ముహబతి నానకా లేఖా కర్తే పాసి ॥ 1 ॥
అలగవు జోయి మధూకడవు సారంగపాణి సబాయి ॥
హీరే హీరా బేధియా నానక్ కంఠి సమాయి ॥ 2 ॥

– వార్ మారూ పౌడీ 12 సలోక్

145. శరీరము తరువు మనస్సు పక్షి. తరువు పై ఇతర పక్షులు అనేకం వాలాయి. అవి అన్నీ కలిసి తత్త్వమనే గింజలను ఏరుకున్నప్పుడే వలలో చిక్కుకోవు. అవి ఆహారాన్ని అన్వేషిస్తూ వేగంగా అటూ ఇటూ ఎగిరితే రెక్కలు విరిగి పోతాయి. వలలో చిక్కుకు పోతాయి. అవగుణాలు చిక్కుల్లో ఇరికిస్తాయి. సత్యము లేక ముక్తి ఎలా లభిస్తుంది ? హరి గుణగానమే సర్వోత్తమ కర్మ. ఆయన స్వామి శిరోమణి. ఆయన ముక్తిని అనుగ్రహించినప్పుడే ముక్తి లభిస్తుంది. గురుకృప వల్లనే ముక్తి లభిస్తుంది. ఆయన స్వయంగా అనుగ్రహిస్తాడు. అన్ని వరదనాలు ఆయన చేతిలోనివే. తాను ప్రసన్నుడైన వారికే వరప్రదానం చేస్తాడు. (934)

146. నేను దారితప్పి తిరుగుతూ ఉంటే ఎవరూ సరైన దారి చూపించలేదు. నా దుఃఖము ఎలా తొలగుతుందని కుశలురైన బుద్ధిమంతులందరినీ అడుగుతూనే ఉన్నాను. సద్గురువు సత్యమైన మనస్సులో నెలకొని ఉంటాడు. అక్కడే ఉంటారు సహచరులు. సత్య నామ గుణగానం వల్లనే మనస్సుకు తృప్తి లభిస్తుందని నానక్ చెబుతున్నాడు. (1087)

147. ప్రభువు ఆదేశం వల్లనే ఈ సృష్టి అంతా జరుగుతోంది. ప్రభు చరణ సన్నిధిని, సత్యమునకే మాన్యత లభిస్తుంది. స్వామి లెక్క అడుగుతాడు. ప్రపంచాన్ని చూచి ఆయనను విస్మరించకు. హృదయాన్ని కాపాడుతూ, దానిని సన్మార్గానుగామిని చెయ్యగలిగిన వాడే నిజమైన ద్వారపాలకుడు. ప్రేమ, ప్రీతి, వీటి పద్దులన్నీ సృష్టికర్త వద్ద ఉన్నాయి, అని నానక్ చెబుతున్నాడు. (1090)

148. భోలతణి భై మని వసై హేకై పాధర్ హీడు ||
అతి డాహపణి దుఖు ఘణో తీనే థావ్ భరీడు || 1 ||
- వార్ మారూ పౌడీ 14 సలోక్

149. అజరు జరైత నౌ కుల్ బంధు ||
పూజై ప్రాణ్ హోవై థిరు కంధు ||
కహాఁ తే ఆయియా కహాఁ ఏహు జాణు ||
జీవత్ మరత్ రహై పరవాణు ||
హుకమై బూఝై తతు పఛాణై ||
ఇహు పరసాదు గురు తే జాణై ||
హోందో ఫడీయగు నానక్ జాణు ||
నా హౌ నా మైఁ జూనీ పాణు || 2 ||
- వార్ మలార్ పౌడీ 24 సలోక్

148. ఒక్కటే మార్గముంది. మనసు నిండా భయాన్ని అమాయికత్వాన్ని నింపుకో. **మితి మీరిన** ఈర్ష్యవల్ల సఘనమైన దుఃఖం కలుగుతుంది. మనస్సు, వాక్కు, కర్మ ఈ మూడూ కూడా భ్రష్టమై పోతాయి. (1090 - 91)

149. అసహ్యమైన దానిని సహించు, నవ నిధియే బంధువర్గం, ప్రాణి ప్రభువును పూజించినప్పుడే తనువు నిలబడుతుంది. ఎక్కడి నుంచి వచ్చింది ? ఎక్కడికి పోతుంది ? ఎందుకు చింత ? జీవనంలో, మరణంలో అతడే సదా మాన్యుడు. ఆదేశాన్ని అర్థం చేసుకున్నా, తత్త్వాన్ని గుర్తించినా, అది గురుప్రసాదం వల్లనే. "అహమస్మి" (నేనున్నాను) అనుకొనే వాడు ఎప్పుడూ దొరికిపోతాడు. "నేను లేను", "నేను కాను", అని అనుకునే వాడెప్పుడూ జనన-మరణ చక్రంలో చిక్కుకోడు, అని నానక్ చెబుతున్నాడు. (1289)

150. జా హౌ నాహి తాకియా ఆఖా కిహు నాహి కియా హెూవా ॥
కీతా కరణా కహియా కథనా భరియా భరి భరి ధోవాఁ ॥
ఆపి న బుఝూ లోగ్ బుఝాయీ ఐసా అగూ హెూవాఁ ॥
నానక్ అంధా హెూయి కే దసే రాహై సభసు ముహాయే సాథై ॥
అగై గయియా ముహే ముహి పాహి సు ఐసా అగూ జాపె ॥ 2 ॥
- వార్ మాఝ్ పౌడీ 6 సలోక్

151. అంధా అగూ జే థీయై కివు పాధరు జాణై ॥
ఆపి ముసైఁ మతి హెూఛీయై కివు రాహు పఛాణై ॥
కివు రాహి జావై మహలు పావై అంధ్ కీ మతి అంధలీ ॥
విణు నామ్ హరి కే కుఛ్ న సూఝై అంధు బూడౌ ధంధలీ ॥
దిను రాతి చానణు చావు ఉపజై సబదు గుర్ కా మని బసై ॥
కరి జోడి గుర్ పహి కరి వినంతీ రాహు పాధరు గురు దసై ॥ 6 ॥
- సూహి ఛంత్

152. హిందూ మూలే భూలే అఖుటీ జాహి ॥
నారది కహియా సి పూజ కరాఁ హి ॥
అంధే గుంగే అంధ్ అంధారు ॥
పాధరు లే పూజహి ముగధ్ గవార్ ॥
ఓహి జా ఆపి డుబే తుమ్ కహా తరణహారు ॥ 2 ॥
- వార్ విహాగడా పౌడీ 20 సలోక్

153. ఘరి నారాయణు సభా నాలి ॥
పూజ కరే రఖై నావాలి ॥
కుంగూ చఁ నణు ఫుల్ చడాయే ॥
పైరీ పై పై బహుతు మనాయే ॥
మాణూవా మంగి మంగి పైనై ఖాయి ॥
అంధీ కంమీ అంధ్ సజాయి ॥
భుఖియా దేహి న మరదియా రఖై ॥
అంధా ఝగడా అంధీ సథై ॥ 1 ॥
- వార్ సారంగ్ పౌడీ 9, సలోక్

## అయోగ్య నాయకుడు

150. నేనే లేనప్పుడు నేను చెప్పేదేమిటి ? నేను ఏమీ కానప్పుడు నేను ఏమి అవుతాను ? నన్ను ఇలా తయారు చేసింది నా కర్మే. అది ఏది పలికిస్తే అదే నా పలుకు. మలంతో నిండి పోయి ఉన్నాను. పదే పదే కడుక్కుంటున్నాను. స్వయంగా నాకేమీ రాదు. కాని లోకులకు మాత్రం జ్ఞానభిక్ష పెడుతుంటాను. నా నాయకత్వం అలాంటిది. గుడ్డివాడి మార్గదర్శకత్వంలో నడిచే వాళ్ళంతా మునిగిపోతారు. పరలోకంలో వాడు అమితంగా దెబ్బలు తింటాడు. అలాంటి నాయకునికి అలాంటి దశే పడుతుంది (140)

151. దారి చూపేవాడు గుడ్డివాడయితే వాడికి దోవ ఏమి తెలుస్తుంది ? మతిలేని వాడు స్వయంగా మోసపోతాడు. అలాంటప్పుడు సరియైన దోవ ఏదో ఎలా తెలుసుకుంటాడు ? ఎలా వెళతాడు ? ఇంటిని, గమ్యాన్ని ఎలా చేరుకుంటాడు ? గుడ్డివాడి మతి గుడ్డిది. హరినామము లేక ఏమీ తెలియదు. అంధుడు వ్యవహారంలో కూరుకుపోతాడు. గురూపదేశం మనస్సుకు పట్టినప్పుడు అహర్నిశలు జ్ఞానప్రకాశం కలుగుతుంది. చేతులు జోడించి గురువును ప్రార్థించు. గురువే నీకు దారి చూపుతాడు. (767)

## విగ్రహారాధన

152. హిందువు మరచిపోయాడు. మరచిపోయి తప్పు దోవలో పోతున్నాడు. నారదుడెలా చెప్పాడో సరిగ్గా అలాగే పూజ చేస్తుంటాడు. మూర్ఖులు, అజ్ఞానులు, పాషాణాన్ని పూజిస్తుంటారు. బధిరులూ, అంధులూ, స్వయంగా అంధకారంలో ఉంటారు. వాళ్ళు స్వయంగా మునిగిపోతారు. అలాంటి వారు నీకు తారకులు ఎలా అవుతారు ? (556)

153. ఇంటిలో నారాయణుడు నెలకొని ఉంటాడు. ఇరుగుపొరుగువారు అందరూ సభాసదులు పూజ చేస్తారు. స్నానం చేయించి విగ్రహాలను ప్రతిష్ఠిస్తారు. కుంకుమా, చందనము, పువ్వులూ సమర్పిస్తారు. పాదాభివందనం చేసి ప్రసన్నున్ని చేసుకుంటారు. కాని మానవుని దగ్గర నుంచి భిక్ష స్వీకరించి భుజిస్తారు. గుడ్డి కర్మ, గుడ్డి శిక్ష. రః విగ్రహాలూ, రః దండలూ ఆ కొన్నవారికి అన్నం పెట్టజాలవు. వచ్చిన వాళ్ళను రక్షించను కూడా లేవు. గుడ్డివాళ్ళ సభలో గుడ్డి కలహాలే జరుగుతూంటాయి. (1240)

154. జే మోహాకా ఘరు ముహై ఘరు ముహి పితరీ దేయి ॥
అగె బసతు సిఞ్జాణీయె పితరీ చోర్ చరేయి ॥
వఢీయహి హథ్ దలాల్ కే ముసఫీ ఏహ కరేయి ॥
నానక్ అగే సో మిలై జి ఖటే ఘాలే దేయి ॥ 1 ॥
- వార్ ఆసా పౌడీ 11, సలోక్

155. దీవా మేరా ఏకు నామ్ దుఖు విచి పాయియా తేలు ॥
ఉని చాననీ ఓహు సోఖియా చూకా జమ్ సివు మేలు ॥ 1 ॥
లోకా మత్ కో ఫకడి పాయి ॥
లఖ్ మడియా కరి ఏకఠే ఏక్ రతీ లే భాహి ॥ 1 ॥ రహా ఉ ॥
పిండు పతలి మేరీ కేసవు కిరియా సచు నాము కర్తారు ॥
ఐథై ఓథై అగై పాఛై ఏహు మేరా ఆధారు ॥ 2 ॥
గంగ్ బనారసి సిఫతి తుమారీ నావై ఆతమ్ రావు ॥
సచా నావణు తాం థీయై జాం అహినిసి లాగె భావు ॥ 3 ॥
ఇక లోకీ హోరు ఛమిఛరీ బ్రాహ్మణు వటి పిండు ఖాయి ॥
నానక్ పిండు బఖసీస్ కా కబహుం నిఖూటసి నాహి ॥ 4 ॥ 12 ॥ 32 ॥
- ఆసా

156. జే కరి సూతకు మంనీయై సభ తై సూతకు హోయి ॥
గోహే అతె లకడీ అందరి కీడా హోయి ॥
జేతే దాణే అం నే కే జీయా బాఝు న కోయి ॥
పహలా పాణీ జీవు హై జితు హరియా సభు కోయి ॥
సూతకు కివు కరి రఖీయై సూతకు పవై రసోయి ॥
నానక్ సూతకు ఏవ న ఉతరై గియాను ఉతారె ధోయి ॥ 1 ॥
మన్ కా సూతకు లోభు హై జిహవా సూతకు కూడు ॥
అఖీ సూతకు వేఖణా పర త్రియ పరధన రూపు ॥
కం నీ సూతకు కం ని పై లాయిత్‌బారీ ఖాహి ॥
నానక్ హంసా ఆదమీ బధే జమపురి జాహి ॥ 2 ॥
సభో సూతకు భరము హై దూజై లగై జాయి ॥
జంమణు మరణా హుకము హై భాణై ఆవై జాయి ॥
ఖాణా పీణా పవిత్రు హై దితోను రిజకు సంబాహి ॥
నానక్ జినీ గురముఖి బుఝియా తిన్హా సూతకు నాహి ॥ 3 ॥
- వార్ ఆసా పౌడీ 18 సలోక్

154. ఎవడో ఒక దొంగ ఎవరో ఒకరి ఇంటిని దోచుకుంటాడు. దొంగ సొమ్మును పితృదేవతల నిమిత్తం వినియోగిస్తాడు. పరలోకంలో ఏ వస్తువు ఎలాంటిదో గుర్తు పడతారు. పితరులు దొంగలవుతారు. దళారీ చెయ్యిని ఖండిస్తారు. అక్కడ జరిగే న్యాయం ఇదే. నానక్ చెప్పేదేమంటే కష్టపడి సంపాదించుకున్న దానిని దానం చేసుకున్న వారికే పరలోకం లభిస్తుంది అని. (472)

155. దీపం నా పేరులలో ఒకటి. అందులో దుఃఖం అనే తైలాన్ని పోశాను. దీపం ప్రకాశాన్ని ఇచ్చింది. నూనె అంతా అయిపోయింది. యమునితో సమావేశం తప్పిపోయింది. లోకులారా ! కూట నీతిని అనుసరించకండి. లక్షల కొలది కట్టెలను ఒక చోట చేరిస్తే ఒక్క చిన్న నిప్పురవ్వ వాటిని క్షణంలో దహించి వేస్తుంది. పాత్ర - పిడం, అన్నీ కేశవుడే. సత్యనాముడే క్రియలకూ, కర్మలకూ కర్త. ఇక్కడా, అక్కడా, ముందూ, వెనకా ఆయనే నాకు ఆధారము. నీ సంస్తవమే నాకు గంగ, వారణాసి అన్నీని. అందులోనే నా ఆత్మ స్నానం చేస్తుంది. అహర్నిశలు నీ ప్రేమలో లీనమైనప్పుడే నిజమైన స్నానం అనిపించుకుంటుంది. పిండాలు కొన్ని దేవతల నిమిత్తం, కొన్ని పితరుల నిమిత్తం వేస్తుంటారు. కాని బ్రాహ్మణుడే వాటిని తయారు చేసి ఆరగిస్తూంటాడు. నానక్ చెప్పేది ఏమంటే పిండం స్వామి అనుగ్రహం వల్ల లభించే అఖండ వరదానం. (358)

156. నమ్మితే అదే సూతకం. సూతకం అంతటా ఉంటుంది. పిడకలలోనూ, కట్టెలలోనూ కూడా కీటకాలు ఉంటాయి. ఆహార ధాన్యాలన్నింటిలోనూ జీవరహితమైనదేదీ లేదు. నీరు స్వయంగా జీవనం. దాని వల్లనే పచ్చదనం. సూతకం వంటింట్లో ఉంది. సూతకం ఎలా పోతుంది ? నానక్ చెప్పేది ఏమంటే ఈ విధంగా సూతకం పోదు. జ్ఞానం వల్లనే క్షాళితమవుతుంది. జ్ఞానం వల్లనే తొలగిపోతుంది. మనస్సుకు పట్టిన సూతకం లోభం. నాలుకకు సూతకం అనృతం. కళ్ళకు పట్టిన సూతకం పరజనులను, పరధనాన్ని పరుల రూపాన్ని చూడడం. చెవులలో సూతకం నిందా, చాడీలు, వినడమూను. నానక్ చెప్పేదేమంటే అలాంటి మనుషులను బంధించి యమపురికి ఈడ్చుకుపోతారు. సూతకాన్ని గురించిన చర్చ అంతా భ్రమ. మనం ద్వైతం వైపు మొగ్గుతూ ఉంటాము. జనన మరణాలు ఆదేశాధీనాలు. ప్రభువు ఇచ్ఛానుసారమే జీవుడు వస్తూ పోతూ వుంటాడు. భోజన భాజనాలు పవిత్రమైనవి. ఆయన అనుగ్రహించినవే. నానక్ చెప్పేదేమంటే గురూపదేశం వలన జ్ఞానం లభించిన వారికి సూతకం ఉండదు. (472-73)

157. నావణ్ చలే తీరథీ మని ఖోటై తని చోర్ ॥
ఇకు భావు లథీ నాతియా దుయి భా చడీయసు హోర్ ॥
బాహరి ధోతీ తూమడీ అందరి విసు నికోర్ ॥
సాధ్ భలే అణనాతియా చోర్ సి చోరా చోర్ ॥ 2 ॥
- వార్ సూహీ పౌడీ 12, సలోక్

158. సుయినే కా చవుకా కంచన్ కువార్ ॥
రుపే కీయా కారా బహుతు బిసథారు ॥
గంగా కా ఉదక్ కరంతే కీ అగి ॥
గరుడా ఖాణా దుధ్ సివు గాడి ॥ 1 ॥
రే మన్ లేఖై కబహు న పాయి ॥
జామి న భీజై సాచ్ నాయి ॥ 1 ॥ రహా ఉ ॥
దస్ అఠ్ లీఖే హోబహి పాసి ॥
చారే వేద్ ముఖాగర్ పాఠి ॥
పురబీ నావై వరనాం కో దాతి ॥
వరత నేమ్ కరే దిన్ రాతి ॥ 2 ॥
కాజీ ములాం హోవహి సేఖ్ ॥ జోగీ జంగమ్ భగవే భేఖ్ ॥
కో గిరహీ కర్మా కీ సంధి ॥
బినూ బూఝే సబీ ఖడీయసి బంధి ॥ 3 ॥
జేతే జీయ లిఖీ సిరి కార్ ॥ కరణీ ఉపరి హోవగి సార్ ॥
హుకము కరహి మూరఖ్ గవార్ ॥
నానక్ సాచే కే సిఫతి భండార్ ॥ 4 ॥
- బసంతు

159. ధ్రుగు తినా కా జీవియా జి లిఖి లిఖి వేచహి నావు ॥
ఖేతీ జిన్ కీ ఉజడై ఖల్వాడే కీయా థావు ॥
సచై సర్మై బాహరె అగై లహహి న దాది ॥
అకలి ఏహ న ఆఖీయై అకలి గవాయీయై బాది ॥
అకలీ సాహిబుం సేవీయై అకలీ పాయీయై మాను ॥
అకలీ పఢికై బుఝీయై అకలీ కీచై దాను ॥
నానకు ఆఖై రాహు ఏహు హోరి గలాం సైతాను ॥ 1 ॥
- వార్ సారంగ్ పౌడీ 20 సలోక్

157. స్నానాలు చేద్దామని తీర్థయాత్రలకు వెళ్తారు. మనస్సు నిండా దురాలోచనలు. తనువు నిండా తప్పుడు పనులు. స్నానం చేయడం వల్ల కొంత మురికి పోయినా, అంతకు రెట్టింపు మళ్ళీ అంటుకుంటుంది. నాదస్వరం బుర్ర ఎంత శుభ్రంగా తోమినా లోపల నిండి ఉన్న విషం కొంచెం కూడా పోదు. స్నానం చెయ్యకపోయినా సాధువు సాధువే. స్నానం చేసినా దొంగ మరింత దొంగ అవుతాడు. (789)

158. బంగారపు పీఠం, బంగారు పాత్ర, రజత రేఖలు చాలా ఉన్నాయి. గంగాజలము, అంగ్యాగ్ని, క్షీరాన్న భోజనము. ఓ మనసా ! మనస్సు సత్యనాముని యందు లగ్నం కానంత వరకూ అలాంటి శుచి వల్ల ఒరిగేదేమిటి ? అష్టాదశ పురాణాలు గ్రంథరూపంలో దగ్గర ఉన్నప్పటికీ, చతుర్వేదములు కంఠోపాఠంగా వచ్చినప్పటికీ, పర్వములలో స్నానం చేసినప్పటికీ, వర్ణానుసారం దానాలు చేసినప్పటికీ, అహోరాత్రాలు కఠోర వ్రతపాలనం చేసినప్పటికీ, కాజీ అయినా, ముల్లా అయినా, షేఖ్ అయినా, కాషాయాంబర ధారియైన యోగి అయినా, జంగం అయినా, అథవా కర్మిష్ఠి అయినా గృహస్థు అయినా, ప్రభువును తెలుసుకోనట్టయితే బంధం తప్పదు. ఎందరు జీవులో అందరికీ లలాట లిఖితమైన కర్మ, ఎవరిది వారిదే. కర్మ వల్లనే నిర్ణయమవుతుంది. ఇతరులపై అధికారాన్ని చలాయించే వారు మూర్ఖులు. అజ్ఞులు. నానక్ చెప్పేదేమంటే గుణనిధియైన ప్రభువును అన్వేషించు, అని. (1169)

159. ఛీ ! ఛీ ! నామము లిఖించి లిఖించి అమ్మువాని జీవనము నికృష్టము. స్వంత పొలం నాశనమై పోయిన వారికి గాదెలో ధాన్యం ఎలా ఉంటుంది ? సత్యము కాని, లజ్జకాని లేనివాడికి పరలోకంలో ఆదరమెక్కడ లభిస్తుంది ? వాదంలో బుద్ధి పోగొట్టుకున్నవాడు బుద్ధిమంతుడెలా అవుతాడు ? బుద్ధి వల్లనే స్వామి సేవ. బుద్ధి వల్లనే సన్మానం లభిస్తుంది. బుద్ధి వల్లనే విద్య. విద్య వల్లనే వానిని తెలుసుకోగలుగుతాడు. బుద్ధి వల్లనే దానం చేస్తాడు. నానక్ చెప్పేదేమంటే ఇదొక్కటే మార్గమని. మిగతావన్నీ దొంగ మార్గాలే. (1245)

160. గియాన్ విహూణా గావె గీత్ ॥
భుఖే ములాఁ ఘరే మసీతి ॥
మఖటూ హెూయికె కంన్ పడాయే ॥
ఫకరు కరే హెూరు జాతు గవాయే ॥
గురు పీరు సదాయే మంగణ్ జాయి ॥
తా కె మూలి న లగీయె పాయి ॥
ఘాలి ఖాయి కిఛు హథహు దేయి ॥
నానక్ రాహు పఛాణహి సేయి ॥ 1 ॥
- వార్ సారంగ్ పౌడీ 22 సలోక్

161. గవూ బిరాహమణ్ కవు కరు లావహు గోబరి తరణు న జాయీ ॥
ధోతీ టికా తై జపమాలీ ధాను మలేఛాఁ ఖాయీ ॥
అంతరి పూజా పడహి కతేబా సంజము తురకా భాయీ ॥
ఛోడీలే పాఖండా ॥
నామి లయియై జాహి తరందా ॥ 1 ॥
- వార్ ఆసా పౌడీ 16 సలోక్

160. జ్ఞాన శూన్యుడు స్వయంగా పాట పాడతాడు. ముల్లా స్తుత్రీడితుడు. వాడు ఇంట్లోనే మశీదు కట్టుకుంటాడు. బ్రతుకుతెరువు లేక చెవులు కుట్టించుకుని ఫకీరు అయ్యాడు. మాన మర్యాదలు వదులుకున్నాడు. గురువు అనిపించుకున్న వాడు ముష్టి ఎత్తుకోవడం ఎందుకు ? అలాంటి గురువు పాదాలు ఎప్పుడూ తాకకు. పరిశ్రమ చెయ్యి. నీవు తిను. ఇతరులకు పెట్టు. నానక్ చెప్పేదమంటే అట్టివాడే ప్రభువు మార్గం తెలుసుకుంటాడు. (1245)

161. గురువు మీదా, బ్రాహ్మణుని మీదా పన్ను వేస్తుంటావు. పేడతో ఇల్లలికి తరించలేవు. ధోవతి ఉంది. బొట్టు ఉంది. జపమాల కూడా ఉంది. మ్లేచ్ఛుల చేతి ధాన్యం తింటూ ఉంటావు. ఇంటిలో పూజ చేస్తావు. బయట కురాన్ చదువుతావు. రీతి, నీతి, అన్నీ తురకలవే. బూటకం వదిలెయ్యి. నామజపం వల్లనే తరించగలుగుతావు. (471)

పంచమ భాగము

# ఆత్మోన్మతి కోసం గార్హస్థ్య జీవితం అత్యాజ్యం

సచి సిమరియే హెూవై పరగాసు ॥
తాతే బిఖియా మహి రహై ఉదాసు ॥
సతిగుర్ కీ ఐసి వడియాయీ ॥
పుత్ర కలత్ర విచే గతి పాయీ ॥ 2 ॥ 3 ॥ 4 ॥
- ధనాసరీ

సత్యస్మరణం వల్లనే మనస్సులో ప్రకాశం కలుగుతుంది. విషయ వలయం ఉన్నప్పటికీ నిర్లిప్తుడుగా ఉంటాడు. సద్గురుని మహిమ వల్ల దారా పుత్రులతో కాపురం చేస్తున్నా ముక్తి కలుగుతుంది.

162. భండి జంమీయై భండి నింమీయై భండి మంగణు వీయాహు ॥
భండహు హోవై దోస్తీ భండహు చలై రాహు ॥
భండు మువా భండు భాలీయై భండి హోవై బంధాను ॥
సో కివు మందా ఆఖీయై జితు జంమహి రాజాన్ ॥
భండహు హీ భండు ఉపజై భండై బాఝు న కోయి ॥
నానక్ భండై బాహరా ఏకో సచా సోయి ॥
జితు ముఖి సదా సాలాహీయై భాగా రతీ చారి ॥
నానక్ తే ముఖ్ ఊజలే తితు సచే దర్‌బారి ॥ 2 ॥

- వార్ ఆసా పౌడి 19 సలోక్

163. దునీయా సాగరు దుతరు కహీయై కివుకరి పాయీయై పారో ॥
చరపటు బోలై ఔధూ నానక్ దేహు సచా బీచారో ॥
ఆపే ఆఖై ఆపే సమ్‌ఝై తిసు కియా ఉతరు దీజై ॥
సాచు కహహు తుమ్ పారగరామీ తుఝు కియా బైసణు దీజై ॥ 4 ॥
జైసే జల్ మహి కమలు నిరాలమ్ ముర్‌గాయీ నైసాణే ॥
సురతి సబది భవసాగరు తరీయై నానక్ నాము బఖాణే ॥
రహహి ఇకాంతి ఏకో మని వసియా ఆసా మాహి నిరాసో ॥
అగము అగోచరు దేఖి దిఖాయే నానకు తా కా దాసో ॥ 5 ॥

- రామకలీ సిధ్ గోసటి

164. హాటి బాటి రహహి నిరాలే రూఖి బిరఖి ఉదియానే ॥
కంద్ మూలు అహారో ఖాయీయై అవధూ బోలై గియానే ॥
తీరథి నాయీయై సుఖు ఫలు పాయీయై మైలు న లాగై కాయీ ॥
గోరఖ్‌పూతు లోహారీపా బోలై జోగ్ జుగతి విధి సాయీ ॥ 7 ॥
హాటి బాటి నీంద్ న ఆవై పర్ ఘరి చితు న డులాయీ ॥
బిను నావై మను టేక్ న టికయీ నానక్ భూఖ్ న జాయీ ॥
హాటు పటణు ఘరు గురు దిఖాయియా సహజే సచు వాపారో ॥
ఖండిత్ నిద్రా అలప్ ఆహారం నానక్ తతు వీచారో ॥ 8 ॥

- రామకలీ సిధ్‌గోసటి

## స్త్రీ నీచురాలు కాదు

162. స్త్రీ వలననే జన్మము. మనమంతా స్త్రీ గర్భంలో నుంచి పుట్టి పెరిగిన వాళ్ళమే. స్త్రీతోనే సంబంధం. స్త్రీతోనే వివాహము. స్త్రీ వల్లనే జగత్తుతో స్నేహం. స్త్రీ వల్లనే వంశాభివృద్ధి. స్త్రీ మరణించినప్పుడు మరొక భార్యను వెదుక్కుంటాము. స్త్రీ వల్లనే మర్యాద నిలుస్తుంది. స్త్రీని గురించి తప్పుడు మాటలు ఎందుకు చెబుతావు ? స్త్రీ వల్లనే రాజులు కూడా జన్మిస్తారు. స్త్రీ వల్లనే స్త్రీ జన్మిస్తుంది. స్త్రీ లేకపోతే ఏమీ లేదు. నానక్ చెప్పేదేమంటే స్త్రీ లేకుండా ఉండేది కేవలం సత్యం మాత్రమే. ఎవరి ముఖము నుంచి సదా ప్రభు గుణగానం వెలువడుతూ ఉంటుందో, వాడే భాగ్యశాలి, శోభామయుడు. నానక్ చెప్పేదమంటే వారి ముఖము సత్యప్రభుని దర్బారులో ఉజ్జ్వలంగా వెలుగుతుంది. (473)

## త్యాగం

163. మన సత్య విచారమేమిటో, తనకు చెప్పమని కొట్టి అడుగుతాడు అవధూత. ప్రపంచం దుస్తరమైన సముద్రం. దానిని తరించడానికి ఉపాయం ఏమిటి ? అనే వానికి నేనేమి జవాబు చెబుతాను ? సమాధానం తెలిసిన వాడే స్వయంగా ప్రశ్నిస్తున్నాడు. నిజం చెప్పు. నువ్వు పారంగతుడివి. నీతో ఎలా వాదిస్తాను ? నీటిలో కమలం నిర్లిప్తంగా ఉన్నట్టు నీటిలో బాతు కూడా మునగకుండా తడవకుడా ఉంటుంది. నానక్ చెప్పేదేమంటే అలాగే శబ్దంలో లీనమై నామాన్ని జపిస్తూ భవసాగరాన్ని దాటుతారు. ఎవరి మనస్సులో ప్రభువు ఒక్కడే వాసం చేస్తుంటాడో వాడే ఏకాంతవాసి. ఆశల మధ్యలో విగతాశుడిలా ఉంటాడు. అగమ్యుడూ, అగోచరుడూ అయిన ప్రభువు స్వయంగా చూస్తాడు. చూపిస్తాడు. నానక్ వానికి దాసుడు. (938)

164. గోరఖ్ నాథుని పుత్రులైన లోహా, రీపా అంటారు. సంతలో సందులో వేరు వేరుగా ఉంటూ ఉంటామని. ఉద్యానాలలో చెట్ల క్రింద నివసిస్తూ ఉంటామని, కందమూలాలు తింటూంటామని. అట్టి అవధూతల వాక్కులో జ్ఞానముంటుంది. తీర్థ స్నానం వల్ల సుఖం లభిస్తుంది. మైల అంటదు. ఇదే యోగ యుక్తి. సంతలో సందులో నిద్ర రాదు. గృహములో చిత్తము విచలితము కాదు. నామము లేక మనస్సు స్థిరం కాదు. ఆకలి తీరదు సంత, నగరం, గృహము అన్నీ గురువే చూపించాడు. అక్కడ సత్య వ్యాపారం సహజంగానే జరుగుతుంది. ఖండితమైన నిద్ర, అల్పాహారము ఉన్న చోటే తత్త్వ విచారం జరుగుతుందని నానక్ అంటాడు. (938 - 39)

165. దరసను భేక్ కరహు జోగ్రిా ముద్రా ఝోలీ ఖింథా ॥
బారహ్ అంతరి ఏకు సరేవహు ఖటు దరసన్ ఇక్ పంథా ॥
ఇన విధి మను సమఝాయీయై పురఖా బాహుడి చోట్ న ఖాయీయై ॥
నానకు బోలై గురముఖి బూఝై జోగ్ జుగతి ఇవ పాయీయై ॥ 9 ॥
అంతరి సబదు నిరంతరి ముద్రా హౌమై మమతా - దూరి కరీ ॥
కాము క్రోధు అహంకారు నివారై గుర్ కై సబది సు సుమఝ్ పరీ ॥
ఖింథా ఝోలీ భరిపురి రహియా నానక్ తారై ఏకు హరీ ॥
సాచా సాహిబు సాచీ నాయీ పరఖై గుర్ కీ బాత్ ఖరీ ॥ 10 ॥
ఊంధ పు ఖపరు పంచ భూ టోపీ ॥
కాయియా కడాసణు మను జాగోటీ ॥
సతు సంతోఖు సంజము హై నాలి ॥
నానక్ గురముఖి నామ్ సమాలి ॥

- రామకలీ సిధ్గోసటి

166. జోగు న ఖింథా జోగు న డండై జోగు న భసమ్ చడాయీయై ॥
జోగు న ముందీ మూండి ముడాయియై జోగు న సింజ్ఞీ వాయీయై ॥
అంజన్ మాహి నిరంజని రహీయై జోగ్ జుగతి ఇబ పాయీయై ॥ 1 ॥
గలీ జోగు న హోయీ ॥
ఏక్ దృష్టి కరి సమసరి జాణై జోగీ కహీయై సోయీ ॥ 1 ॥ రహా ఉ ॥
జోగు న బాహరి మఢీ మసాణీ జోగ న తాడీ లాయీయై ॥
జోగు న దేసి దిసంతరి భవియా జోగు న తీరథి నాయీయై ॥
అంజన్ మాహి నిరంజని రహీయై జోగ్ జగతి ఇవ పాయీయై ॥ 2 ॥
సతిగురు భేటై తా సహసా తూటై ధావతు వరజి రహాయీయై ॥
నిఝురు ఝురై సహజ ధుని లాగై ఘర్ హీ పర్చా పాయీయై ॥ 3 ॥
అంజన్ మాహి నిరంజని రహీయై ॥
జోగ్ జుగతి తాపాయియై ॥
నానక్ జీవతియా మరి రహీయై ఐసా జోగు కమాయీయై ॥
వాజే బాఝుహు సింజ్ఞీ వాజై తవు నిరభవు పదు పాయీయై ॥
అంజన్ మాహి నిరంజని రహీయై జోగ్ జుగతి తౌ పాయీయై ॥ 4 ॥ 1 ॥ 8 ॥

- సూహి

165. యోగి చెప్పసాగాడు - ముద్ర, పాత్ర, బొంత - ఇదే యోగి వేషము. దీనిని ధరించు. పన్నెండు యోగమత్రాలున్నాయి. ఏదో ఒక దానిని సేవించు. షడ్దర్శనాలలో ఇదే శ్రేష్ఠమైన పంథా. ఓ పురుషుడా ! మనస్సుకు తెలియ చెప్పడానికి ఇది ఒక విధి. తిరిగి యముని దండన ముండదు. నానక్ చెప్పసాగాడు - అంతశ్శబ్దమే నిరంతర ముద్ర. అదే యోగయుక్తి. ఇది గురుముఖునికి మాత్రమే తెలుస్తుంది. అహంకారము మమతను దూరం చేస్తుంది. గురూపదేశం వల్లనే జ్ఞానం కలుగుతుంది. కామ, క్రోధ, అహంకారాలు దూరమవుతాయి. ప్రభువు పరిపూర్ణుడు. అదే పాత్ర, అదే బొంత. హరినామము ఒక్కటే తరింప చేస్తుంది. ఓ పురుషుడా ! స్వామి సత్య స్వరూపుడు. నామము సత్యము. ఇదే గురుని దృఢ వచనము. మనస్సును సంసారం నుంచి మరలించడమే కరపాత్ర. పంచభూతములు తలపాగా, కాయము పీట. మనస్సు జాగోటి. దయ, సంతోషము, సంయమము సహకరించాలి. గురువు ద్వారా నామాన్ని హృదయంలో వసింప చేసుకోమంటాడు నానక్. (939)

166. యోగం దండంలోనూ లేదు. బొంతలోనూ లేదు. యోగం భస్మం పూసుకోవడంలోనూ లేదు. ముద్ర వల్ల యోగి కాడు. యోగం ముండనంలో లేదు. యోగం శంఖాన్ని ఊదడంలో లేదు. ఉన్నది నిరంజనుని సమంజనంలో మాత్రమే. ఇదే యోగ యుక్తి, అని గ్రహించాలి. యోగం మాటల వల్ల కాదు. సమదర్శివి, సమవర్తిని కావాలి. అలాంటి వాడినే యోగి అంటారు. యోగం బయట, మఠంలో, శ్మశానంలో లేదు. యోగం ధ్యానంలో లేదు. దేశదేశాంతరాలు పరిభ్రమించడం వల్ల యోగి కాలేడు. యోగం తీర్థ స్నానాలలో లేదు. ఉన్నది నిరంజనుని సమంజనంలో మాత్రమే. ఇదే యోగ యుక్తి అని గ్రహించాలి. సద్గురుడు లభిస్తే సంశయాలు తొలగిపోతాయి. వికలమైన మనస్సు నిశ్చలమవుతుంది. నిర్ఝర ఝర సహజ ధ్వనిలో మనస్సు లీనమై పోతుంది. గృహములోనే పరిచయము లభిస్తుంది. యోగం ఉన్నది నిరంజనుని సమంజనములో మాత్రమే. ఇదే యోగయుక్తి అని గ్రహించాలి. నానక్ చెప్పేది ఏమంటే జీవన్ముక్తుడవు కా, యోగాన్ని సంపాదించుకో. పూరించకుండానే శంఖంలో నుంచి నాదం బయలుదేరుతుంది. నిర్భయం పదవి లభిస్తుంది. నిరంజనుని సమంజనములోనే యోగయుక్తి అందుతుంది. (730)

షష్ఠ భాగము

# ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు

కాదీ కూడ్ బోల్ మలు ఖాయీ ॥
బ్రాహ్మణ్ న్హావై జీయా ఘాయీ ॥
జోగీ జుగతి న జాణై అంధు
తీనే ఓజాడే కా బంధు ॥ 2 ॥ 5 ॥ 1 ॥
 - ధనాసరీ

కాజీ అబద్ధాలు చెపుతాడు. లంచాలు మేస్తుంటాడు. బ్రాహ్మణుడు జీవహింస చేసి శుద్ధి స్నానాలు చేస్తుంటాడు. యోగి అంధుడు. యోగయుక్తి అతనికి బొత్తిగా తెలియదు. ముగ్గురూ పతనానికి బంధువులు.

167. సతీ పాపు కరి సత్ కమాహి ॥
గుర్ దీఖియా ఘరి దేవణ్ జాహి ॥
ఇసతరీ పురఖై ఖటియై భావు ॥ భావై ఆవవు భావై జావు ॥
సాసతు వేద్ న మానై కోయీ ॥ ఆపో ఆపై పూజా హోయీ ॥
కాజీ హోయియీ కై బహై నియాయి ॥ ఫేర్ తస్‌బీ కరే ఖుదాయి ॥
వఢీ లైకై హకు గవాయే ॥ జేకో పుఛై తా పడి సుణాయే ॥
తురక మంత్రు కని రిదై సమాహి ॥
లోక్ ముహావహి చాడీ ఖాహి ॥
చవుకా దే కై సుచా హోయి ॥
ఐసా హిందూ వేఖహు కోయి ॥
జోగీ గిరహీ జటా విభూత్ ॥
ఆగై పాఛై రోవహి పూత్ ॥
జోగు న పాయియా జుగతి గవాయీ ॥
కితు కారణి సిరి ఛాయీ పాయీ ॥
నానక్ కలి కా ఏహు పరవాణు ॥
ఆపే ఆఖణు ఆపే జాణు ॥ 1 ॥

– వార్ రామకలీ సలోక్ 1 పౌడీ ॥

168. ఆది పురఖ్ కవు అలహు కహియె సేఖాం ఆయీ వారీ
దేవల్ దేవతియా కరు లాగా ఐసీ కీరతి చాలీ ॥ 5 ॥
కూజా బాంగ్ నివాజ్ ముసలా నీల్ రూప్ బన్‌వారీ ॥
ఘరి ఘరి మీయా సభనాం జీయాం బోలీ అవర్ తుమారీ ॥ 6 ॥

– బసంత్ హిండోల్ అసట్ పదీయా

169. కలి హోయీ కుతే మూహీ ఖాజు హోవా ముర్దారు ॥
కుడు బోలి బోలి భవుకణా చూకా ధరము బీచారు ॥
జిన్ జీవందియా పతి నహీం మయియా మందీ సోయి ॥
లిఖియా హోవై నానకా కరతా కరే సు హోయి ॥ 1 ॥
రంనా హోయియా బోధీయా పురస్ హోయే సయీయాద్
సీలు సంజము సుచ్ భంనీ ఖాణా ఖాజు అహోజు ॥
సరము గయియా ఘరి ఆపణై పతి ఉఠి చలీ నాలి ॥
నానక్ సచా ఏకు హై అవురు న సచా భాలి ॥ 2 ॥

– వార్ సారంగ్ పౌడీ 14 సలోక్

167. దానం చేసేవాడు పాపం సంపాదించి దానం చేస్తాడు. దీక్ష ఇవ్వడం కోసం గురువు శిష్యుని ఇంటికి వెళతాడు. పురుషుడు ఇంటికి వచ్చినా రాకపోయినా స్త్రీ ప్రేమించేది పురుషుని ధనాన్నే. శాస్త్రాన్ని, వేదాన్నీ ఎవడూ మన్నించడు. అందరూ ఆత్మ పూజారతులే. కాజీ న్యాయం చెబుతూంటాడు. దేవుడి పేరు చెప్పుకుని ప్రతి చోటికి పోతుంటాడు. లంచం పుచ్చుకుని సత్యాన్ని తగలబెడుతుంటాడు. ప్రశ్న అడిగితే పుస్తకం చదివి వినిపిస్తూంటాడు. చెవిలోనూ, హృదయాలలోనూ తురక మంత్రమే. లోకులను మోసగిస్తూ ఉంటాడు. ఇదే వాడి సంపాదన. ముగ్గులు వేసి శుద్ధి చేస్తుంటాడు. అలాంటి హిందువును జాగ్రత్తగా గమనించు. యోగి జటా-విభూతి ధరించిన గృహస్థు. ముందూ వెనుకా భార్యా బిడ్డలు విలపిస్తూ ఉంటారు. అటు యోగం లేదు. ఇటు యుక్తి లేదు. అలాంటప్పుడు తల నిండా బూడిద దేనికి ? నానక్ చెప్పేదేమంటే ఇదే కలియుగ లక్షణం. చెప్పేవారికే దీని సంగతి తెలుసు. (951)

168. షేకుల వంతు వచ్చింది. ఆది పురుషుణ్ణే అల్లా అన్నారు. దేవాలయాల మీద పన్ను విధించారు. ఇదెక్కడి న్యాయం ? తలపాగా, నమాజు, వస్త్రాసనం-ఇవే ముఖ్యం. అదో వ్యాపారం. ఇంటింటా ఒకరికొకరు చెప్పుకుంటూంటారు. అందరూ 'మియాం' అనసాగారు. మాట మారిపోయింది. (1191)

169. కలియుగం కుక్కలా ముఖం పెట్టి కూర్చుంది. శవాల్ని తింటుంది. ప్రతివాడూ అబద్ధం చెబుతాడు. అరుస్తూంటాడు. ధర్మాన్ని స్మరించాడు. జీవితంలో గౌరవం ఎవ్వరికీ లేదు. మరణించినప్పుడు తన చెడ్డ పేరు మిగిల్చి పోతాడు. అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది. నానక్ చెప్పేదేమంటే కర్త సంకల్పించినదే జరుగుతుంది. భార్యకు మతిలేదు. భర్త వేటకాడు, శీలము స్వచ్ఛత, సంయమము లుప్తమై పోయాయి. నిషిద్ధ వస్తువులన్నీ సేవ్య మయ్యాయి. లజ్జ ఇంట్లో మూల దూరింది. దానితో పాటే ఆత్మగౌరవమూనూ. నానక్ చెప్పేదేమంటే సత్యమైన వాడు వాడు ఒక్కడే. మరెక్కడా సత్యాన్ని అన్వేషించకు. (1242 - 43)

170. హరిణాఁ బాజాఁ తె సిక్‌దారాఁ ఏన్హా పఢియా నావు ॥
పాంధీ లగీ జాతి ఫహాయిని అగె నాహిఁ థావు ॥
సో పడియా సో పండితు బీనా జినీ కమాణా నావు ॥
పహిలో దే జడ్ అందరి జంమై తా ఉపరి హెూవె ఛావు ॥
రాజే సీహ ముకదమ్ కుతే ॥ జాయి జగాయిన్ బైఠే సుతే ॥
చాకర్ నహదా పాయిన్హి ఘావు ॥
రతు పితు కుతిహెూ చటి జాహు ॥
జిథె జీయాఁ హెూసీ సార్ ॥
నకీఁ వఢీఁ లాయిత్‌వార్ ॥ 2 ॥ – వార్ మలార్ పౌడీ 22 సలోక్

171. మాణస్ ఖాణే కరహి నివాజ్ ॥
ఛురీ వగాయిని తిన్ గలి తాగ్ ॥
తిన్ ధరి బ్రహ్మణ్ పూరహి నాద్ ॥
ఉనా బి ఆవహి ఓయీ సాద్ ॥
కూడీ రాసి కూడా వాపారు ॥
కూడు బోలి కరహి ఆహారు ॥
సరమ్ ధరమ్ కా డేరా దూరి ॥
నానక్ కూడు రహియా భర్‌పూరి ॥
మథె టికా తేడి ధోతి కఖాయీ ॥
హథి ఛురీ జగత కాసాయీ ॥
నీల బసత్ర పహిరి హెూవహి పరవాణు ॥
మలేఛ్ ధాను లే పూజహి పురాణు ॥
అభాఖియా కా కుఠా బకరా ఖాణా ॥
చవుకే ఉపరి కిసె న జాణా ॥
దేకె చవుకా కఢీ కార్ ॥
ఉపరి ఆయి బైఠే కూడియార్ ॥
మతు భిటై వే మతు భిటై ॥
ఇహు అంజు అసాడా ఫిటై ॥
తని ఫిటై ఫేడ్ కరేని ॥
మని జూఠె చులీ భరేని ॥
కహు నానక్ సచు ధియాయీయై ॥
సుచి హెూవై తా సచు పాయీయై ॥ 2 ॥
– వార్ ఆసా పౌడీ 16 సలోక్

170. జింక, డేగ, సర్దారు - వీళ్ళను సుశిక్షితులంటారు. ఉచ్చు పన్నారు. అందులో మంద అంతా చిక్కుకు పోతుంది. ఇలాంటి వారికి పరలోకంలో స్థానం ఎక్కడ దొరుకుతుంది ? నామధనం సంపాదించిన వాడే సుశిక్షితుడు వాడే పండితుడు. వాడే చతురుడు. భూమిలో వ్రేళ్ళు బాగా పాతుకున్నప్పుడే పైన చెట్టు కూడా చక్కని నీడ ఇవ్వగలుగుతుంది. రాజు, పులి, చౌదరి, కుక్క - ప్రశాంతంగా నిద్రిస్తున్న ప్రజలను రెచ్చగొట్టి మేలుగొలుపుతారు. చాకర్లు, గోళ్ళున్నవారు గాయపరుస్తారు. రక్తాసక్తమైన కుక్క నాకుతుంది. జీవుల సుఖదుఃఖ విచారణ జరిగే చోట ఆ తుచ్ఛులను విశ్వసించేదెవరు ? (1288)

171. మానవ భక్షకుడు నమాజు చదువుతాడు. మరి జందెం వేసుకుంటాడు. కత్తి ఝుళిపించేస్తాడు. బ్రాహ్మణుడు అలాంటి వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి ఆశీర్వదిస్తాడు. తమ యజమానులు చేసే ఇలాంటి వ్యవహారాలన్నీ వాళ్ళకి ఇష్టం. వెల్లని రూపాయలతో తప్పుడు వ్యాపారం చేస్తూ అబద్ధాలాడి అన్నం తింటూంటారు. సిగ్గు, ధర్మం పారిపోయాయి. నానక్ చెప్పేదేమంటే అబద్ధం అంతటా వ్యాపించింది. నుదుట బొట్టు, కావి వస్త్రము, చేతిలో కత్తి వీడే జగత్కసాయి. నీలి వస్త్రం ధరించి మాన్యుడవుతాడు. మ్లేచ్ఛ ధ్యానము స్వీకరించి, గ్రంథాలను, పురాణాలను పూజిస్తాడు. పరభాష మంత్రాలను నోటినిండుగా పల్లిస్తూంటాడు. గొఱ్ఱె మాంసం తింటూంటాడు. కాని తినే చోటికి మరొకరెవ్వరూ రాకూడదంటాడు. సరిహద్దులు గీసి పెరడు కట్టుకుంటాడు. అందులో కూర్చుని అబద్ధాల ఆసామి అంటుంటాడు. "ఈస్థలంలో మరెవ్వరూ అడుగు పెట్ట కూడదు. మనం తినే అన్నం అపవిత్రం కాకూడదు" అని. అన్ని అవలక్షణాలతో కూడిన వికారి ఇతరులను దూషిస్తూ ఉంటాడు. నిండా అబద్ధాలు నింపుకుని నోరు మాత్రం పుక్కిలిస్తూ ఉంటాడు. నానక్ చెప్పేదేమంటే సత్యాన్ని ధ్యానించు. సత్యము లభిస్తే శుచివైపోతావు. (471 - 72)

